దిఙ్నాగప్రణీత-సంస్కృతనాటకమ్

# కున్దమాలా



తెలుగు వచనానువాదము

పులిపాక వేంకటలక్ష్మీకాంతరావు

# కుందమాల

## (దిఙ్నాగుడి సంస్కృతనాటకం-సరళానువాదసహితము)

***లక్ష్మణుడు:*** *'గొప్పవంశంలో పుట్టి, ఉన్నతమైన గుణశీలసంపదలున్న నిన్ను, సుఖంలో దుఃఖంలో తోడుగా ఉన్న నిన్ను కేవలం లోకాపవాదభయంతోనే విడిచిపెడుతున్నాను. అంతేకానీ నీయందు దోషంవల్ల మాత్రం కాదు.' అని అన్నగారి సందేశం.*

***సీత:*** *ఎటువంటి లోకాపవాదభయం? నాయందేమైనా దోషమున్నదా?*

***లక్ష్మణుడు:*** *నీయందు దోషమా తల్లీ! ఋషులు, లోకపాలకులు, అన్నగారు, నేనూ ఉండగా అగ్నిప్రవేశంవల్ల నీ పాతివ్రత్యం నిరూపించబడింది, కానీ...*

**దిఙ్నాగాచార్యప్రణీతా**

# కున్దమాలా

**తెలుగు అనువాదం**

పులిపాక వేంకటలక్ష్మీకాంతరావు

**సహకారం**

ఉరుపుటూరి శ్రీనివాస్, సంకా ఉషారాణి


**స్వర్వాణీప్రకాశసేవానికుఞ్జమ్**

తిరుపతిః

౨౦౨౧

కున్దమాలా-(దిఙ్నాగాచార్యప్రణీతా)

(సంస్కృతమూలము-సరళానువాదసహితము)

అనువాదము: పులిపాక వేంకటలక్ష్మీకాంతరావు

ప్రథమముద్రణ: మే, 2021

వెల: నూటనలభై ఐదు రూపాయలు (₹.145/-)

ముద్రణ: ముద్రిక ప్రింటర్స్ అండ్ పబ్లిషర్స్,
గాంధీనగర్, విజయవాడ
(ఫోను: 94402 59456)

ప్రచురణ: స్వర్వాణీప్రకాశసేవానికుఞ్జమ్, తిరుపతి

ప్రతులకు: ఉరుపుటూరి శ్రీనివాస్

(98859 19398; schary.vuruputuri@gmail.com )

అనుక్రమణిక

## నామాట

నేను సంస్కృతపండితుణ్ణి కాదు. కుందమాల గురించి ముఖపుస్తకంలో కొందరి వ్యాసాలు చదివి హిందీ-సంస్కృతవ్యాఖ్యతో ఉన్న ఆచార్య లోకమణి దాహల గారి కుందమాల పుస్తకాన్ని చౌఖంబా సురభారతి, వారణాసి నుండి తెప్పించుకున్నాను. కూడపలుక్కుంటూ చదివి నాకు సులభంగా ఉంటుందని తెలుగులో వ్రాసుకున్నాను. ఆసక్తి ఉన్న నావంటి వారు చదివి ఆనందిస్తారు కదా అని వాట్స్ యాప్ సదస్సులో పంపాను.

నేను చేసుకున్న పుణ్యవిశేషం వలన అది చిరంజీవులు సంకా ఉషారాణికి, ఉరుపుటూరి శ్రీనివాసుకి నచ్చింది.

వాళ్ళిద్దరూ చాలా శ్రమతీసుకొని నేను పంపిన ముడి సరుకును బాగుచేసి ఈ పుస్తక రూపంలోకి తెచ్చారు.

వారు గీర్వాణభాషామతల్లిని భక్తితో సేవిస్తున్నారు.

వారికి ధన్యవాదాలు. ఆశీస్సులు.

భవదీయుడు
పులిపాక వేంకట లక్ష్మీకాంతరావు

# కొన్ని పరిచయవాక్యాలు

ఉరుపుటూరి శ్రీనివాస్

## కుందమాల గురించి, దిజ్ఞాగుడి గురించిన్నీ

'కుందమాల' నాటకము గురించి ప్రస్తావనలు పూర్వగ్రంథాలలో కనవడుతూ ఉండేవి కానీ చాలా కాలము ఈ గ్రంథం అలభ్యంగానే ఉండిపోయింది.

తొట్టతొలుతగా, 1923లో మానవల్లి రామకృష్ణకవి గారు, ఎస్.కె.రామనాథశాస్త్రి గారు ఈ నాటకాన్ని సంశోధించి 'దక్షిణభారతి గ్రంథమాల'లో రెండవ సంపుటముగా అచ్చువేసారు. తంజావూరు సరస్వతి మహల్ గ్రంథాలయములో రెండు తాళపత్రగ్రంథప్రతులు, మైసూరులోని ప్రభుత్వప్రాచ్యగ్రంథాలయములో దొరికిన మరొక రెండు ప్రతులు ఈ ప్రచురణకు ఆధారాలు[1]. ఈ తాళపత్రగ్రంథాలు శిథిలావస్థలో ఉండినాయి. లేఖనదోషాలతో ఉండినాయి. అసమగ్రాలు కూడా[2].

---

[1] తంజావూరు ప్రతులలో ఒకటి గ్రంథలిపిలో ఉన్నది. మరొకటి దానికి తెలుగు నకలు. మైసూరు ప్రతులలో ఒకటి గ్రంథలిపిలో ఉన్నది, , మరొకటి దానికి కన్నడ నకలు. ఇవి కాక మరొక రెండు ప్రతులు ప్రైవేటు గ్రంథభాండారాలలో దొరికాయని రామకృష్ణకవిగారు తమ ముందుమాటలో చెప్పారు కానీ వివరాలు ఇవ్వలేదు.

[2] తంజావూరు ప్రతులలో నాంది, ప్రథమాంకపు తొలి సంభాషణలు లేవు, ఐదవ, ఆరవ అంకంలో ఖాళీలు ఉన్నాయి; మైసూరు ప్రతులలో మొదటి అంకపు మలిభాగము, రెండవ అంకము, మూడవ అంకపు మొదలు లేవు, ఆరవ అంకంలో శ్లోకాలు సగానికి విరిగి ఉన్నాయి; అదృష్టవశాత్తు, ఈ శకలాల, శిథిలాల లిఖితప్రతులలన్నింటినీ కలుపుకుంటే కుందమాల తాలూకు పూర్తి పాఠం (దాదాపుగా) లభ్యమవుతున్నది.

ఈ లిఖితప్రతులలోని పాఠాలను సమన్వయం చేసుకుంటూ, ఖాళీలను పూరించుకుంటూ, తప్పులను దిద్దుకుంటూ, ప్రాకృతసంభాషణలకు సంస్కృత- ఛాయానువాదాన్ని సంతరించి కుందమాల నాటకాన్ని ప్రచురించారు ఈ పండితులిద్దరూ.

ఇలాంటి గ్రంథాలు వెలుగు చూసినప్పుడు, వాటి వెనకాలే నీడల్లా అనుసరిస్తాయి మూడు ప్రశ్నలు – గ్రంథకర్త ఎవరు? ఎక్కడివాడు? ఎప్పటివాడు?

యథావిధిగా పరిశోధకులకు కావలసినంత కాలక్షేపాన్ని సమకూర్చాయి ఈ ప్రశ్నలు – కుందమాల సందర్భంలో కూడా.

ఈ నాటకపు నాంది ప్రస్తావనలో 'అరారాలపురవాస్తవ్యుడైన దిఙ్నాగుడి రచన' ఇది అని ఉన్నది. తంజావూరు ప్రతి చివరలో రచయితను అనూపరాధకు చెందిన ధీరనాగుడని పేర్కొన్నారు. ఈ అరారాలపురము ఎక్కడిదో తెలియదు, అనూపరాధ ఎక్కడున్నదో కూడా తెలియదు. దిఙ్నాగుడా, ధీరనాగుడా లేక మరొకరా[3] ఇంకా తేలలేదు[4]. ఈ దిఙ్నాగుడు సుప్రసిద్ధ బౌద్ధతార్కికుడని ఒక వాదము. కాళిదాసు తన మేఘదూతంలో 'దిఙ్నాగానాం పథి పరిహరన్ స్థూలహస్తావలేపాన్' అని అన్నప్పుడు ఈ

[3] వీరనాగుడు, రవినాగుడు అని మరొక రెండు పేర్లు పోటీలో ఉన్నాయి. దిఙ్నాగుడు, ధీరనాగుడు ఒక్కరేనని ఒక వాదన. ధీరనాగుడు, వీరనాగుడు ఒకే పేరుయొక్క రెండు రూపాలని ఇంకొక వాదన,

[4] చాబా దెజ్యో (Csaba Dezso) అనే పరిశోధకుడు సా.శ.2007వ సంవత్సరంలో ప్రచురించిన A parallel Edition of the Nepalese and South Indian Recensions of the First Act of the kundamālā అనే వ్యాసంలో – నేపాలీ పాఠంలోని ప్రస్తావనలో నాటకకర్త పేరు ధీరనాగుడని, అతని ఊరు అనురాధపురమని ఉన్నదని పేర్కొన్నాడు. ఈ అనురాధపురము శ్రీలంకలో ఉన్నది.

దిఙ్నాగుడినే ఉద్దేశించాడని, కాదని, భవభూతికి పూర్వీకుడని, కాదు, తదనంతరకాలంలో జీవించినవాడని…[5]

## ఉత్తరకాండలో సీతావనవాస వృత్తాంతము

రామాయణపు ఉత్తరకాండలోని సీతావనవాసవృత్తాంతము కుందమాల నాటకానికి మూలకథ. క్లుప్తంగా[6] –

రావణవధానంతరము అయోధ్యకు తిరిగివచ్చాక సీతారాములు సుఖసంతోషాలతో జీవిస్తున్నారు. పదివేల ఏళ్ళు నిశ్చింతగా గడిచిపోయాయి. ఆ తరువాత ఒక వసంతకాలంలో సీత గర్భాన్ని ధరించింది. గర్భిణి అయిన సీత తనకు గంగాతీరంలోని పవిత్రతపోవనాలను దర్శించాలని ఉన్నదని, అక్కడి ఋష్యాశ్రమాలలో మునీశ్వరుల సన్నిధిలో కనీసం ఒక రాత్రైనా గడపాలని ఉన్నదని కోరుకున్నది. తన కోరికను తీరుస్తానని మాట ఇచ్చాడు రాముడు.

ఆ సంభాషణ జరిగిన రోజే రాముడికి భద్రుడనే ఆంతరంగికుడి ద్వారా తెలిసింది – రావణుడి చెరలో కాలం గడిపిన సీతను రాముడు మళ్ళీ తన ఇంట చేర్చుకోవడం గురించి అయోధ్యానగరవాసులు చెడుగా అనుకుంటున్నారట. అన్ని నగరాలలో, గ్రామాలలో పౌరులు ఇదే మాట చెప్పుకుంటున్నారట. ఆ లోకాపవాదం రాముడి మనస్సును కలచివేసింది.

---

[5] కుందమాలపై సమగ్రపరిశోధనను చేసి సంశోధితపాఠాన్ని ప్రకటించిన కాళీ కుమార్ దత్తా ప్రకారం దిఙ్నాగుడు సా.శ.ఐదవ శతాబ్దంలో – కాళిదాసుకు భవభూతికి మధ్యకాలంలో - జీవించి ఉండాలి. ఐతే, ఈ అభిప్రాయంతో విభేదించినవారూ ఉన్నారు.

[6] రామాయణము ఉత్తరకాండ 42-52 సర్గలు, 93-99 సర్గలు; ఈ క్రింది కథ వాల్మీకి రామాయణము ఉత్తరకాండలోని కథకు పుల్లెల రామచంద్రుడు గారు చేసిన అనువాదానికి సంక్షిప్తీకరణము

వెంటనే, తన సోదరులను పిలిపించాడు. ప్రజలలో వ్యాప్తి చెందుతున్న నింద గురించి వాళ్ళతో చెప్పాడు. సీతను పరిత్యజించాలనుకున్న తన నిర్ణయాన్ని ప్రకటించాడు. గంగానదికి అవతలి ఒడ్డున తమసానదీతీరాన్ని ఆనుకొని ఉన్నది వాల్మీకి ఆశ్రమం. దాని సమీపంలోనున్న విజనప్రదేశంలో సీతను విడిచిపెట్టి రమ్మని లక్ష్మణుడిని ఆజ్ఞాపించాడు. గంగాతీరాన ఉన్న ఆశ్రమాన్ని చూడాలనుకున్న సీత కోరికనూ గుర్తుకు చేసుకున్నాడు బాష్పపూరితనేత్రుడైన రాముడు.

మర్నాడు ఉదయాన సుమంత్రుడు రథాన్ని సిద్ధం చేసాడు. మునిపత్నుల కోసం కానుకలను తీసుకొని లక్ష్మణుడితో కలిసి బయలుదేరింది సీత. గోమతీతీరం వద్ద ఉన్న ఆశ్రమం వద్ద ఆ రాత్రి విడిది చేసారు. ఉదయాన, మళ్ళీ రథాన్నెక్కి గంగాతీరానికి చేరుకున్నారు. అప్పటిదాకా దుఃఖాన్ని బిగబట్టుకున్న లక్ష్మణుడు గట్టిగా ఏడ్చేసాడు. రెండు రోజులు రాముడిని చూడలేదన్న బెంగతో ఏడుస్తున్నాడనుకున్నది సీత. ఓదార్చింది.

నిషాదుడు తెచ్చిన పడవనెక్కి గంగకు అటువైపుకు చేరుకున్నారు. అంజలి ఘటించి, కన్నీరు కారుస్తూ లక్ష్మణుడు అసలు సంగతి చెప్పాడు. సీత అలవికాని దుఃఖంతో మూర్ఛిల్లింది. తేరుకున్నది. తన పరిస్థితిని పూర్తిగా ఆకళింపు చేసుకున్నది. తను ఇక్ష్వాకుల వంశాంకురాన్ని మోస్తున్నది, కనుక గంగలోకి దిగి ప్రాణత్యాగము చేయజాలదు. భర్త ఆజ్ఞానుసారము, అతడికి దూరంగా ఉండేందుకు సిద్ధపడింది. అత్తగారలకు, మహారాజుకు తన నమస్కారాలను అందజేయమన్నది. పౌరులను సోదరులవలె చూసుకొమ్మని రాముడికి తన మాటగా చెప్పమన్నది. లక్ష్మణుడు వెళ్ళిపోయాడు. ఏడుస్తూ కూర్చున్న సీతను మునికుమారులు చూసారు. వాల్మీకి మహర్షికి తెలియజేసారు. ఆయన దివ్యదృష్టితో విషయాన్ని గ్రహించాడు. సీతను తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు.

లక్ష్మణుడు తిరిగివెళుతూ ఉండగా, సుమంత్రుడు అతడికి తాను మునుపు దుర్వాసుడు దశరథుడికి చెప్పగా విన్న సంగతులు చెప్పాడు – పూర్వం, విష్ణువుతో యుద్ధంలో ఓడి పారిపోయిన రాక్షసులు భృగుమహర్షి భార్యను శరణు కోరారు. ఆమె అభయం ఇచ్చింది. విష్ణువు ఆమెను సంహరించాడు. అందుకు కోపించిన భృగువు విష్ణువు మనిషై పుడతాడని దీర్ఘకాలం పత్నీవియోగం అనుభవిస్తాడని శపించాడు. లోకహితార్థం ఆ శాపాన్ని స్వీకరించిన విష్ణువే దశరథుడి ఇంట రాముడై పుట్టాడు. ఇప్పుడు రాముడు అనుభవించనున్న వియోగం ఆ శాపఫలితమే. రాముడు పదకొండువేలయేళ్ళ పాటు రాజ్యం చేస్తాడనీ, సీతకు ఇద్దరు కుమారులు పుట్టనున్నారని కూడా దుర్వాసుడు దశరథుడితో ఆనాడే చెప్పాడు.

ఆ మాటలు విని సంతోషించాడు లక్ష్మణుడు. అయోధ్యకు చేరుకున్నాడు. అక్కడ రాముడు దీనుడై విలపిస్తూ ఉన్నాడు. లక్ష్మణుడు అతడిని ఊరడించాడు. “భార్యావియోగదుఃఖంతో ప్రజాపాలనను విస్మరిస్తే స్వకర్తవ్యవిముఖుడవైనావనే అపకీర్తి కలుగుతుంది” అని హెచ్చరించాడు. రాముడు ఆ మాటల ఔచిత్యాన్ని గ్రహించాడు, మళ్ళీ రాజ్యపాలన వ్యవహారాలలో క్రియాశీలుడయ్యాడు.

వర్షాకాలం వచ్చింది. ఒక శ్రావణమాసపు అర్ధరాత్రివేళ వాల్మీకి ఆశ్రమంలోనున్న సీత కవల పిల్లలను కన్నది. కుశలవులని వారికి నామకరణం చేసాడు వాల్మీకి. సీత ప్రసవించిన రాత్రి – లవణాసురుడితో యుద్ధానికని బయలుదేరిన – శత్రుఘ్నుడు వాల్మీకి ఆశ్రమంలోనే ఉన్నాడు. సీతను ‘అదృష్టవంతురాలివి’ అని పలకరించాడు కూడా.

పన్నెండేళ్ళు గడిచాయి.[7] రాముడు నైమిశారణ్యంలో గోమతీతీరాన సీత స్వర్ణప్రతిమను పక్కన ఉంచుకొని అశ్వమేధయాగం ప్రారంభించాడు. ఆ యజ్ఞం ఏడాదికి కొంచెం ఎక్కువ కాలం పాటు కొనసాగింది. అది అట్లా జరుగుతూ ఉండగా, అక్కడికి వాల్మీకి శిష్యులతో సహా వచ్చాడు. కుశలవులను యజ్ఞస్థలపు పరిసరాలలో జనులు గుమిగూడేచోట్లలో రామాయణకావ్యగానం చేయమని ఆదేశించాడు. వారి పాటను విన్న రాముడికి కుతూహలం కలిగింది. ఒక గొప్ప సభను ఏర్పాటు చేసి ఆ బాలురను పిలిపించాడు. చాలా రోజులు రామాయణగానం సాగింది. ఆ గీతాన్ని బట్టి వాళ్ళిద్దరూ తన పుత్రులేనని తెలుసుకున్నాడు రాముడు. ఆలోచనలో పడ్డాడు. ముని అనుమతితో తన పవిత్రతను నిరూపించుకోవలసినదిగా సీతకు సందేశం పంపాడు.

సీతను వెంటబెట్టుకొని వాల్మీకి యజ్ఞశాలకు వచ్చాడు. సీత పరిశుద్ధ అని ఉద్ఘోషించాడు వాల్మీకి. సీత నిరపరాధ అని అగ్ని, వాయువు వంటి దేవతలే సాక్ష్యం చెప్పారనీ, మహర్షి యథార్థం చెబుతున్నాడని తనకు తెలుసునని చెప్పిన రాముడు జనుల మధ్య సీత పరిశుద్ధురాలిగా నిరూపింపబడాలని కోరాడు. అప్పుడు, మనోవాక్కాయకర్మలతో తను రాముడిని మాత్రమే పూజించినట్లైతే భూదేవి తనకు ప్రవేశాన్ని కల్పించుగాక[8] అని సీత శపథం చేసింది. భూదేవి వచ్చి సీతను అక్కున చేర్చుకొని తన సింహాసనముపై కూర్చుండబెట్టుకొని రసాతలానికి తీసుకువెళ్ళింది. రాముడు ఎంతో శోకించాడు, భూదేవిపై క్రోధాన్ని ప్రకటించాడు. బ్రహ్మ రాముడికి తన విష్ణుతత్త్వాన్ని సూచించి, సీత నాగలోకములో రాముడిని స్మరిస్తూ

---

[7] పన్నెండేళ్ళ తరువాత శత్రుఘ్నుడు రామదర్శనార్థము అయోధ్యకు తిరిగివెళుతూ వాల్మీకి ఆశ్రమంలో మళ్ళీ విడిది చేసాడు. రామాయణగానాన్ని విన్నాడు కూడా.

[8] ‘‘వివరం దాతుమర్హతి’’ = (లోనికి ప్రవేశించేందుకు) రంధ్రమును ఇచ్చుగాక

ఉంటుందని, సీతను తను మళ్ళీ స్వర్గంలో కలుసుకుంటాడని నచ్చజెప్పాడు. కుశలవులను వెంటబెట్టుకొని రాముడు తన పర్ణశాలలోనికి వెళ్ళిపోయాడు. సీతను గురించి ఆలోచిస్తూ రాత్రిని గడిపాడు. ఆ మరునాడు కుశలవులు ఉత్తరకాండ శేషభాగాన్ని[9] గానం చేసారు.

తరువాతి కథ రామావతారసమాప్తి దిశగా కొనసాగి సమాప్తమవుతుంది.

## మరి కుందమాల కథ ఏమిటి?

సీతను లక్ష్మణుడు రథములో గంగాతీరానికి తీసుకురావడంతో మొదలవుతుంది ఈ నాటకం. గంగానది చల్లని గాలులలో ప్రయాణపు బడలికను తీర్చుకుంటున్న సీతకు శోకావిష్టుడైన లక్ష్మణుడు రాముడి ఆదేశాన్ని, సందేశాన్నీ విన్నవించి, ఆమెను కాపాడుతూ ఉండమని దిక్పాలకులను, భాగీరథిని, వన్యమృగాలను వేడుకొని, నిష్క్రమిస్తాడు. అరణ్యంలో ఒంటరిగా రోదిస్తున్న సీతను వెదుక్కుంటూ వచ్చి వాల్మీకి ఆమెను తన ఆశ్రమానికి తీసుకెళతాడు. సుఖప్రసవం జరిగితే ప్రతి రోజూ ఒక మల్లెపూలదండను (కుందమాలను) సమర్పిస్తానని గంగామాతకు మొక్కుకుంటుంది సీత.

కుశలవులు జన్మించారు. పెరుగుతున్నారు. మహర్షి దగ్గర రామాయణగానం నేర్చుకుంటున్నారు. వియోగపు తలపోతల్లో ఉన్నది సీత. ఇంతలో, రాముడు అశ్వమేధయాగాన్ని తలపెట్టనున్నాడన్న వార్త అందుతుంది. సమీపంలో ఉన్న నైమిశారణ్యంలోనే. 'యాగార్థం మళ్ళీ పెళ్ళి చేసుకుంటాడా?', 'కుశలవులు రాముడిని చూడగలుగుతారా?'... ప్రశ్నలు

---

[9] "భవిష్యదుత్తరం కావ్యం" (రానున్న రోజుల్లో జరగబోయే కథ)

మెదులుతుండగానే ఆశ్రమవాసులకు ఆహ్వానాన్ని మోసుకొస్తారు రామదూతలు.

యజ్ఞస్థలానికి బయలుదేరిన రామలక్ష్మణులకు గోమతీనదిలో కొట్టుకువస్తున్న కుందమాల కనిపిస్తుంది. ఆ అల్లిక తీరు సీతదే అని పోల్చుకుంటాడు రాముడు. ఇసుకలో సీత పాదముద్రలను అనుసరిస్తూ వెళతారు. ఆ అడుగులు ఆశ్రమసమీపాన ఉన్న లతామంటపం దగ్గర మాయమవుతాయి. ఆ మంటపంలో కూర్చొని రాముడు సీత కోసం దుఃఖిస్తాడు. పొదరింటి చాటున దాగి ఉన్న సీత వాళ్ళిద్దరి మాటలను అన్నింటినీ వింటుంది. ఎదుటపడాలన్న కోరికను అణచుకొని నిష్క్రమిస్తుంది.

వాల్మీకి ఆశ్రమానికి సమీపంలో ఒక దీర్ఘిక (దిగుడుబావి) ఉంది. ఈ యజ్ఞసమయంలో రామపరివారపు సంచారం వల్ల ఆశ్రమవాసినులకు ఇబ్బంది కలుగకుండా, 'ఆ బావి దగ్గర స్త్రీలు పురుషులకు కనబడకుందురు గాక' అని వాల్మీకి ఒక కట్టడి చేస్తాడు. రాముడి కంటబడకుండా ఉండేందుకు సీత ఆ బావిగట్టు మీదే కాలం గడుపుతూ ఉంటుంది. ఆకస్మికంగా – రాముడు అక్కడికి వస్తాడు. సీతను కాదు కానీ బావి నీటిలో సీత ఛాయను చూస్తాడు. విహ్వలుడై మూర్ఛపోతాడు. ఇంకా అదృశ్యంగానే ఉన్న సీత అతడికి ఉపచారాలు చేస్తుంది. ఆ ఘటనాక్రమంలో, సీత ఉత్తరీయం రాముడికి అందుతుంది. దానిని అతడు గుర్తిస్తాడు. తను జారవిడిచిన ఉత్తరీయం సీత అందుకుంటుంది. కాస్సేపట్లో, సీత అక్కడినుంచి తప్పుకుంటుంది. 'సీత కనబడలేదు, కానీ ఈ ఉత్తరీయం సీతదే. ఇది ఎలా సంభవం?' అని ఆలోచిస్తున్న రాముడు, తనను వెదుక్కుంటూ వచ్చిన విదూషకుడు చెప్పిన ఒక రహస్యాన్ని విని 'ఇది తిలోత్తమ మాయ కాబోలు' అని నిరాశపడిపోతాడు.

ఆ మరునాడు, కుశలవులు ఆస్థానమంటపంలో రాముడిని సందర్శిస్తారు. వాళ్ళను చూడగానే రాముడిలో పుత్రవాత్సల్యం పెల్లుబుకుతుంది. కావిలించుకొని, సింహాసనంపై కూర్చోబెట్టుకుంటాడు. విదూషకుడు వారిస్తాడు. ఇక్ష్వాకువంశస్థులు కాక అన్యులు ఆ సింహాసనం పై కూర్చుంటే, వాళ్ళ తలలు వందల ముక్కలైపోతాయన్న విశ్వాసాన్ని గుర్తుకు చేస్తాడు. ఈ కవలలు క్షేమంగా ఉన్నారంటే అందుకు కారణం తపోమహిమా లేక…?

ఆ తరువాత, సభామంటపంలో రామాయణకథాగానం జరుగుతుంది. కుశలవులు తన పిల్లలే అని రాముడికి తెలుస్తుంది. సీత పాతివ్రత్యశపథం చేస్తుంది. భూదేవి ఆ మాటను ధ్రువీకరిస్తుంది. రాముడు సీతను పునఃస్వీకరిస్తాడు. వెంటనే కుశుడికి పట్టాభిషేకం చేస్తాడు. లవుడిని యువరాజుగా చేస్తాడు.

## కుందమాల పాత్రలు – ఒక పరామర్శ

కుందమాల నాటకంలో సీతదే ప్రధానపాత్ర. ఈ సీత అలౌకిక దివ్యమూర్తి కాదు, విభిన్నభావోద్వేగాలతో తొణికిసలాడే అచ్చమైన మనిషి. ముఖ్యంగా ఆత్మాభిమానం ఉన్న స్త్రీ. అగ్నిప్రవేశం చేసి మరీ తన నిర్దోషత్వాన్ని నిరూపించుకున్నప్పటికీ నిరంకుశులైన ప్రజల అపవాదుకు గురైనానన్న విషయం తెలిసినప్పుడు “అహో, నా అధన్యత్వము! ... సీత గురించే ఇట్లా ఆలోచిస్తున్నారంటే, చాలు, చాలు స్త్రీత్వము!”[10] అని అంటుంది. ఆ మాటల్లో, నిస్సహాయత కన్నా ధర్మాగ్రహం, తన తోటి స్త్రీల పట్ల సహానుభూతి బలంగా వినబడుతాయి. ఒక అంతరువులో ఆ కోపాన్ని బాధను నిలుపుకుంటూనే,

[10] సీతకు ఇంత అవమానం ప్రాప్తమయ్యిందంటే, మిగతా స్త్రీలకు దక్కే గౌరవం ఏపాటిది?

మరొక అంతరువులో రాముడిపైన తనకున్న గాఢప్రేమను భద్రంగా ఉంచుకుంటుంది. ఏళ్ళు గడిచినాక కూడా అతడి ప్రేమ తనయందే ప్రతిష్ఠితమై ఉంటుందని ఆమెకు దృఢమైన విశ్వాసం.

సుదీర్ఘవియోగానంతరం రాముడిని పొదరింటి చాటునుంచి చూసినప్పుడు, ''ఈయనను చూస్తే సంతోషం కలుగుతున్నది. నన్ను త్యజించి ఇంతకాలం వనవాసం విధించాడని కోపం వస్తున్నది. చాలా చిక్కిపోయాడు. చూస్తే దుఃఖం కలుగుతున్నది. నిర్దయుడని బాధ. చిరపరిచయం వల్ల ప్రేమ. చూడదగినవాడని ఉత్కంఠ. స్వామి అని ఆదరం. కుశలవులకు తండ్రి అని గృహిణీభావం. నేరారోపణకు గురైనానని సిగ్గు.'' అంటూ ఉక్కిరిబిక్కిరి అయిపోతుంది.

ఈ నాటకానికి పరాకాష్ట అని చెప్పదగ్గ ఆశ్రమదీర్ఘికాసన్నివేశంలో రాముడి విరహార్తి, సీత అనుకంపా ఒకదానితో ఒకటి పోటీ పడతాయి. రాముడు మూర్ఛిల్లినప్పుడు, ఆశ్రమవాసులు చూస్తే ఏమనుకుంటారోనన్న భయాన్ని, తనలోపలి సంకోచాలను పక్కనబెట్టి అతడికి సేవ చేస్తుంది. అంతటి ప్రేమప్రకటనలోనూ ''జనాపవాదానికి వెరచినవాడా!'' అని (స్వగతంలోనే) నిందించడం మరిచిపోదు. ఇంకాస్సేపట్లోనే, చిత్రకూటంలో రాముడి తుంటరితనపు ప్రస్తావన వచ్చినప్పుడు ''దుడుకు వాడా, అందుకే దూరంగా ఉంచుతాను నిన్ను.'' అని మురిపెంగా కసురుకుంటుంది కూడానూ.

ఈ ప్రేమ–కోపాల ద్వైధీభావం నాటకపు పతాకసన్నివేశం దాకా కొనసాగుతుంది. తొలిసారిగా లవకుశులు రాముడిని కలిసేందుకు వెళుతున్నప్పుడు సీత లవుడిని పక్కకు పిలిచి, దగ్గరగా లాగుకొని, తన చెవికమ్మను సవరించుకుంటూ, మందహాసంతో ''మీకు స్వాభావికమైన

అభిమానాన్ని పక్కకుబెట్టి మహారాజుకు నమస్కరించండి.'' అని చెబుతుంది. మళ్ళీ అదే సీత, అదే రాముడిని పదుగురి ఎదుట కలిసినప్పుడు, తమ తండ్రిని సంతోషంగా చూస్తూ ఉండిపోయిన కుశలవులను ''ఇంత తదేకంగా చూస్తున్నారు, ఎవరీయన?'' అని మందలిస్తుంది.[11]

*

ఉత్తరకాండ రాముడిలోని రాచరికపు పార్శ్వం మీద తన వెలుగును ప్రసరిస్తుంది. తరచుగా, ఋషులను సంప్రదిస్తూ, మిత్రరాజులకు సంతోషం కలిగిస్తూ, సోదరులతో మంతనాలు సలుపుతూ, ప్రజాపాలనలో నిమగ్నుడై కనబడతాడాయన. తన ఉద్వేగాలు, ఇష్టాయిష్టాలు బాహిరలోకంలో తాను నెరవేర్చాల్సిన కార్యాలకు అనుగుణంగానే ఉంటాయి. లోబడి ఉంటాయి కూడా. బయటకు కనబడుతున్న ఈ రాముడి లోపలి మనిషిని మనముందు నిలుపుతుంది కుందమాల నాటకం.[12]

''సీత యెడల నిర్లక్ష్యంగా ఉన్నానని అనుకోవద్దు. కర్కశంగా కనబడ్డా నాలోపల అనురాగమే ఉన్నది –తామరతూడులో తంతువులు ఉన్నట్లు.'' అని చెబుతాడు రాముడు విదూషకుడితో చతుర్థాంకంలో. గుణదోషాలను ఎంచనిది, నిర్వ్యాజ్యమైనది అతడి అనురాగం. రాజధర్మపు అనివార్యకారణాలవల్ల సీతను పరిత్యజించాల్సి వచ్చినా, సీత అతడి హృదయంలోనే ఉంటుంది. అప్పుడైన లక్ష్మణుడి వద్ద అతడి గాంభీర్యం సడలుతుంది. ''శోకించకుండా ఎలా ఉండగలను, లక్ష్మణా?'' అని

---

[11] ''క ఏషః యో యువాభ్యామేవం ప్రేక్షితః?''

[12] డా.ఆర్షియా సత్తర్ (Dr.Arshia Sattar) భవభూతి ఉత్తరరామచరిత్ర గురించి వ్రాసిన Rama's Last Act అనే వ్యాసంలో చేసిన ప్రతిపాదన ఇది. కుందమాల నాటకానికీ ఇది వర్తిస్తుంది.

అడుగుతాడు. ఆశ్రమదీర్ఘిక దగ్గర సీత ఛాయ కనబడి మాయమైనప్పుడు అంతే బేలగా విలపిస్తాడు.

సీతతో సరే, మిగతా పాత్రలతో కూడా రాముడి అనుబంధం ఆయన మర్యాదాపురుషోత్తమత్వాన్ని నిరూపించే విధంగానే ఉంటుంది. ఒక చిన్న ఉదాహరణ – తనకు పూర్వమిత్రుడు, ఆశ్రమవాసియైన కణ్వుడితో మాట్లాడుతున్నప్పుడు రాముడు పరాకుగా ఉండడాన్ని గమనించిన కణ్వుడు అతడిని "భో రాజన్" అని సంబోధిస్తాడు. రాముడు అతడితో "బాల్యంనుండి నీకు నేను రాముడిని. నువ్వు నాకు కణ్వుడివి. ఇప్పుడు వయసు పెరిగాక, నువ్వు నాకు ఆర్యుడవు అయ్యావు, నేను నీకు రాజును అయ్యాను." అని సున్నితంగా మందలిస్తాడు. మరొక ఉదాహరణ – కుశలవులు రామాయణకావ్యగానం చేస్తున్నప్పుడు, కైకేయి వరాలడిగే ఘట్టాన్ని దాటవేయించి వనవాసం మొదలైన చోట అందుకొమ్మని చెబుతాడు.

రాముడి సంభాషణల్లో ఓ వంక విషాదాన్ని ఒలికిస్తూ మరొకవంక కవిత్వాన్ని పలికిస్తాడు దిఙ్నాగుడు. ఏనాడో – అరణ్యావాసకాలంలో - నది ఒడ్డున నడుస్తుండగా తమ పాదాల క్రింద నలుగుతున్న ఇసుకనుంచి ఊరిన తడి గుర్తుంటుంది రాముడికి. సీతావియోగదుఃఖంలో తలమునకలై ఉన్న సమయంలోనూ, మధ్యాహ్నపుటెండ నుంచి తెరపి పడేందుకు చెరువులోకి దిగిన ఏనుగు తన తొండంతో నీటిని చరుస్తూ సృష్టించే నీటి సుడులను గమనిస్తూనే ఉంటాడు.

కుశలవులను మొదటిసారిగా చూసినప్పుడు అంతకు ముందెప్పుడూ కలగని భయహర్షకరుణాది విచిత్రావస్థలను అనుభవిస్తాడు. అప్పటికి వాళ్ళిద్దరూ తన పిల్లలని తెలియని రాముడు, వారిని ఆలింగనం

చేసుకున్నప్పుడు "పుత్రగాత్రపరిష్వంగసుఖం నేను ఎరుగను. కానీ ఇది దాదాపు అలాగే అనిపిస్తున్నది. అందుకేనేమో గృహస్థులు తపోవనాలకు దూరంగా ఉంటారు." అని అంటాడు.

కుందమాలలో తక్కువగా కనబడే/వినబడే పాత్రలు కూడా విలక్షణంగా మలచబడ్డాయి. కొన్ని ఉదాహరణలను చూద్దాము.

ఉత్తరకాండలోలాగే కుందమాలలోని లక్ష్మణుడు – సీతను అడవిల్లో వదిలిపెడుతున్నప్పుడు – భ్రాతృవిధేయతకు, సహజన్యాయబుద్ధికీ నడుమన నలిగిపోతున్నవాడిలా కనబడతాడు. "స్వజనంలోని వాడినే కదా అని అనుమానం లేకుండా వచ్చిన దేవిని పెంపుడు లేడిని వధ్యస్థానానికి తెచ్చినట్లు ఈ అరణ్యానికి తీసుకుని వచ్చాను." అని వాపోతాడు. అన్న అంటే ఎంత ప్రాణం అంటే – మూర్ఛపోయి లేచిన క్షణాననే "అన్నగారు తేరుకున్నారా?" అని అడిగేంత.

కుందమాల నాటకానికి "పెద్దదిక్కు పాత్ర" వాల్మీకిది. ఈయనకు రాముడి ధర్మనిరతిపైన ఎంత నమ్మకం ఉంటుందంటే – దయనీయురాలైనప్పటికీ, రాముడి చేత శిక్షాపాత్రురాలైన వ్యక్తికి తాను ఏ సహాయం చేయలేనని చెప్పి వెనుదిరగబోయేంత. అసలు విషయం తెలుసుకున్నాక, దశరథుడి స్థానాన్ని, జనకుడి స్థానాన్ని స్వీకరించి సీతకు ఆశ్రయం కల్పిస్తాడు. చివరి అంకంలో సీతకు బాసటగా నిలిచి రాముడిని నిలదీస్తాడు. "ఇసుకలో నువ్వులు పండనట్లు రాజుల్లో మంచితనం ఉండదు. ఇంకా ఎందుకు ఇక్కడ, పదమ్మా!" అని సీతను బయలుదేరదీస్తాడు. ఆ కటువు మాటల వెనుక ఉన్నది "శాకుంతల కణ్వుని వంటి ఆర్ద్రహృదయము,

అపరాధప్రియులైన ప్రజల పట్ల కినుకా" అని అన్నారు, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు.[13]

ఉత్తరకాండలో కుశలవులు రామాయణాన్ని గానం చేసినప్పుడు, రాముడు వారిని తన పుత్రులుగా పోల్చుకుంటాడు. ఎలా పోల్చుకున్నాడనే వివరం ఉండదు. కుందమాలలో ఈ అంశాన్ని ఒక నాటకీయమైన సన్నివేశంతో, కుశలవుల అమాయకపు సంభాషణలతో చాలా ఆకర్షణీయంగా మలిచాడు నాటకకర్త.

సాధారణంగా, రామాయణాధారితనాటకాలలో విదూషకుడి పాత్ర ఉండదు. ఇందుకు కుందమాల మినహాయింపు. విదూషకపాత్రను హాస్యం కోసం కన్నా కథాగమనానికి తోడ్పడడం కోసం ఎక్కువగా వాడుకున్నాడు నాటకకర్త. రాముడికి మిత్రుడైనప్పటికీ సీతమ్మ వైపే తన మొగ్గు. సీత గతిని తలచుకొని "దావానలంలో తుషారబిందువులా ఇగిరిపోయే"టంత అభిమానం ఇతడికి సీత అంటే.

వాల్మీకి రామాయణస్ఫూర్తిని గౌరవిస్తూనే తనదైన కథను అల్లుకున్నాడు దిఙ్నాగుడు. కుందమాల పాత్రలు, అవి మాట్లాడే మాటలు, అవి నడుచుకున్న తీరూ రచయిత కల్పనాప్రతిభకు అద్దం పడతాయి.

---

[13] ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి 'సాహిత్యసంచారం' సంపుటంలో కుందమాల వ్యాసము.

## కుందమాల – మరి కొన్ని విశేషాలు

కుందమాల మొదలుపెట్టిన తీరు భాసుడి నాటకారంభాన్ని గుర్తుకు చేస్తుంది. నాంది అయ్యాక సూత్రధారుడు ప్రవేశించి నాటకాన్ని పరిచయం చేస్తూ ఉండగా, నేపథ్యంలో నాటకపాత్రల సంభాషణ మొదలై సూత్రధారుడి మాటల్లో కలిసిపోవడం, సూత్రధారుడు నిష్క్రమించడం... ఇది దాక్షిణాత్యశైలి అట.

నాటకపు తొలి ఆశీఃశ్లోకం విఘ్నహర్త అయిన హేరంబుడిని ఉద్దేశించి చేసిన ప్రార్థన. బహుశా, ఇది సంస్కృతకావ్య/నాటకసాహిత్యంలో మొదటి కృత్యారంభగణేశస్తుతి అయి ఉండవచ్చును.

నమ్మకాలు, ఆచారాలు, ఆచరణలకు సంబంధించిన మరి కొన్ని ఆసక్తికరమైన ప్రస్తావనలు ఈ నాటకంలో మనకు కనబడతాయి:

- దివంగతులైన రాజులను ప్రతిమారూపంలో సేవించుకునే ఆచారం - బహుశా ఇది భాసుడి ప్రతిమానాటకం నుంచి తీసుకున్న విషయం కావచ్చు.
- ప్రయాణం తలపెట్టేముందు కుటీరాల ముందు నైవేద్యాలను పెడతారు. తల్లులు పిల్లలకు ప్రస్థానమంగళానుష్ఠానం చేస్తారు. ఋషులు తీర్థోదకాలతో, సమిధలతో, దర్భాంకురాలతో ముందు నడుస్తారు.
- రాముడు అగ్నికార్యం చేస్తాడు. సూర్యోపాసన చేస్తాడు. అంతకన్నా విశేషం - కుందమాల సీత సంధ్యోపాసన చేయడం, ఆహుతులు వ్రేల్చడం. నిజానికి, సీత సంధ్యవార్చడం గురించి ఒక ప్రస్తావన సుందరకాండలో కూడా వస్తుంది.

- కుందమాల నాటకంలో చాలా ప్రముఖంగా కనిపించే దేవత భూమాత. 'పృథ్వి'వలె నేరుగా కథలోకి ప్రవేశించరు కానీ ఈ కథలో దిక్పాలకులకూ చాలా ప్రాముఖ్యం ఉన్నది. వీళ్ళు లోకాన్ని కనిపెట్టుకొని ఉంటారు – నిస్సహాయులను కాపాడతారు, మనుషుల నడవడికి, లోపల్లోపలి ఆలోచనలకు సాక్షులు అవుతారు కూడా.
- అయోధ్యానగరదేవత ప్రస్తావన వస్తుంది కుందమాలలో. చిత్రకూటంలో సీతతో స్నేహం చేసి, తను దక్షిణానికి వెళ్ళిపోతుంటే, బెంగ పెట్టుకున్న వనదేవత ప్రస్తావనా ఉన్నది.
- నదులను పూజించడం, పుష్పహారాలను ఉపహారంగా సమర్పిస్తానని సీత మొక్కుకోవడం రామాయణస్ఫూర్తికి ఒక కొనసాగింపు. వాల్మీకి రామాయణంలో సీత వనవాసం నుంచి తిరిగి వచ్చాక నైవేద్యాలు పెడతానని గంగానదికి మొక్కుకున్న మాట సుప్రసిద్ధమే కదా!
- రఘువంశీయుల సింహాసనమ్మీద అన్యులు కూర్చుంటే వాళ్ళ తలలు వందల వందల ముక్కలవుతాయని వయోవృద్ధులైన సాకేతవాసులు చెప్పుకునేవారట. కుశలవులు తన సంతానమేమో అని రాముడికి ఒక సందేహాన్ని రేకెత్తించడం కోసం దిఙ్నాగుడు చేసిన కల్పన ఇది. ఈ కల్పనకు అభిజ్ఞానశాకుంతలంలో దుష్యంతుడిని భరతుడి తండ్రిగా నిరూపించే సన్నివేశం స్ఫూర్తి అయి ఉండవచ్చునని విమర్శకులు సూచించారు[14]. కుందమాల నాటకంలో కుశలవులను చూడగానే రాముడిలో కలిగిన ఉద్వేగం

---

[14] ఇం.హనుమచ్ఛాస్త్రి గారి 'కుందమాల'; విశ్వనాథ సత్యనారాయణ గారి 'సీత – ('కుందమాల')'

కూడా భరతుడిని చూసినప్పుడు దుష్యంతుడికి కలిగిన ఉద్వేగంతో పోలికలను కలిగి ఉంటుంది.

మరి కొన్ని చిన్న చిన్న విశేషాలు ఇంకా ఉన్నాయి –

- బ్రాహ్మణులు – బాలురైనా, సరే – క్షత్రియులకు నమస్కరించడం అపరాధమని రాముడు భావిస్తాడు. వర్ణవ్యవస్థను, గోబ్రాహ్మణుల పూజ్యతను దిఙ్నాగుడికున్న గౌరవం ఇతరత్రా కూడా కనిపిస్తుంది.
- స్త్రీల రహస్యాలను తెలుసుకోవడం రాముడి మర్యాదకు విరుద్ధం. (ఆ నియమానికి దేవగణికల రహస్యాలు మినహాయింపు కావడం కథలో ఉత్కంఠను పెంచడానికే అయి ఉంటుంది.)
- పరపురుషులు ఎదురైనప్పుడూ ముసుగుతో ముఖాన్ని కప్పుకుంటుంది సీత. రామాయణగానం వినేందుకు సభాంగణంలో ఉపస్థితులైనప్పుడు కౌసల్యాదులు తెర వెనక కూర్చుంటారు.
- కుశుడి కన్నా చిన్నవాడైన లవుడు అన్నను పేరు పెట్టి పిలవడం కాదు కదా, పేరును పలకడానికి కూడా సంకోచిస్తాడు.

ఇటువంటి ఆసక్తికరమైన వివరాలతో, ఉత్కంఠభరితమైన సన్నివేశాలతో, మనోజ్ఞమైన సంభాషణలతో పరిమళిస్తూ ఈ కుందమాల పాఠకులను అలరిస్తుంది.

## ఈ అనువాదం ముందూ వెనకా

- గతంలో కుందమాల నాటకానికి తెలుగులో నాలుగు అనువాదాలు వచ్చాయి. అనువాదకులు- వ.సు.రాయకవి (1932), గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి (1943), బులుసు వేంకటేశ్వర్లు (1947), వేదము వేంకటశర్మ (1949)[15]. బులుసు వేంకటేశ్వర్లు గారి అనువాదం, గట్టి లక్ష్మీనరసింహశాస్త్రిగారిదిన్నూ www.archive.org లో లభిస్తున్నాయి. గట్టి వారి అనువాదంలో రెండు లఘుపీఠికలు ఉన్నాయి. 1952లో ఇంటర్మీడియట్ పాఠ్యపుస్తకంగా నిర్ణయించిన బులుసు వారి అనువాదంలో పీఠిక మరింత విస్తృతంగా ఉన్నది. ఒక లఘుటీకను కూడా సమకూర్చారు.
- విశ్వనాథ సత్యనారాయణగారి 'సీత – ('కుందమాల')' అనే వ్యాసం 1935 జనవరి నెలలో ఉదయిని పత్రికలో వచ్చింది; ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'కుందమాల' వ్యాసం 1967 జనవరిలో భారతి పత్రికలో వచ్చింది. 'సాహిత్యసంచారం' అనే వ్యాససంకలనంలో ఉన్నది. ఈ రెండు వ్యాసాలు నెట్లో దొరుకుతాయి (www.pressacademyarchives.ap.nic.in)
- కుందమాల పై నెట్లో దొరుకుతున్న ఇటీవలి వ్యాసాలు:
    1. ఈ.ఎన్. వి. రవి గారి బ్లాగ్ పోస్టు (indrachaapam.blogspot.com/2014/01/14.html)

---

[15] బులుసు వేంకటేశ్వర్లు గారి అనువాదపు ద్వితీయముద్రణకి వ్రాసిన పీఠికలోని వివరము

2. మైథిలి అబ్బరాజు గారి వ్యాసం 'ఉత్తరసీతాచరితం – హృదయాహ్లాదిని కుందమాల' (vaaklili.com/p=7364)

3. వాడ్రేవు చినవీరభద్రుడు గారి వ్యాసం

   (https://chinaveerabhadrudu.in/2018/09/01/దివ్యమధుర-చేష్ట/)

- కుందమాల పై కాళీకుమార దత్తా అనే ఆయన 'A critical Survey of Dinngas's Kundamala in relation to Later Ramayana Dramas in Sanskrit' అనే పేరుతో పరిష్కృతపాఠసహితంగా సిద్ధాంతగ్రంథాన్ని ప్రచురించారు. ఇది ఓ http://hdl.handle.net/10603/154667 (శోధ్ గంగ, INFLIBNET) లో దొరుకుతుంది.

- మీ చేతుల్లో ఉన్న పుస్తకానికి ఆధారాలు:
  1. తెలుగు అనువాదానికి ప్రేరణ – చౌఖంబా వారు ప్రచురించిన ఆచార్య లోకమణి దేహాల్ అనువాదం
  2. సంస్కృతపాఠ్యం కోసం పండిత జగదీశశాస్త్రి గారు 1937లో రూపొందించిన పాఠ్యపుస్తకం మీద ఆధారపడ్డాము.
  3. జగదీశశాస్త్రి గారి పాఠ్యం 1923లో రామకృష్ణకవి గారి, ఎస్.కె.రామనాథశాస్త్రిగారు ముద్రించిన ప్రథమముద్రణ మీద ఆధారపడింది. సంస్కృతపాఠ్యంలో అక్కడక్కడ కనబడే ప్రశ్నార్థకాలు "(?)", చుక్కలు ("… …") సందిగ్ధతాసూచకాలు. అవి మూలంలోనివే.

     ఈ రెండు పుస్తకాలు కూడా www.archive.org లో లభిస్తున్నాయి.

# ప్రథమోఽఙ్కః – మొదటి అంకము

జమ్భారిమౌలిమన్దారమాలికామధుచుమ్బినః ।
పిబేయురన్తరాయాబ్ధిం హేరమ్బపదపాంసవః ॥1॥

*(నాన్ద్యన్తే ప్రవిశతి సూత్రధారః)*

జ్వాలేవోర్ధ్వవిసర్పిణీ పరిణతస్యాన్తస్తపస్తేజసో
గఙ్గాతోయతరఙ్గసర్పవసతిర్వల్మీకలక్ష్మీరివ ।
సన్ధ్యేవార్ద్రమృణాలకోమలతనోరిన్దోః సదాస్థాయినీ
పాయాద్వస్తరుణారుణాంశుకపిలా శమ్భోర్జటాసన్తతిః ॥2॥

---

(తన పాదములకు నమస్కరిస్తున్న) ఇంద్రుని కిరీటముపైనున్న పారిజాతముల దండనుంచి స్రవించే తేనెను ముద్దాడుతున్నవి అయిన వినాయకుని పాదధూళిరేణువులు విఘ్నముల సముద్రమును త్రాగివేయు గాక!

*(నాంది శ్లోకం చదవబడ్డాక సూత్రధారుడు ప్రవేశిస్తాడు)*

తనలోని ఉత్కృష్టమైన తపస్సు అనే అగ్నియొక్క జ్వాలవలె పైకెగయుచున్నది, గంగానదీజలతరంగములనే సర్పములు నివసించే పుట్టవలె శోభిల్లుతున్నది, తామరతూడువంటి లేత శరీరముతోనున్న సాయంకాలపు చంద్రుడికి శాశ్వతనివాసస్థానమైనది, ఉదయసూర్యుని కిరణాల ఎరుపును కలిగి ఉన్నది అయిన మహాశివుని జటాజూటము మిమ్ములను కాచుగాక.

ఆదిష్టోఽస్మి పరిషదా తత్రభవతోఽరారాలపురవాస్తవ్యస్య కవేర్దిఙ్నాగస్య కృతిః కున్దమాలా నామ, సా త్వయా ప్రయోక్తవ్యేతి, తద్యావదస్య సన్దర్భస్య ప్రయోగసాచివ్యవిధాయినీమార్యామాహూయ రఙ్గభూమిమవతరామి।

(*నేపథ్యే*)

ఇత ఇతోఽవతరత్వార్యా।

**సూత్రధారః**: అయే కో ను ఖల్వయమార్యాసమాహ్వానేన సహాయమివ మే సమ్పాదయతి। (విలోక్య) కష్టం భోః। కష్టం భోః।

---

పూజ్యుడు, అరారాలపురనివాసి అయిన దిఙ్నాగుడనే కవి రచించిన కుందమాల అనే కృతిని నటింపజేయవలసినదని పరిషత్తుచేత నేను ఆజ్ఞాపించబడ్డాను. ఈ నాటకము యొక్క ఇతివృత్తము తెలిసినది, దానిని నటింపచేసేందుకు సహాయపడగలిగినది అయిన నా భార్యను ఆహ్వానించి, రంగప్రవేశము చేస్తున్నాను.

(*తెరలోపలి నుంచి*)

ఇటు, ఇటు... దిగండి తల్లీ!

**సూత్రధారుడు**: అరె, ఎవరది? నా భార్యను పిలిచేందుకు నాకు సహాయపడుతున్నట్లున్నారు. (*మాటలు వినబడుతున్నవైపు చూసి*) అయ్యో, అయ్యో!

అతికరుణం వర్తతే –

లఙ్కేశ్వరస్య భవనే సుచిరం స్థితేతి
రామేణ లోకపరివాదభయాకులేన।
నిర్వాసితాం జనపదాదపి గర్భగుర్వీం
సీతాం వనాయ పరికర్షతి లక్ష్మణోఽయమ్ ॥3॥

(*ఇతి నిష్క్రాన్తః*)

**స్థాపనా।**

---

ఎంతో జాలి కలుగుతున్నది.

లంకేశ్వరుడి భవనములో ఎంతో కాలము ఉన్నదని ప్రజలు చెడుగా మాట్లాడుతున్నారన్న భీతివలన రాముడిచేత జనపదము నుంచి పంపించివేయబడిన సీతను – నిండు చూలాలిని – అడవికి తీసుకొని వస్తున్నాడు లక్ష్మణుడు.

(*నిష్క్రమిస్తాడు*)

**స్థాపన సమాప్తము**

(*తతః ప్రవిశతి రథాధిరూఢా సీతా సారథిర్లక్ష్మణశ్చ*)

**లక్ష్మణః:** ఇత ఇతోఽవతరత్వార్యా। ఏతాని గహనతరులతాప్రతాన–సంరుద్ధతయా రథప్రవేశాయోగ్యాని భాగీరథీతీరకాననాని। తదవత-రత్వార్యా।

**సీతా:** *వచ్ఛ లక్ఖణ అదిప్పఉత్తతురంగమవేఅకంపిఅదేహా ఏత్థ ణ పారేమి సంఠాదుం కిం పుణ ఓదరిదుం।*

వత్స లక్ష్మణ అతిప్రవృత్తతురంగమవేగకమ్పితదేహా అత్ర న పారయామి సంస్థాతుం కిం పునరవతరితుమ్।

**లక్ష్మణః:** సుమన్త్ర నను తురంగమనియమనే క్రియతాం యత్నః।

---

(*రథారూఢ అయిన సీత సారథీ లక్ష్మణులతో కలిసి ప్రవేశిస్తుంది*)

**లక్ష్మణుడు:** ఇటు, ఇటు... దిగు తల్లీ! ఈ భాగీరథీతీరారణ్యంలో దట్టంగా పెరిగిన వృక్షాలు లతలవల్ల రథమింక ముందుకు పోదు. అందువల్ల మెల్లగా క్రిందికి దిగు, తల్లీ!

**సీత:** నాయనా! దిగటం మాట అలా ఉంచు. ఈ గుఱ్రాలు రథాన్ని ఊపేస్తుంటే కూర్చోవడమే కష్టంగా ఉంది.

**లక్ష్మణుడు:** సుమంత్రా! గుఱ్రాలను అదుపు చేసేందుకు ప్రయత్నించు.

**సుమన్త్రః:** క్రియమాణమపి యత్నమతివర్తన్తే గాన్ధర్వప్రియా వాజినః। తథా హి –

అమీ పతద్భిః శ్రవణేష్వమన్దం
వికృష్యమాణాః కలహంసనాదైః।
అనాశ్రవాః ప్రగ్రహసంయమస్య
తురంగమాస్తూర్ణతరం ప్రయాన్తి ॥4॥

**లక్ష్మణః:** సుమన్త్ర అతిరభసప్రవృత్తవేగత్వాదనాలక్షితసమవిషమా-స్తురంగమా గఙ్గాప్రపాతే స్యన్దనం వినిపాతయన్తి, తత్ సర్వాత్మనా క్రియతాం యత్నః।

**సుమన్త్రః:** (*రజ్జ్వాకర్షణమభినయతి*)

---

**సుమంత్రుడు:** ప్రయత్నిస్తున్నాను. అయితే, సంగీతమంటే మక్కువ చూపే తమ స్వభావం కారణంగా, కలహంసల మధురరవాలను వింటున్న ఈ గుర్రాలు నేను పగ్గాలను బలంగా లాగుతున్నప్పటికీ అదుపులోకి రావటం లేదు. మరింత వేగంగా ముందుకు వెళుతున్నాయి.

**లక్ష్మణుడు:** సుమంత్రా, అత్యుత్సాహం కారణంగా వేగంగా పరిగెత్తుతున్న ఈ గుర్రాలు ఎగుడుదిగుళ్ళను గమనించడం లేదు. గంగా-తీరపు పల్లములోనికి రథాన్ని పడవేసేలా ఉన్నాయి. అందుచేత, వాటి వేగాన్ని నియంత్రించేందుకు అన్ని విధాలుగా ప్రయత్నించు.

**సుమంత్రుడు:** (*పగ్గాలను లాగుతాడు*)

**లక్ష్మణః:** ఏష స్థితో రథః, తదవతరతు దేవి ।

**సీతా:** (*అవతీర్య పరిక్రామతి*)

**లక్ష్మణః:** సుమన్త్ర దీర్ఘమార్గపరిశ్రాన్తా ఏతే తురఙ్గమాః, తద్విశ్రామ-యైతాన్।

**సుమన్త్రః**: యదాజ్ఞాపయతి దేవః (*ఇతి రథమధిరుహ్య నిష్క్రాన్తః*)

**లక్ష్మణః:** (*పరిక్రమ్య ఆత్మగతమ్*) సమాదిష్టోఽహమార్యేణ, అథ వా స్వామినా – వత్స! లక్ష్మణ! దేవ్యాః కిల సీతాయాః రావణభవనసంస్థానా-చ్చారిత్రం ప్రతి సముత్పన్నవిమర్శానాం పౌరాణామన్యాదృశాః ప్రలాపాః ప్రవర్తన్తే, తన్న శక్నోమి సీతామాత్రస్య కృతే శరచ్చన్ద్రనిర్మలేక్ష్వాకుకులస్య కలఙ్కముత్పాదయితుమ్। సీతయా చాహం గర్భిణీభావసులభేన

---

**లక్ష్మణుడు:** ఇదిగో, రథం ఆగింది. మీరిప్పుడు క్రిందికి దిగవచ్చును, దేవీ!

**సీత:** (*దిగి అటూ ఇటూ నడుస్తుంది*)

**లక్ష్మణుడు:** సుమంత్రా! చాలా దూరం ప్రయాణించిన ఈ గుర్రాలు అలిసిపోయి ఉన్నాయి. వాటికి విశ్రాంతినివ్వు.

**సుమంత్రుడు:** దేవర ఆజ్ఞ. (*రథాన్ని ఎక్కి దూరంగా తీసుకెళతాడు*)

**లక్ష్మణుడు**: (*అటూ ఇటూ తిరుగుతూ, తనలో తాను*) ప్రభువు రామచంద్రుడు ఆజ్ఞాపించాడు. 'నాయనా లక్ష్మణా! రావణుడి చెరలో ఏడాది ఉండటం వల్ల సీత శీలం గురించి ప్రజలు అనేకవిధాలుగా

దోహదేన భాగీరథీదర్శనం ప్రార్థితః। తస్మాత్ త్వమనేన గఙ్గాగమనవ్యాజేన సుమన్త్రాధిష్ఠితం రథమారోప్య కస్మింశ్చిద్వనోద్దేశే పరిత్యజ్య నివర్తస్వ ఇతి । తదహమపి స్వజనవిస్రమ్భనిర్విశఙ్కాం దేవీమాదాయ గృహహరిణీమివ వధ్యభూమిం వనముపనయామి।

**సీతా:** *వచ్ఛ లక్ఖణ అదిసఇదగబ్భభరువ్వహణపరిస్సంతా ణ ప్పహావంతి మే చలణా। తా అగ్గదో భవిఅ ణిఇవేహి కీసదూరే భఅవఈ భాఈరఈ వట్టదిత్తి।*

వత్స లక్ష్మణ! అతిశయితగర్భభరోద్వహనపరిశ్రాన్తౌ న ప్రభవతో మే చరణౌ। తదగ్రతో భూత్వా నివేదయ కియద్దూరే భగవతీ భాగీరథీ వర్తత ఇతి।

---

అనుకుంటున్నారు. కేవలము సీతకోసం శరత్కాలచంద్రుని వలె నిర్మలమైన ఇక్ష్వాకువంశానికి కళంకం కలుగనివ్వను. సీత గర్భిణి కనుక గంగను దర్శించాలని కోరింది. ఆ వంకతో సుమంత్రుడిని సారథిగా చేసుకుని రథమ్మీద సీతను తీసుకొనిపోయి గంగానదీతీరారణ్యంలో విడిచిపెట్టి రా.' అని. స్వజనంలోని వాడినే కదా అని అనుమానం లేకుండా వచ్చిన దేవిని పెంపుడు లేడిని వధ్యస్థానానికి తెచ్చినట్లు ఈ అరణ్యానికి తీసుకుని వచ్చాను.

**సీత:** నాయనా! లక్ష్మణా! గర్భభారంవల్ల నేను అడుగు ముందుకు వెయ్యలేకపోతున్నాను. కొంచెం ముందుకు వెళ్ళి భాగీరథీమాత ఎంత దూరంలో ఉన్నదో చూసి చెప్పు.

**లక్ష్మణః:** నన్వాసన్నైవ భగవతీ భాగీరథీ తదలం విషాదేన, సంప్రాప్తా ఏవ వయమ్। పశ్య –

> ఆదాయ పఙ్కజవనాన్మకరన్దగన్ధాన్
> కర్షన్నితాన్తమధురాన్ కలహంసనాదాన్।
> శీతాస్తరఙ్గకణికా వికిరన్నుపైతి
> గంగానిలస్తవ సభాజనకాఙ్క్షయేవ ॥5॥

**సీతా:** *(స్పర్శం నాటయతి) సంపదం జణణీకరప్ఫరిససుహసీఅలస్స భాఈరఈతరంగమారుదస్స ఫరిసేణ పరిస్సమస్స విఅ పావస్స పరిక్ఖిఓ జాఓ, తహ వి దోహదకుదూహలం గంగావగాహణే మం సముస్సాహేది। తా ఇమాదో తడప్పపాదాదో జహ పరిస్సంతా ఓదరామి తహ ఆదేసేహి మే మగ్గమ్।*

(*స్పర్శం నాటయతి*) సాంప్రతం జననీకరస్పర్శసుఖశీతలస్య భాగీరథీ తరఙ్గమారుతస్య స్పర్శేన పరిశ్రమస్యేవ పాపస్య పరిక్షయో జాతః। తథాపి దోహ-కౌతూహలం గఙ్గావగాహనే మాం సముత్సాహయతి। తదస్మాత్తట ప్రపాతాద్యథా పరిశ్రాన్తావతరామి తథాదేశయ మే మార్గమ్।

---

**లక్ష్మణుడు:** గంగామాత దగ్గరలోనే ఉన్నది. వచ్చేశాం మనం. చూడు. గంగానదినుండి వచ్చే గాలులు కమలగంధాలను, కలహంసనాదాలను మోసుకొని వస్తూ, శీతలతరంగజలాలను చల్లుతూ నిన్ను సమ్మానిస్తున్నవి.

**సీత:** (*గాలి తాకిడిని అనుభవిస్తూ*) మాతృహస్తస్పర్శవంటి గంగా-తరంగశీతలవాయువులవల్ల నా ప్రయాణపుటలసటతోపాటు నా

**లక్ష్మణః:** (*నిర్దిశ్య*) అత్యన్తవిశ్రాన్తమనుష్యసంచారతయా దురవతారా-స్తటప్రదేశాః। తస్మాత్ ప్రపదమాస్థాయ సమ్యక్ –

> వామేన నీవారలతాం కరేణ
> జానుం సమాలమ్బ్య చ దక్షిణేన।
> పదే పదే మే పదమాదధానా
> శనైః శనైరేతు ముహూర్తమార్యా ॥6॥

**సీతా:** (*యథోక్తమవతీర్య*) *వచ్ఛ సుట్ఠు పరిస్సంతంమి, ఏతస్సిం పాఅవ-చ్ఛాయాఏ ముహుత్తం ఉపవిసిఅ విస్సమిస్సం।*

(*యథోక్తమవతీర్య*) వత్స! సుష్ఠు పరిశ్రాన్తాస్మి, ఏతస్యాం పాదప-చ్ఛాయాయాం ముహూర్తముపవిశ్య విశ్రమిష్యామి।

---

పాపాలు కూడా క్షయించిపోయినాయి. గర్భవతినైన నన్ను గంగాస్నానం చెయ్యాలన్న కోరిక త్వరపెడుతున్నది. అందువల్ల నదిలోనికి దిగడానికి సులభమైన దారి చూడు.

**లక్ష్మణుడు:** (*చేతితో చూపిస్తూ*) జనసంచారం లేకపోవడంవల్ల ఈ తీరభూమి సరైన దారి ఏర్పడక, దిగడానికి కష్టంగా ఉంది. అందువల్ల, అమ్మా! మునివేళ్ళు మోపి జాగ్రత్తగా ఎడమచేతితో నీవారలతలను పట్టుకొని, కుడిచేయి మోకాలు మీద ఆన్చి, నేను అడుగువేసిన చోట అడుగు మోపుతూ మెల్లమెల్లగా దిగు.

**సీత:** నాయనా! చాలా అలసిపోయాను. ఈ చెట్టు నీడలో కాసేపు విశ్రాంతి తీసుకుంటాను.

**లక్ష్మణః:** యదభిరుచితం దేవ్యై।

**సీతా:** (*ఉపవిశ్య విశ్రాన్తిం నాటయతి*)

**లక్ష్మణః:** అహో అసంహార్యపరిచ్ఛదాః సుకృతినః। తథా హి–

తరఙ్గా వీజన్తే సజలకణికాన్ శీతమరుత–
స్తథైతే సఙ్గీతం దధతి కలహంసాః కలగిరః।
సఖీవ ఛాయేయం రమయతి పరిష్వజ్య హృదయం
వనే శూన్యేఽప్యస్మిన్ పరిజనవతీవాఽత్ర భవతీ ॥7॥

**సీతా:** *జహ భణిదం కుమారేణ సఅణమజ్ఝగదాఏ విఅ ఏత్థ అహిరమది మే హిఅఅం।*

యథా భణితం కుమారేణ, స్వజనమధ్యగతాయా ఇవాత్రాభిరమతే మే హృదయమ్।

---

**లక్ష్మణుడు:** అలాగేనమ్మా.

**సీత:** (*కూర్చొని విశ్రమిస్తుంది*)

**లక్ష్మణుడు:** ఆహా! పుణ్యాత్ములు ఎప్పుడూ సేవలకు దూరం కారు గదా! జలబిందువులతో కూడిన చల్లని గాలులు వీస్తున్నాయి. కలహంసలు సంగీతధ్వనులు చేస్తున్నాయి. సఖివలె ఈ వృక్షం నీడనిచ్చి హృదయాన్ని రంజింపజేస్తున్నది. నిర్జనవనంలో కూడా అమ్మ పరిజనులతో కూడి యున్నట్లే ఉన్నది.

**లక్ష్మణః:** (*ఆత్మగతమ్*) ఏషా విశ్రాన్తా సుఖోపవిష్టా చ దేవీ, తదయమేవావసరో యథాస్థితం వ్యవసితుమ్।

(*ప్రకాశమ్*) (*సహసా పాదయోర్నిపత్య*) అయమనవరతప్రవాస-దుఃఖభాగీ నిర్లక్షణో లక్ష్మణో విజ్ఞాపయతి – స్థిరీక్రియతాం హృదయమ్।

**సీతా:** (*ససమ్భ్రమమ్*) *అవి కుసలం అంఅఉత్తస్స?*

(*ససమ్భ్రమమ్*) అపి కుశలమార్యపుత్రస్య?

**లక్ష్మణః:** (*వనం నిర్దిశ్య*) ఏవం గతే కీదృశం కుశలమార్యస్య?

---

**సీత:** కుమారలక్ష్మణుడు చెప్పినట్లు స్వజనుల మధ్యన ఉన్నట్లే నా హృదయం ప్రసన్నంగా ఉన్నది.

**లక్ష్మణుడు:** (*తనలో*) అమ్మ ప్రసన్నంగా ఉన్నది. అన్నగారి ఆజ్ఞ వినిపించడానికి ఇదే సమయం.

(*గబుక్కున సీత పాదాలపై వాలి*) (*ప్రకాశంగా*) అమ్మా! ఆనాటివలెనే ఈనాడూ ప్రవాసదుఃఖాన్ని కలిగిస్తున్న నిర్భాగ్యుడు ఈ లక్ష్మణుడు విన్నవించుకుంటున్నాడు - గుండె చిక్కబట్టుకోవమ్మా!

**సీత:** (*కంగారుగా*) ఆర్యపుత్రులకు కుశలమే కదా?

**లక్ష్మణుడు:** (*అరణ్యాన్ని చూపించి*) ఈ పరిస్థితిలో ఏమి కుశలము?

**సీతా:** *అజ్జాఏ కేకఈఏ పుణో వి సమాదిఠ్ఠో వణవాసో?*

ఆర్యయా కైకేయ్యా పునరపి సమాదిష్టో వనవాసః?

**లక్ష్మణః:** సమాదిష్టో వనవాసః, న పునరమ్బయా।

**సీతా:** *కేణ ఉణ సమాదిఠ్ఠో?*

కేన పునః సమాదిష్టః?

**లక్ష్మణః:** ఆర్యేణ ।

**సీతా:** *కహం సమాదిఠ్ఠో?*

కథం సమాదిష్టః?

---

**సీత:** అమ్మ కైకేయి మళ్ళీ వనవాసం విధించిందా?

**లక్ష్మణుడు:** వనవాసం విధించబడింది. కానీ మళ్ళీ కైకేయిచేత కాదు.

**సీత:** మరి ఎవరిచేత?

**లక్ష్మణుడు:** ఆర్యులచేత.

**సీత:** ఏ విధంగా?

**లక్ష్మణః:** (*బాష్పస్తమ్భమభినీయ*)

ఆర్యస్యాదేశ ఇత్యేవ వక్తుమిచ్ఛామి యత్నతః।
తథాపి హృదయం గత్వా గ్రన్థిం బధ్నాతి భారతీ ॥8॥

**సీతా:** *కిం మమ సమాదిట్ఠో వణవాసో?*

కిం మమ సమాదిష్టో వనవాసః?

**లక్ష్మణః:** న కేవలం తవ, ఆత్మనోఽపి।

**సీతా:** *కహం విఅ?*

కథమివ?

**లక్ష్మణః:** ప్రకామభుక్తే స్వగృహాభిమానాత్
సుహృజ్జనేనాహితయాగవహ్నౌ।
ఆర్యస్య రమ్యే భవనేఽపి వాస–
స్తవ ప్రవాసే వనవాస ఏవ ॥9॥

---

**లక్ష్మణుడు:** (*కన్నీరు ఆపుకుంటూ*) ఆర్యుల ఆదేశం అదే. చెప్పడానికి ప్రయత్నిస్తున్నాను. కానీ గుండెల్లో పట్టేసినట్లయి మాట పెగలడం లేదు.

**సీత:** ఏమిటి? నాకు విధించబడిందా వనవాసం?

**లక్ష్మణుడు:** కేవలం నీకే కాదమ్మా! తనకు కూడా విధించుకున్నాడు.

**సీత:** అదెలా?

**లక్ష్మణుడు:** యాగాగ్నులతో పవిత్రంగా వెలుగొందుతూ, బంధు–

**సీతా:** *వచ్ఛ, పరిప్ఫుడం కహేహి, అజ్జ కహం మమ వణవాసో అంఅఉత్తస్స వణవాసోత్తి ।*

వత్స, పరిస్ఫుటం కథయ, అద్య కథం మమ వనవాస ఆర్యపుత్రస్య వనవాస ఇతి ।

**లక్ష్మణః:** కిమపరం కథయామి మన్దభాగ్యః?

త్యక్తా కిల త్వమార్యేణ చారిత్రగుణశాలినా ।
మయాపి కిల గన్తవ్యం త్యక్త్వా త్వామిహ కాననే ॥10॥

**సీతా:** *హా తాద, అయ్య కోసలాహివ । అజ్జ ఉవరదోసి ।* (*మోహం గచ్ఛతి*)

హా తాత, ఆర్య కోసలాధిప! అద్యోపరతోఽసి । (*మోహం గచ్ఛతి*)

---

మిత్రులతో నిండి, ఇచ్ఛానుసారం ఉండగల భవనంలో ఉన్నా నువ్వు లేకపోతే, వనవాసమే అవుతుంది కదా ఆర్యులకు.

**సీత:** స్పష్టంగా చెప్పు, నాయనా! నేడు నాకు విధించబడ్డ వనవాసం ఆర్యపుత్రుల వనవాసమెలా అవుతుంది?

**లక్ష్మణుడు:** అమ్మా, మందభాగ్యుడిని. ఇంకా ఎలా చెప్పగలను? రామప్రభువు నిన్ను త్యజించాడు. నేను కూడా నిన్నిప్పుడు ఇక్కడ ఈ అరణ్యంలో విడిచిపెట్టి వెళ్ళాలి.

**సీత:** హా తండ్రీ! దశరథమహారాజా! ఇప్పుడు కదా మీరు నిజంగా మరణించారు! (*మూర్ఛిల్లుతుంది*)

**లక్ష్మణః:** (ససమ్భ్రమమ్) కష్టం భోః! కష్టం భోః! నిర్ఘాతపాత-దారుణేనానేన పరిత్యాగవార్తాశ్రవణేన నూనముపరతా దేవీ। (*నిర్వర్ణ్య*) దిష్ట్యా శ్వసితి। తత్కో ను ఖల్వస్యాః ప్రత్యానయనేఽభ్యుపాయః। (*విషాదం నాటయతి*)

ఆశ్చర్యమాశ్చర్యమ్ –

> భాగీరథీశీకరశీతలేన
> సమ్భావ్యమానా మృదునానిలేన।
> మద్భాగ్యశేషేణ చ బోధ్యమానా
> ప్రత్యాగతా రాజసుతా కథఞ్చిత్ ॥11॥

**సీతా:** *వచ్ఛ లక్ఖణ! కిం గదోసి?*

వత్స లక్ష్మణ! కిం గతోఽసి?

---

**లక్ష్మణుడు:** (*కంగారుగా*) అయ్యో! వజ్రఘాతంవంటి వరిత్యాగవార్త విని, దేవి మరణించిందా? (*పరికించి చూసి*) అమ్మయ్య! ప్రాణాలతోటే ఉన్నది. ఈమెకు స్పృహ తెప్పించే దారేది? (*దిగులుపడతాడు*)

ఓహ్! గంగాజలశీకరయుక్తమైన శీతలవాయువులవల్ల, ఇంకా మిగిలి ఉన్న నా అదృష్టం కారణంగా ఎలాగో ఈమెకు స్పృహ వచ్చింది.

**సీత:** నాయనా లక్ష్మణా! వెళ్ళిపోయావా?

**లక్ష్మణః:** ఆజ్ఞాపయ, తిష్ఠామ్యేష మన్దభాగ్యః।

**సీతా:** *కిం ఉవాలంభిఅ అంమి పరిచ్చత్తా?*

కిముపాలభ్యాస్మి పరిత్యక్తా?

**లక్ష్మణః:** కీదృశో దేవ్యా ఉపాలమ్భః?

**సీతా:** *అహో మే అధణ్ణత్తణం, కిం ఉవాలమ్భమేత్తఏణ విణా ణిగహిదహ్మి । కిం అత్థి కిం వి దేణ సందిట్టం?*

అహో మేఽధన్యత్వమ్ కిముపాలమ్భమాత్రేణ వినా నిగృహీతాస్మి। కిమస్తి కిమపి తేన సన్దిష్టమ్?

**లక్ష్మణః:** అస్తి ।

**సీతా:** *కహేహి కహేహి।*

కథయ కథయ ।

---

**లక్ష్మణుడు:** లేదమ్మా, మందభాగ్యుణ్ణి ఇక్కడే ఉన్నాను, ఆజ్ఞాపించు.

**సీత:** ఏ దోషంవల్ల పరిత్యజించబడ్డాను?

**లక్ష్మణుడు:** దేవివల్ల ఎటువంటి దోషముంటుంది?

**సీత:** అయితే దోషం లేకుండానే శిక్షా? ఇంకేమైనా చెప్పారా ఆయన?

**లక్ష్మణుడు:** చెప్పారు.

**సీత:** ఐతే త్వరగా చెప్పు.

**లక్ష్మణః:** తుల్యాన్వయేఽత్యనుగుణేతి గుణోన్నతేతి
దుఃఖే సుఖే చ సుచిరం సహవాసినీతి।
జానామి కేవలమహం జనవాదభీత్యా
సీతే త్యజామి భవతీం న తు భావదోషాత్ ॥12॥

అయమార్యస్య సందేశః।

**సీతా:** *కహం జణవాదభయేణేత్తి? కింపి వఅణీఅం మే అత్థి?*

కథం జనవాదభయేనేతి?। కిమపి వచనీయం మేఽస్తి?

**లక్ష్మణః:** కీదృశమార్యాయా వచనీయమ్?

ఋషీణాం లోకపాలానామార్యస్య మమ చాగ్రతః।
అగ్నౌ శుద్ధిం గతా దేవీ కిన్తు...

---

**లక్ష్మణుడు:** 'గొప్పవంశంలో పుట్టి, ఉన్నతమైన గుణశీలసంపదలున్న నిన్ను, సుఖంలో దుఃఖంలో తోడుగా ఉన్న నిన్ను కేవలం లోకాపవాద-భయంతోనే విడిచిపెడుతున్నాను. అంతేకానీ నీయందు దోషంవల్ల మాత్రం కాదు.' అని అన్నగారి సందేశం.

**సీత:** ఎటువంటి లోకాపవాదభయం? నాయందేమైనా దోషమున్నదా?

**లక్ష్మణుడు:** నీయందు దోషమా తల్లీ! ఋషులు, లోకపాలకులు, అన్నగారు, నేనూ ఉండగా అగ్నిప్రవేశంవల్ల నీ పాతివ్రత్యం నిరూపించబడింది, కానీ...

**సీతా:** *కహేహి, కింతు –*

కథయ, కిన్తు –

**లక్ష్మణః:** ... లోకో నిరఙ్కుశః ॥13॥

**సీతా:** *అగ్గిసుద్ధిసంకిత్తణేణ పడిబోధిదమ్హి । రావణభవణఉత్తంతో పుణో వి ఉబ్బాదిఅది । సీదాఏ వి ణామ ఏవ్వం సంభావిఅదిత్తి సవ్వహా అలం మహిలత్తణేన । ఏవ్వం పరిచ్చత్తా । ణు పరిచత్తామ్హి? కిం ణ ఖు జుత్తం మమ అంఅఉత్తపరిచ్చత్తం అత్తాణం పరిచ్చఇదుం? కిం ణ ఖు తస్స ఏవ్వ ణిరనుక్కోసస్స సమాణో ఏసో పసఓ పేక్ఖిదవ్వోత్తి వఅణీఅ-కంటకోపహిదం జీవిదం పరిరక్ఖామి ।*

అగ్నిశుద్ధిసఙ్కీర్తనేన ప్రతిబోధితాస్మి । రావణభవనోదన్తః పునరప్యు-ద్బాధయతి । సీతాయా అపి నామ ఏవం సమ్భావ్యత ఇతి సర్వథాఽలం మహిలాత్వేన । ఏవం పరిత్యక్తా । నను పరిత్యక్తాస్మి? కిన్న ఖలు యుక్తం మమార్యపుత్రపరిత్యక్తమాత్మానం పరిత్యక్తుమ్? కిన్న ఖలు తస్యైవ

---

**సీత:** (సిగ్గుతో) చెప్పు, లక్ష్మణా! కానీ...

**లక్ష్మణుడు:** అమ్మా! లోకులు నిరంకుశులు గదా!

**సీత:** అగ్నిప్రవేశం చేసి పాతివ్రత్యాన్ని నిరూపించుకున్నాను. అయినా రావణలంకానివాసాపవాదం ఇంకా బాధిస్తూనే ఉన్నది. సీతకే ఇలా అయితే ఇక ఆడుపుట్టుకే చాలు. అయ్యో! ఇలా త్యజించబడ్డానే! త్యజించబడ్డాను కద! ఆర్యపుత్రుడు త్యజించిన ఈ దేహాన్ని ఎందుకు

నిరనుక్రోశస్య సమాన ఏష ప్రసవః ప్రేక్షితవ్య ఇతి వచనీయకణ్టకోపహితం జీవితం పరిరక్షామి।

**లక్ష్మణః:** అనుగృహీతోఽస్మి। (*ఉత్థాయ ప్రణమతి*) ఇదమపరమార్యేణ సన్దిష్టమ్।

**సీతా:** *కిం ణు ఖు భవిస్సది?*

కిన్ను ఖలు భవిష్యతి?

**లక్ష్మణః:** త్వం దేవి చిత్తనిహితా గృహదేవతా మే
స్వప్నాగతా శయనమధ్యసఖీ త్వమేవ।
దారాన్తరాహరణనిఃస్పృహమానసస్య
యాగే తవ ప్రతికృతిర్మమ ధర్మపత్నీ ॥14॥

---

త్యజించకూడదు? కూడదు! ఆ నిర్దయుడి ప్రతిబింబాలను మోస్తున్నాను కనుక దోషారోపణమనే ముల్లు గుచ్చుకుంటున్నా, ఈ శరీరాన్ని రక్షించుకోవాలి.

**లక్ష్మణుడు:** ఆహా! అనుగ్రహింపబడ్డాను. (*ప్రణమిల్లుతాడు*) . అమ్మా, ఇంకో సందేశం కూడా ఉన్నది.

**సీత:** ఏమై ఉంటుందో?

**లక్ష్మణుడు:** అమ్మా విను, రామవాక్యం – 'దేవీ! నువ్వు నా మనసులో నిలిచి ఉన్న గృహదేవతవు. స్వప్నంలో కూడా నువ్వే నా సరసన ఉన్నట్లుగా

**సీతా:** *ఏవ్వం సందిశంతేణ అంఅఉత్తేణ పరిచ్చాఅదుక్కం మయి నిరవసేసం అవణీదం । ణ హి తహ అణ్ణాసత్తా పఇణో, ఇత్థిఆజణస్స దుక్కం ఉప్పాదేది జహ అణ్ణాసత్తో ।*

'ఏవం సన్దిశతార్యపుత్రేణ పరిత్యాగదుఃఖం మయి నిరవశేషమపనీతమ్ । న హి తథాన్యాసక్తా పత్యుః, స్త్రీజనస్య దుఃఖముత్పాదయతి యథాన్యాసక్తః।

**లక్ష్మణః:** కః ప్రతిసన్దేశః?

**సీతా:** *కస్స?*

కస్య?

**లక్ష్మణః:** ఆర్యస్య ।

---

భావిస్తాను. మరో స్త్రీని మనస్సులో ఊహించలేను. నీ మూర్తియే యజ్ఞయాగాదులలో నాకు ధర్మపత్ని యగుగాక!'

**సీత:** ఆర్యపుత్రుల ఈ సందేశంవల్ల నా పరిత్యాగదుఃఖం చాలామటుకు శమించింది. అన్యపురుషునియందు లగ్నమైన స్త్రీవల్ల పురుషునికి కలిగే దుఃఖం కన్నా, అన్యస్త్రీయందు లగ్నమైన పురుషునివల్ల స్త్రీకి కలిగే దుఃఖం ఎక్కువ.

**లక్ష్మణుడు:** అమ్మా! 'ఏమైనా చెప్తావా?

**సీత:** ఎవరికి?

**లక్ష్మణుడు:** ఆర్యులకు.

**సీతా:** *ఏవ్వం గదేవి పడిసందేశో। అజ్జూణాం ఉణ మమ వఅణాదో పాదవందణం కదుఅ విణ్ణవేహి – ఏవ్వం అహం ణీరక్ఖా సావదసమాఇణ్ణే వణే పడివసంతీ అ సవ్వహో హిఅఏణ అయ్యాహి అణుగహీదవ్వేత్తి।*

ఏవం గతేఽపి ప్రతిసన్దేశః। శ్వశ్రూణాం పునర్మమ వచనాత్ పాద-వన్దనం కృత్వా విజ్ఞాపయ – ఏవమహం నీరక్షా శ్వాపదసమాకీర్ణే వనే ప్రతి-వసన్తీ చ సర్వథా హృదయేనార్యాభిరనుగృహీతవ్యేతి।

**లక్ష్మణః:** ప్రతిగృహీతేయమాజ్ఞా। ఆర్యస్య న కిఞ్చిత్ సన్దిష్టమ్?

**సీతా:** *తహ నిష్ఠురో ణామ సందిసీఅదిత్తి అప్పడిహదవఅణదా ఏసా లక్ఖణస్స, ణ సీదాఏ ధణ్ణత్తణం। తహ మమ వఅణాదో తం జణం విణ్ణవేహి – మందభాఇణీం అణుసోఅంతో వణ్ణస్సమపరివాలణం అహిగ్ఘంతో అత్తాణం ణ బాధేహి। సధ్ధంమే ససరీరే సావధాణో హోహిత్తి। వచ్చ లక్ఖణ! కిం ఉవాలంభామి మహారాఅం?*

---

**సీత:** ఈ స్థితిలోనా?... అత్తగార్లకు నా మాటగా పాదాభివందనం చేశానని విన్నవించు. ఈ రక్షణలేని, క్రూరమృగాలు సంచరించే అరణ్యంలో ఉన్నా - అన్ని విధాలా - వారు నన్ను అనుగ్రహింతురు గాక!

**లక్ష్మణుడు:** మీ ఆజ్ఞను శిరసా వహిస్తున్నాను. అన్నగారికోసం ఏమీ చెప్పలేదు?

తథా నిష్ఠురో నామ సన్దిశ్యత ఇత్యప్రతిహతవచనతైషా లక్ష్మణస్య, న సీతాయా ధన్యత్వమ్ । తథా మమ వచనాత్తం జనం విజ్ఞాపయ – మన్దభాగినీమనుశోచన్ వర్ణాశ్రమపరిపాలనమభిఘ్నన్నాత్మానం న బాధయ । సద్ధర్మే స్వశరీరే సావధానో భవేతి । వత్స లక్ష్మణ! కిముపాలభే మహారాజమ్?

**లక్ష్మణః:** కిమేతావత్యపి న ప్రభవతి దేవీ?

**సీతా:** *ఏవ్వం వి తం జణం విణ్ణవేహి – ణ జుత్తం తవ ణిరవరాహం ఇమం జణం సవది హిఅఆదో నివ్వసిదుం కిం ఉణ విసఆదోత్తి ।*

ఏవమపి తం జనం విజ్ఞాపయ – న యుక్తం తవ నిరపరాధమిమం జనం సపది హృదయతో నిర్వాసయితుం కిం పునర్విషయత ఇతి ।

---

**సీత:** లక్ష్మణుడు అడిగినందుకే ఆ కఠినహృదయుడికీ సందేశం. సీతకోసం కాదు. అయినా, నా మాటగా విన్నవించవయ్యా లక్ష్మణా! ఈ మందభాగ్యురాలిని తలుచుకుంటూ, వర్ణాశ్రమధర్మపాలనను వదిలిపెట్టి, మనస్సును బాధపెట్టుకోవద్దను. సద్ధర్మపరిపాలనలో జాగ్రత్తగానూ, శరీరం విషయంలో సావధానంగానూ ఉండమను. నాయనా లక్ష్మణా! మహారాజును ఏమని నిందించగలను?

**లక్ష్మణుడు:** ఈ మాత్రమైనా అనలేదా దేవి?

**సీత:** ఆc, ఇది కూడా విన్నవించు ఆయనకు. ఈ స్త్రీని హృదయం నుంచి బహిష్కరించటమే అన్యాయం, దేశం నుంచి కూడానా?.

**లక్ష్మణః:** సన్దేష్టమార్యయా సన్దిష్టమ్ –

ఆర్యా నిర్వాసితా నామ హృదయాత్ ప్రభవిష్ణునా।
కథం గృహాద్ గృహం నామ కథం జనపదాదపి ॥15॥

**సీతా:** *ఏవ్వం వి మమ వఅణాదో విణ్ణవిదవ్వో –సా తవోవణవాసిణీ సవ్వహా సీమన్తణిహిదేన అంజలిణా విణ్ణవేదిత్తి జఇ అహం ణిగ్గుణా చిరపరిచిదేత్తి వా, అణాహేత్తి వా, సీదేత్తి వా, సుమరణమేత్తఏణ అణుగ్గహిదవ్వేతి।*

ఏవమపి మమ వచనాద్ విజ్ఞాపయితవ్యః – సా తపోవనవాసినీ సర్వథా సీమన్తనిహితేనాఞ్జలినా వినివేదయతి యది అహం నిర్గుణా చిరపరిచితేతి వా, అనాథేతి వా, సీతేతి వా స్మరణమాత్రకేణానుగృహీతవ్యేతి।

---

**లక్ష్మణుడు:** ఈ సందేశం తప్పకుండా వినిపించవలసిందే. హృదయంనుండి బహిష్కరించకపోతే, గృహంనుండి, దేశంనుండి ఎలా బహిష్కరించగలడు?

**సీత:** అయినా సరే, నా మాటగా విజ్ఞప్తి చెయ్యి. ఈ తపోవనవాసిని నుదుటిపై అంజలి ఘటించి విన్నవించుకుంటున్నది. చాలాకాలంనుండి తనతో కలిసి జీవించినదాననైతే, గుణహీననైనా, అనాథనైనా, ఉట్టి సీతనే అయినా సరే – ఎప్పుడైనా తలచుకోవలసిందని చెప్పవయ్యా నాయనా.

**లక్ష్మణః:** ఇమం సన్దేశమాకర్ణ్య క్షతే క్షారమివాహితమ్ ।
దశామసహ్యాం శోకస్య వ్యక్తమార్యో గమిష్యతి ॥16॥

**సీతా:** *అదిమహిదే వి సఅమండలే కహం తుమం సోంత్తి, ఏత్తిఆ దుక్ఖసహాయా। సంపదం మఏ విణా తఏ ఏక్కేణ ఏసో చింతిదవ్వో। తుమం బాదుస్సరీరే సావహాణో హోహిత్తి।*

అతిమహితే ఽపి స్వమణ్డలే కథం తే సన్తి, స్త్రియో దుఃఖసహాయాః। సామ్ప్రతం మయా వినా త్వయైకేనైష చిన్తయితవ్యః। త్వం భ్రాతుః శరీరే సావధానో భవేతి।

**లక్ష్మణః:** అనురూపమేతన్మహానుభావతాయాః।

**సీతా:** *వచ్ఛ లక్ఖణ! పణమిదవ్వా తుఏ మమ వఅణాదో రాహవఉలరాఅధాణీ భఅవదీ అయోజ్ఝా। సుస్సూసిదవ్వో పడిమాగదో మహారాఓ। సాహిదవ్వా అజ్జూణం ఆణత్తి। సమస్సాసిదవ్వా పిఅంవదా మమ పిఅసహీఓ। సుమరిదవ్వా సవ్వకాలం మందభాఇణీ।* (ఇతి రోదితి)

---

**లక్ష్మణుడు:** ఈ సందేశాన్ని విని అన్నగారు గాయం మీద ఉప్పు చల్లినట్లు అంతులేని దుఃఖంతో అలమటించిపోతారు.

**సీత:** ఎంత మహాసామ్రాజ్యాధీశులైతేనేమి? సుఖదుఃఖాలలో స్త్రీలు పురుషులకు తోడుగా ఉంటారు. ఇక ఇప్పుడు నా పరోక్షంలో నువ్వే ఆయన ఆరోగ్యం గురించి చూసుకోవాలి, నాయనా!

**లక్ష్మణుడు:** ఈ మాట నీ సహృదయానికి తగినట్లే ఉన్నదమ్మా!

వత్స లక్ష్మణ! ప్రణమితవ్యా త్వయా మమ వచనాత్ రాఘవకుల-రాజధానీ భగవత్యయోధ్యా। శుశ్రూషితవ్యః ప్రతిమాగతో మహారాజః। సాధయితవ్యా శ్వశ్రూణామాజ్ఞప్తిః। సమాశ్వాసయితవ్యాః ప్రియంవదా మమ ప్రియసఖ్యః। స్మర్తవ్యా సర్వకాలం మన్దభాగినీ। (*ఇతి రోదితి*)

**లక్ష్మణః:** (*సోద్వేగమ్*)

ఆర్యాం స్వహస్తేన వనే విమోక్తుం
శ్రోతుఞ్చ తస్యాః పరిదేవితాని।
సుఖేన లఙ్కాసమరే హతం మా–
మజీవయన్మారుతిరాత్తవైరః ॥17॥

---

**సీత :** నాయనా లక్ష్మణా! నా బదులుగా రఘుకులరాజధాని అయోధ్యకు నమస్కరించు. స్వర్గీయ దశరథ మహారాజుకు నా వందనాలు. అత్తగార్ల ఆజ్ఞలను పాలించాలి. ప్రియం కలిగించే విధంగా మాట్లాడుతూ ఉండే నా చెలులకు ఓదార్పు లభించాలి. ఈ మందభాగినిని తలచుకుంటూ ఉండండి. (*ఏడుస్తుంది*)

**లక్ష్మణుడు:** (*ఉద్వేగంతో*) వదినగారిని చేజేతులా అరణ్యంలో విడిచిపెట్టి, ఆమె ఆక్రందనలు వినడానికే ఆంజనేయుడు నామీద బద్ధవైరం పూని లంకలో చనిపోయిన నన్ను బ్రతికించాడు కాబోలు.

(విలోక్య)

> ఏతే రుదన్తి హరిణా హరితం విముచ్య
> హంసాశ్చ శోకవిధురాః కరుణం రుదన్తి ।
> నృత్తం త్యజన్తి శిఖినోఽపి విలోక్య దేవీం
> తిర్యగ్గతా వరమమీ న పరం మనుష్యాః ॥18॥

**సీతా:** *వచ్ఛ లక్ఖణ । ఆసణ్ణాత్థమయో సూరో । దూరే అ ఇదో మాణుస సంపాదో । ఉడ్డీణా పక్ఖిణో । సంచరంతి సావదా । గచ్ఛ ణ జుత్తం పరిలంబిదుమ్ ।*

వత్స లక్ష్మణ! ఆసన్నాస్తమయః సూర్యః । దూరే చేతో మానుష-సమ్పాతః । ఉడ్డీనాః పక్షిణః । సఞ్చరన్తి శ్వాపదాః । గచ్ఛ న యుక్తం పరిలమ్బితుమ్ ।

---

(చుట్టూ చూస్తూ)

వదినగారి దుఃఖం చూసి ఈ హరిణాలు మేత మేయటం మాని శోకిస్తున్నాయి. హంసలు కూడా కరుణతో శోకమగ్నమై ఉన్నాయి. నెమళ్ళు నృత్యం మాని ఈమెను దిగులుగా చూస్తున్నాయి. పశుపక్షులు కూడా ఈమెను చూసి శోకిస్తున్నాయి. కానీ మనుషులు?

**సీత:** నాయనా లక్ష్మణా! సూర్యుడస్తమించబోతున్నాడు. మనుష్య-సంచారానికి చాలా దూరంగా ఉన్న ప్రాంతమిది. పక్షులు గూళ్ళకు

**లక్ష్మణః:** (*అఞ్జలిం బధ్వా*) సర్వపశ్చిమోఽయం లక్ష్మణస్య ప్రణామాఞ్జలిః। తత్సావధానం పరిగృహ్యతామ్।

**సీతా:** *ణిచ్చావహిదా ఖు అహం।*

నిత్యావహితా ఖల్వహమ్ ।

**లక్ష్మణః:** విజ్ఞాపయామి దేవీమ్ –

ఆర్యం మిత్రం బాన్ధవాన్ వా స్మరన్త్యా
శోకాదాత్మా మృత్యవే నోపనేయః।
ఇక్ష్వాకూణాం సన్తతిర్గర్భసంస్థా
సేయం దేవ్యా యత్నతో రక్షణీయా ॥19॥

---

చేరుకుంటున్నాయి. క్రూరమృగసంచారం మొదలైంది. వెళ్ళు. ఇంకా ఇక్కడ ఉండటం మంచిది కాదు.

**లక్ష్మణుడు:** (*అరచేతులు దోయిలించి*) లక్ష్మణుడి తుది నమస్కారం సావధానచిత్తంతో స్వీకరించు తల్లీ!

**సీత:** రోజూ అలాగే సావధానమై ఉంటాను కదా.

**లక్ష్మణుడు:** అమ్మా! నిన్ను వేడుకుంటున్నాను. అన్నగారిని, సఖులను, బంధువులను గుర్తుంచుకొని శోకావేగంతో ఆత్మహత్యాప్రయత్నం చెయ్యవద్దు. నీ గర్భంలో ఉన్న ఇక్ష్వాకువంశవారసులను రక్షించుకోవాలి.

**సీతా:** *అప్పడిహదవఅణో ఖు సోమిత్తీ ।*

అప్రతిహతవచనః ఖలు సౌమిత్రిః ।

**లక్ష్మణః:** ఇయమపరా విజ్ఞాపనా ।

**సీతా:** *కా అణ్ణా?*

కాన్యా?

**లక్ష్మణః:** జ్యేష్ఠస్య భ్రాతురాదేశాదానీయ విజనే వనే ।
పరిత్యక్తాసి దేవి త్వం దోషమేకం క్షమస్వ మే ॥20॥

**సీతా:** (ససమ్భ్రమమ్) *జేట్ఠవఅణాణువత్తి తుమేత్తి పరితోసకాలే కో దోసో ఆసంకీఅది?*

)ససమ్భ్రమమ్ (జ్యేష్ఠవచనానువర్తీ త్వమితి పరితోషకాలే కో దోష ఆశఙ్క్యతే?

---

**సీత:** అలాగే నాయనా! నీ మాటలు నిష్ఫలం కావు.

**లక్ష్మణుడు:** ఇంకొక ప్రార్థన.

**సీత:** ఇంకా ఏమిటయ్యా!

**లక్ష్మణుడు:** అన్నగారు ఆదేశించడంవల్ల దేవిని నిర్జనారణ్యంలో విడిచిపెట్టి వెళ్తున్నాను. నా ఈ దోషాన్ని క్షమించాలి.

**సీత:** (*తత్తరపడుతూ*) నువ్వు అన్నగారి ఆజ్ఞను పాలిస్తున్నావు. ఇందుకు సంతోషించాలి కానీ, నీ దోషమేమున్నది?

**లక్ష్మణః:** *(సప్రదక్షిణం ప్రణమ్య పరిక్రామతి)*

**సీతా:** *(రోదితి)*

**లక్ష్మణః:** *(దిశోఽవలోక్య)* భో భో లోకపాలాః శృణ్వన్తు భవన్తః –

'ఏషా వధూర్దశరథస్య మహారథస్య...

**సీతా:** *అది సిలాహణిజ్జాఇం అక్ఖరాఇం సుణీఅంది ।*

అతిశ్లాఘనీయాన్యక్షరాణి శ్రూయన్తే ।

**లక్ష్మణః:** రామాహ్వాయస్య గృహిణీ మధుసూదనస్య ।

**సీతా:** *కుదో మే తాదిసో బాహధేఓ?*

కుతో మే తాదృశో భాగధేయః?

---

**లక్ష్మణుడు:** *(నమస్కరిస్తూ, ప్రదక్షిణం చేస్తాడు)*

**సీత:** *(దుఃఖిస్తుంది)*

**లక్ష్మణుడు:** ఓ లోకపాలకులారా! వినండి. ఈమె దశరథమహారాజు కోడలు...

**సీత:** మెచ్చుకోదగిన మాటలు వింటున్నాను.

**లక్ష్మణుడు:** మధుసూదనుడైన రాముడియొక్క ఇల్లాలు.

**సీత:** అంత అదృష్టం నాకెక్కడిది?

**లక్ష్మణః:** నిర్వాసితా పతిగృహాత్...

**సీతా:** (*కర్ణౌ పిదధాతి*)

**లక్ష్మణః:** ...విజనే వనేఽస్మిన్
ఏకాకినీ వసతి రక్షత రక్షతైనామ్ ॥21॥

**సీతా:** (*గర్భం దర్శయతి*)

**లక్ష్మణః:** ఏనామపి భగవతీమ్ ఆర్యాయాః కృతే విజ్ఞాపయామి–

జాతశ్రమాం కమలగన్ధకృతాధివాసైః
కాలే త్వమప్యనుగృహాణ తరఙ్గవాతైః।
దేవీ యదా చ సవనాయ విగాహతే త్వాం
భాగీరథి! ప్రశమయ క్షణమమ్బువేగమ్ ॥22॥

---

**లక్ష్మణుడు:** పతిగృహం నుండి త్యజించబడింది.

**సీత:** (*చెవులు మూసుకుంటుంది*)

**లక్ష్మణుడు:** ఈ నిర్జనారణ్యంలో ఒంటరిది. ఈమెను రక్షించండి.

**సీత:** (*తన గర్భాన్ని చూపుతుంది*)

**లక్ష్మణుడు:** తల్లీ! భాగీరథీ! సీతమ్మ అలసిపోయినప్పుడు నువ్వు నీ కమలాల సుగంధాలతో కూడిన తరంగవీచికలతో సేదతీర్చు. ఆమె స్నానానికి వచ్చినప్పుడు క్షణకాలం నీ వేగాన్ని నెమ్మదించు.

యే కేచిదత్ర మునయో నివసన్త్యరణ్యే
విజ్ఞాపయామి శిరసా ప్రణిపత్య తేభ్యః।
స్త్రీత్యుజ్ఝితేత్యశరణేతి కులాగతేతి
దేవీ సదా భగవతీత్యనుకమ్పనీయా ॥23॥

ఏషోఽఞ్జలిర్విరచితో వనదేవతానాం
విజ్ఞాపనాం క్షణమిమామవధారయన్తు।
సుప్తా ప్రమాదవశగా విషమాస్థితా వా
యత్నాదియం భగవతీభిరవేక్షణీయా ॥24॥

భో భో హింస్రా భూమిరేషా భవద్భిః
వర్జ్యా దేశో న ప్రవేశ్యః పరేషామ్।

---

ఈ అరణ్యావాసులైన మునివర్యులకు శిరసా నమస్కరించి వేడుకుంటున్నాను. అబల, పరిత్యక్త, అసహాయ, గొప్ప కుటుంబానికి చెందినది కనుక ఈమెపై దయ చూపించండి.

ఇక్కడి వనదేవతలకు అంజలి ఘటించి ప్రార్థిస్తున్నాను. ఈమె నిద్రిస్తున్నా, జాగ్రత్తగా లేకపోయినా, కష్టదశలో ఉన్నా, సప్రయత్నంగా రక్షిస్తూ ఉండండి.

ఓ క్రూరమృగాల్లారా.మీరంతా ఈ ప్రదేశాన్ని విడిచిపెట్టి వెళ్ళండి !

మృగ్యో మృగ్యో విప్రవాసే సఖీనాం
యూయం సఖ్యో మా క్షణం ముఞ్చతైనామ్ ॥25॥

సఖ్యో నద్యః స్వామినో లోకపాలాః
మాతర్గఙ్గే భ్రాతరః శైలరాజాః ।
భూయో భూయో యాచతే లక్ష్మణోఽయం
యత్నాద్రక్ష్యా రాజపుత్రీ గతోఽహమ్ ॥26॥

*(ప్రణమ్య నిష్క్రాన్తః)*

**సీతా:** *కహం సచ్చం ఏవ మం ఏఆఇణీం పరిచ్చఇఅ గదో లక్ఖణో, (విలోక్య) హద్ధీ! హద్ధీ! అత్థమిదో సూరో, సరేణ వి లక్ఖణో ణ దీసఈ, హరిణా వి సఅం ఆవాసం ఆఅంతి, ఉడ్డీణా పక్ఖిణో, సంచరంతి సాపదా, ఆచ్ఛాదీఅది అంధఆరేణ దిట్టీ, ణింమాణుసం మహారణ్ణం, కిం కరేమి మందభాఆ, కీస అరణ్ణాహిం పవ్వజమి ఏఆఇణీ అదేస అసలాకా తి గాం మి మి (?)*

---

పరుల ప్రాంతమిది. మీరు ప్రవేశించరాదు. ఓ హరిణములారా! సఖీజనం లేని దేవికి మీరే సఖీజనం. క్షణంసేపు కూడా దేవిని ఎడబాయకండి.

సీతమ్మకు చెలులైన ఓ ప్రవాహములారా! ప్రభువులైన లోకపాలకులారా! తల్లీ గంగా! సోదరసమానులైన ఓ పర్వతరాజులారా! మళ్ళీ మళ్ళీ ప్రార్థిస్తున్నాడీ లక్ష్మణుడు. రాజపుత్రి సీతను ప్రయత్నపూర్వకంగా రక్షించండి. నేను వెళ్ళిపోతున్నాను. *(నమస్కరించి నిష్క్రమిస్తాడు)*

*కింణుఖు మఏ పాపం కిదం జస్స దాణిం ఏవ విరహం సవ్వహా అణుభావిదోహ్మి, కహం దేహావితోనలి (?) కహం దావ లక్ఖణాణిఉత్తా వణదేవతా... కహం దే రాహావకులక్కమాగదా వసిష్ఠవంమీఇప్పముహా మహోప్పహావా మ హేసిణో తే దాణిం మం పరిత్తా అ అభిదేహిత్తి? (ఇతి మోహం గచ్ఛతి)*

కథం సత్యమేవ మామేకాకినీం పరిత్యజ్య గతో లక్ష్మణః। (*విలోక్య*) హా ధిక్! హా ధిక్! అస్తమితః సూర్యః, స్వరేణాపి లక్ష్మణో న దృశ్యతే, హరిణా అపి స్వకమావాసమాయాన్తి, ఉడ్డీనాః పక్షిణః, సఞ్చరన్తి శ్వాపదాః, ఆచ్ఛాద్యతేఽన్ధకారేణ దృష్టిః, నిర్మానుషం మహారణ్యం, కిం కరోమి మన్దభాగ్యా, కీదృశమరణ్యేః ప్రవ్రజామ్యేకాకినీ...

కిన్ను ఖలు మయా పాపం కృతమ్, యస్యేదానీమేవ విరహం సర్వథాఽనుభవితాస్మి। కథం...

---

**సీత:** ఎలా? లక్ష్మణుడు నన్ను ఒంటరిగా విడిచిపెట్టి వెళ్ళడం నిజమేనా? సూర్యుడు అస్తమించాడు. లక్ష్మణుడి స్వరం కూడా వినిపించటం లేదు. అయ్యో! లేళ్ళు వాటి నివాసాలకు మళ్ళుతున్నాయి. పక్షులు గూళ్ళకు చేరుకుంటున్నాయి. క్రూరమృగసంచారం మొదలైంది. చీకట్లో కళ్ళు కనుపించడం లేదు. ఈ మహారణ్యం నిర్మానుష్యంగా ఉంది. హా! మందభాగ్యురాలిని. ఏంచెయ్యగలను? ఒంటరిగా మహారణ్యంలో ఎలా తిరగగలను?

ఏం పాపం చేసుకున్నాను కనుక ఇప్పుడు ఈ విరహానుభవం నాకు?

కథం తావల్లక్ష్మణనియుక్తా వనదేవతా... కథం తే రాఘవకుల-క్రమాగతా వసిష్ఠవాల్మీకిప్రముఖా మహాప్రభావా మహర్షయస్త ఇదానీం మాం పరిత్యజ్య ...(*ఇతి మోహం గచ్ఛతి*)

(*తతః ప్రవిశతి వాల్మీకిః*)

**వాల్మీకిః:** (*ససమ్భ్రమమ్*)

> ఆకర్ణ్య జహ్నుతనయాం సముపాగతేభ్యః
> సన్ధ్యాభిషేకవిధయే మునిదారకేభ్యః।
> ఏకాకినీమశరణాం రుదతీమరణ్యే
> గర్భాతురాం స్త్రియమతిత్వరయాగతోస్మి ॥27॥

తద్యావత్తామేవాన్వేషయామి। (*అన్వేషం నాటయతి*)

---

ఎక్కడ సౌమిత్రి ప్రార్థించిన వనదేవతలు? ఎక్కడ రఘుకుల-గురువులైన వశిష్ఠవాల్మీకులు? నన్ను ఇలా పరిత్యజించి... (*మూర్ఛపోతుంది*)

(*అంతలో వాల్మీకి ప్రవేశిస్తాడు*)

**వాల్మీకి:** (*సంభ్రమంగా*) ఇక్కడ అడవిలో ఎవరో గర్భవతియైన స్త్రీ ఒంటరిగా రక్షణ లేకుండా ఏడుస్తూ ఉన్నదని, గంగాతీరానికి సంధ్యాదివిధుల కోసం వచ్చిన మునికుమారులవల్ల విని పరుగెత్తుకొని వచ్చాను. ఆమె కోసం వెదుకుతాను. (*వెదుకుతాడు*)

**సీతా:** (*ప్రత్యాగమ్య*) *కో ఏస మం విజ్జఈ।*

(*విచిన్త్య*) *ణ కోవి, ఆణత్తికరలక్ఖణవిణ్ణత్తిఆ అణిచ్చరిత్తి భఅవఈ భాఈరఈ తరంగాఏ మామణుగహ్ణాది।*

(*ప్రత్యాగమ్య*) క ఏష మాం వీక్షతే।

(*విచిన్త్య*) న కోఽపి ఆజ్ఞప్తికరలక్ష్మణవిజ్ఞప్త్యా అనుచరన్తీ భగవతీ భాగీరథీ తరఙ్గైర్మామనుగృహ్ణాతి।

**వాల్మీకిః:** అయమన్ధకారసంరుద్ధతయా దృష్టిసఞ్చారస్య న దృశ్యతే, అతః శబ్దాపయిష్యే। అహమయం భోః।

**సీతా:** (*సహర్షమ్*) *వచ్ఛ లక్ఖణ! పడిణిఉత్తోసి?*

(*సహర్షమ్*) వత్స లక్ష్మణ! ప్రతినివృత్తోఽసి?

**వాల్మీకిః:** నాహం లక్ష్మణః।

---

**సీత:** (*స్పృహ తేరుకొని*) ఇక్కడ నన్నెవరు చూస్తారు?

(*ఆలోచించి*) ఎవరూ లేరు. లక్ష్మణుడి ప్రార్థనవల్ల తన శీతల-తరంగాలతో సేదతీరుస్తున్న గంగాభవాని తప్ప.

**వాల్మీకి:** అంధకారంలో ఏమీ కనుపించడంలేదు. గట్టిగా చప్పుడు చేసి చూస్తాను. ఓహో! ఇక్కడ నేనున్నాను.

**సీత:** (*సంతోషంతో*) నాయనా లక్ష్మణా! తిరిగి వచ్చావా?

**వాల్మీకి:** నేను లక్ష్మణుణ్ణి కాను.

**సీతా:** (*అవకుణ్ఠం నాటయతి) అచ్చాహిదం, అణ్ణో ఏసో కో వా పరపురుసో, కహం దాణిం వారఇస్సం మహాహిదం? (విచిన్త్య) ఏవ్వం... ఇత్థిఆహ ఏఆఇణీ అ।*

(*అవకుణ్ఠం నాటయతి*) అత్యాహితమ్! అన్య ఏష కో వా పరపురుషః। కథమిదానీం వారయిష్యామి మహాహితమ్? (విచిన్త్య) ఏవమ్... స్త్రీ అహమేకాకినీ చ।

**వాల్మీకిః:** ఏష స్థితోస్మి। వత్సే, తవాప్యలం పరపురుషశఙ్కయా, దివసావసానసవనాయ భాగీరథీం సముపాస్య ప్రతినివృత్తేభ్యో ముని-దారకేభ్యస్త్వద్వృత్తాన్తముపలభ్య తపోధనోఽహం త్వామేవాభ్యుపపత్తు-ముపాగతః। పృచ్ఛామి చాత్రభవతీమ్...

> ధర్మేణ జితసఙ్గ్రామే రామే శాసతి మేదినీమ్।
> కథ్యతాం కథ్యతాం వత్సే విపదేషా కుతస్తవ ॥28॥

---

**సీత:** (*చీరకొంగుతో ముఖాన్ని కప్పుకుంటూ*) అమ్మో, ముప్పు వాటిల్లేలా ఉన్నది! ఎవరో పరపురుషుడు. ఏ అనర్థం వాటిల్లకుండా ఎలా వారించగలను? (*ఆలోచించి*) ఇక్కడ నేను ఏకాకినీ స్త్రీని.

**వాల్మీకి:** ఇక్కడ నేను తల్లీ. పరపురుషశంక వద్దు. సంధ్యానుష్ఠానాలు తీర్చుకోవడానికి నదీతీరానికి వచ్చిన మునికుమారులవల్ల నీ వృత్తాంతం విని, నిన్ను రక్షించడానికి వచ్చిన తపస్విని. నీ విషయం చెప్పు.

**సీతా:** *తదో ఏవ్వ పుణ్ణచందాదో మే అసణిపాదో,*

తత ఏవ పూర్ణచన్ద్రాన్మేऽశనిపాతః।

**వాల్మీకిః:** కామం రామాదేవ హి విపత్తిముపాగతా?

**సీతా:** *అహ ఇం।*

అథ కిమ్।

**వాల్మీకిః:** యది త్వం వర్ణాశ్రమవ్యవస్థాభూతేన మహారాజేన నిర్వాసితాసి తత్ స్వస్తి భవత్యై, గచ్ఛామ్యహమ్। (*పరిక్రామతి*)

**సీతా:** *అహ విణ్ణవేమి।*

అథ విజ్ఞాపయామి।

---

ధర్మవిజయుడైన శ్రీరామచంద్రుడు పరిపాలిస్తుండగా నీకీ ఆపద ఎలా సంభవించింది?

**సీత:** ఆ పూర్ణచంద్రుడి వల్లనే నాకీ పిడుగుపాటు.

**వాల్మీకి:** అంటే, రాముడి వల్లనే నీకు ఆపదా?

**సీత:** మరి?

**వాల్మీకి:** ఒకవేళ వర్ణాశ్రమపరిపాలనాదక్షుడైన రాముడివల్లనే విడిచివేయబడితే, నీకు శుభము కలుగుగాక! నేను వెళ్ళి వస్తాను. (*వెనుతిరుగుతాడు*)

**సీత:** ఒక్క విన్నపము!

**వాల్మీకిః:** కథయ।

**సీతా:** *జఇ రహువరేణ ణివ్వాసిదేత్తి భఅదా ణాణుకంపణీఆ, ఏసా ఉణ గబ్భగదా రహుసఅరదిలీపదసరహపహుదీణం తాఇసాణం సంతదిత్తి దాణిం పడిపాలణీయా।*

యది రఘువరేణ నిర్వాసితేతి భవతా నానుకమ్పనీయా, ఏషా పునర్గర్భగతా రఘుసగరదిలీపదశరథప్రభృతీనాం తాదృశానాం సన్తతిరితీదానీం ప్రతిపాలనీయా।

**వాల్మీకిః:** (*ప్రతినివృత్య*) కథమిక్ష్వాకువంశముదాహరతి, తదను-యోక్ష్యే। వత్సే, కిఞ్చ దశరథస్య వధూః?

**సీతా:** *జం భఅవం ఆణవేది।*

యద్ భగవాన్ ఆజ్ఞాపయతి।

---

**వాల్మీకి:** ఏమిటది?

**సీత:** రఘునాథుడివల్ల విడిచివేయబడితే మీకు కరుణ కలుగదా? మరి నేను గర్భవతిని. రఘుసగరదిలీపదశరథాదులను పోలిన సంతతిని ఇప్పుడు రక్షించుకోవాలి.

**వాల్మీకి:** (*వెనుదిరిగి*) ఏమిటి? ఇక్ష్వాకువంశం గురించి మాట్లాడుతున్నదీమె? కనుక్కుంటాను. తల్లీ! నువ్వు దశరథుడి కోడలివా?

**సీత:** మీరు సెలవిచ్చినట్లే.

**వాల్మీకిః:** కిఞ్చ విదేహాధిపతేర్జనకస్య దుహితా?

**సీతా:** *అహ ఇం।*

అథ కిమ్।

**వాల్మీకిః:** కిఞ్చ సీతా?

**సీతా:** *ణహి సీదా, భఅవం మందభాఇణీ।*

నహి సీతా, భగవన్ మన్దభాగినీ।

**వాల్మీకిః:** హా హతోఽస్మి మన్దభాగ్యః। కింకృతోఽయమత్రభవత్యాః ప్రాసాదతలాదధోఽవతారః?

**సీతా:** (*లజ్జాం నాటయతి*)

---

**వాల్మీకి:** విదేహాధిపతి జనకుడి కుమార్తెవా?

**సీత:** కాకేమీ?

**వాల్మీకి:** సీతవా?

**సీత:** సీతను కాను, మందభాగ్యురాలను, భగవన్.

**వాల్మీకి:** హా తల్లీ! నేను మందభాగ్యుణ్ణి. నువ్వు ఏం చేశావని రాజప్రాసాదం నుండి పతనం?

**సీత:** (*సిగ్గుపడుతుంది*)

**వాల్మీకిః:** కథం లజ్జతే! భవతు, యోగచక్షుషాహమవలోకయామి। (*ధ్యానమభినీయ*) వత్సే! జనాపవాదభీరుణా రామేణ కేవలం పరిత్యక్తా, న తు హృదయేన। నిరపరాధా త్వమస్మాభిరపరిత్యాజ్యైవ। ఏహ్యాశ్రమపదం గచ్ఛావః।

**సీతా:** *కో ణు తుమం?*

కో ను త్వమ్?

**వాల్మీకిః:** శ్రూయతామ్–

> సోహం చిరన్తనసఖా జనకస్య రాజ్ఞ–
> స్తాతస్య తే దశరథస్య చ బాలమిత్రమ్।
> వాల్మీకిరస్మి విసృజాన్యజనాభిశఙ్కాం
> నాన్యస్తవాయమబలే శ్వశురః పితా చ ॥29॥

---

**వాల్మీకి:** ఎలా సిగ్గుపడుతున్నది! సరే, యోగదృష్టితో తెలుసుకుంటాను. (*ధ్యానించి*) తల్లీ! జనాపవాదభయంతో రాముడు నిన్ను త్యజించాడు, కానీ హృదయం నుండి కాదు. నిరపరాధను నిన్ను వదిలిపెట్టలేము. పద. ఆశ్రమానికి వెళ్దాం.

**సీత:** అయ్యా! తమరెవరు?

**వాల్మీకి:** నేను జనకమహారాజుకు చిరకాలమిత్రుణ్ణి. దశరథ-మహారాజుకు బాల్యమిత్రుణ్ణి. వాల్మీకిని. పరపురుషశంక వదలిపెట్టు. నేను నీకు పరాయివాణ్ణి కాను. నీకు మామనూ, తండ్రిని కూడా.

**సీతా:** *భఅవం వందామి ।*

భగవన్ వన్దే ।

**వాల్మీకిః:** వీరప్రసవా భవ, భర్తుశ్చ పునర్దర్శనమాప్నుహి ।

**సీతా:** *తుమం లోఅస్స వమ్మీఈ, మమ ఉణ తాదో ఏవ్వ, తా గచ్ఛ సయంఅస్సమపఅం । (గఙ్గామవలోక్యాఞ్జలిం బధ్వా) భఅవఇ భాఈరఇ! జఇ అహం సోత్థిణా గబ్భం అభిణిఉత్తోమి తదా తవ దిణే దిణే సుష్ఠు ఉచ్ఛాఏ కుందమాలాఏ ఉవహారం కరఇస్సమ్ ।*

త్వం లోకస్య వాల్మీకిః, మమ పునస్తాత ఏవ, తద్గచ్ఛ స్వమాశ్రమపదమ్ । (*గఙ్గామవలోక్యాఞ్జలిం బధ్వా*) భగవతి భాగీరథి! యద్యహం సుఖేన గర్భమభినిర్వర్తయామి తదా తవ దినే దినే సుష్ఠు గ్రథితయా కున్దమాలయోపహారం కరిష్యామి ।

---

**సీత:** భగవన్, నమస్కారము.

**వాల్మీకి:** వీరపుత్రుణ్ణి కను. తిరిగి భర్తతో కలుస్తావు.

**సీత:** భగవన్! తమరు లోకానికి వాల్మీకులు. కానీ నాకు జనకులే. అందువల్ల ఆశ్రమానికి వస్తాను.

(*గంగను చూస్తూ, దోసిలి యొగ్గి*) భగవతీ, భాగీరథీ! నాకు సుఖప్రసవమైతే ప్రతిరోజూ నీకు చక్కగా అల్లిన కుందమాలను (మల్లెపూవుల మాలను) సమర్పించుకుంటాను.

**వాల్మీకిః:** అత్యన్తదుఃఖసఞ్చారోఽయం మార్గః, విశేషతస్త్వాం ప్రతి; తద్యథా యథా మార్గమాదేశయామి తథా తథా సమాగన్తవ్యమ్।

ఏతస్మిన్ కుశకణ్టకే లఘుతరం పాదౌ నిధత్స్వాగ్రతః
శాఖేయం వినతా నమస్వ శనకైర్గర్తో మహాన్ వామతః।
హస్తేనామృశ తేన దక్షిణగతం స్థాణుం సమం సామ్ప్రతం
పుణ్యేఽస్మిన్ కమలాకరే చరణయోర్నిర్వర్త్యతాం క్షాలనమ్ ॥30॥

**సీతా:** (*యథోక్తం పరిక్రామతి*)

---

**వాల్మీకి:** అమ్మా! చాలా కఠినమైన మార్గం ఇది. ముఖ్యంగా నువ్విప్పుడున్న పరిస్థితిలో. అందువల్ల నేను ఎలా మార్గం చూపిస్తానో అలా జాగ్రత్తగా నడువు. ఈ దర్భ ముళ్ళు పాదాలకు గుచ్చుకుంటాయి. ఈ వంగి ఉన్న కొమ్మల దగ్గర బాగా వంగి నడవాలి. ఈ ఎడమపక్క పెద్ద గొయ్యి ఉన్నది. జాగ్రత్తగా కుడివైపు చేతిని ఊతగా చేసుకుని నడువు. ఇదిగో ఈ పక్కన సమప్రదేశం. ఇదుగో కమలసరోవరం. ఇక్కడ కాళ్ళు కడుక్కో.

**సీత:** (*వాల్మీకి చెప్పినట్లు నడుస్తుంది*)

**వాల్మీకిః:** (*నిర్దిశ్య*)

ఇక్ష్వాకూణాఞ్చ సర్వేషాం క్రియాః పుంసవనాదయః ।
అస్మాభిరేవ పక్ష్యన్తే మా శుచో గర్భమాత్మనః ॥31॥
కౌసల్యాపాదశుశ్రూషాసౌఖ్యం వృద్ధాసు లప్స్యసే ।
పశ్య సఖ్యో భగిన్యశ్చ తవైతా మునికన్యకాః ॥32॥

(*ఇతి నిష్క్రాన్తాః సర్వే*)

---

**వాల్మీకి:** ఇక్ష్వాకువంశాచారం ప్రకారం చేయవలసిన పుంసవనాది సంస్కారాలను మేమే నిర్వర్తిస్తాం. విచారించకు. కౌసల్య మొదలైన అత్తలకు సేవ చేసే భాగ్యాన్ని, ఇక్కడ వృద్ధతపస్వినుల సేవాభాగ్యం చేత పొందుదువు గాక! ఇక్కడి మునికన్యలే నీకు చెల్లెళ్ళు, చెలులూ కూడా.

(అందరూ నిష్క్రమిస్తారు)

# ద్వితీయోఽఙ్కః – రెండవ అంకము

(*తతః ప్రవిశతో ద్వే మునికన్యకే*)

**ప్రథమా:** *హలా వేదవది! దిట్ఠిఆ వడ్ఢసి సీదాఏ తవ పిఅసహీఏ రామ-చ్చామా దువే పుత్తఆ జాఆ।*

హలా వేదవతి! దిష్ట్యా వర్ధసే, సీతాయాస్తవ ప్రియసఖ్యా, రామశ్యామౌ ద్వౌ పుత్రకౌ జాతౌ।

**వేదవతీ:** *పిఅం మే పిఅం మే। కింణామ హేఆ?*

ప్రియం మే ప్రియం మే। కిన్నామధేయౌ?

**ప్రథమా:** *జేట్ఠో దాణిం భఅవదా కుసేత్తి సద్దావిదో దుదిఓ లవోత్తి।*

జ్యేష్ఠ ఇదానీం భగవతా కుశ ఇతి శబ్దాపితో ద్వితీయో లవ ఇతి।

---

(ఇద్దరు మునికన్యలు మాట్లాడుకుంటూ వస్తున్నారు)

**మునికన్య 1:** హలా! వేదవతీ! శుభాకాంక్షలు. నీ ప్రియసఖి సీతాదేవికి రామచంద్రుడి వంటి నీలమేఘశ్యాములైన ఇద్దరు పుత్రులు జన్మించారు.

**వేదవతి:** చాలా సంతోషం! వాళ్ళ పేర్లేమిటి?

**మునికన్య 1:** పెద్దవాడికి కుశుడనీ, చిన్నవాడికి లవుడనీ వాల్మీకి-భగవానులు నామకరణం చేశారు.

**వేదవతీ:** *కిం సమత్తా పహి పరిబ్భమిదుమ్?*

కిం సమర్థౌ పథి పరిభ్రమితుమ్?

**ప్రథమా:** *కిం సమత్థత్తి భణిఅది –*

*ధావంతి హరిణఏహి జహ పడిమల్లా కిసోరసీహాణం।*
*తహ అ తవస్సిణీహిఅఅం హరంతి పిఅదంసణా జుఅలా॥*

*మునిజణస్స అంకాదో అంకాదో అదిసంచరంతి। సంపదం వంమీఇ విరఇదం రామాఅణం పడతి।*

కిం సమర్థావితి భణ్యతే –

ధావతో హరిణకైర్యథా ప్రతిమల్లౌ కిశోరసింహానామ్ ।
తథా చ తపస్వినీహృదయం హరతః ప్రియదర్శనౌ యుగలౌ ॥1॥

మునిజనస్యాఙ్కాదఙ్కాదతిసఞ్చరతః। సామ్ప్రతం వాల్మీకివిరచితం రామాయణం పఠతః।

---

**వేదవతి:** వాళ్ళిప్పుడు నడవగలుగుతున్నారా?

**మునికన్య 1:** నడవటమేమిటి? చూడముచ్చటైన పిల్లలు వాళ్ళు. లేళ్ళను తరుముతారు సింహపు పిల్లల్లా. తపస్వుల మనసులను దోచేస్తున్నారంటే నమ్ము. ఆ కవలలను మునులు ఎప్పుడూ వదలకుండా వాళ్ళ ఒళ్ళల్లోనే కూర్చోబెట్టుకుంటారు. అంతేకాదు. వాళ్ళిప్పుడు వాల్మీకి-భగవానులు రచించిన రామాయణకావ్యాన్ని చదువుతున్నారు.

**వేదవతీ:** *ఇమం ఉత్తంతం సుణిఅ ఏదావత్థం సీదా కిదపుణ్ణేత్తి తక్కేమి। ... ... అహం ఇంహవహంతి సీదాసోహోఅణివత్యం ఆఔ సిణిద్ధం అంణోణ్ణం।*

ఇమం వృత్తాన్తం శ్రుత్వా ఏతదర్థం సీతా కృతపుణ్యేతి తర్కయామి। ... స్నిగ్ధమన్యోన్యమ్।

**ప్రథమా:** *సంభరణీఅం ఖు ఏదం। కో ణేమిసఉత్తంతో?*

సమ్భరణీయం ఖల్వేతత్ । కో నైమిశవృత్తాన్తః?

**వేదవతీ:** *సంభరిదో ఏవ్వ జణ్ణసంభారో మహారాఅస్స, ణిమంతిదో సాంతరవాసిణీఓ తపోధణాణం సంపాదో।*

సమ్భృత ఏవ సమ్భృతః యజ్ఞసమ్భారో మహారాజస్య, నిమన్త్రితః సాన్తర్వాసినీకస్తపోధనానాం।

**ప్రథమా:** *కిం ణిమంతిదో భఅవం వమ్మీఈ?*

కిం నిమన్త్రితో భగవాన్ వాల్మీకిః?

---

**వేదవతి:** సీత చాలా పుణ్యం చేసి ఉంటుంది.

**మునికన్య l:** నిజమే! నైమిశారణ్యం విశేషాలేమిటి?

**వేదవతి:** యాగసంభారాలన్నీ సమీకరించబడినాయి. తపస్వులను సతీసమేతంగా ఆహ్వానించారు.

**మునికన్య l:** వాల్మీకిభగవానులను కూడా ఆహ్వానించారా?

**వేదవతీ:** *సుదం వంమీఇతపోవణం వి ఆఅదో రామదూదోత్తి । కహిం దాణిం సీదా పేఖిదవ్వా?*

శ్రుతం వాల్మీకితపోవనమప్యాగతో రామదూత ఇతి । కుత్రేదానీం సీతా ప్రేక్షితవ్యా?

**ప్రథమా:** *ఏత్థ ఏవ్వ సాలపాఅవచ్ఛాఆఏ ఉపవిసది, కహం అదివా హేమిత్తి ?*

అత్రైవ సాలపాదపచ్ఛాయాయాముపవిశతి, కథమతివాహయామీతి?

(*ఇతి నిష్క్రాన్తే*)

**ఇతి ప్రవేశకః**

---

**వేదవతి:** రామదూత వాల్మీకుల వారి ఆశ్రమానికి కూడా వచ్చాడట. సరే కానీ, ఇప్పుడు సీత ఎక్కడున్నది?

**మునికన్య 1:** అదుగో! అక్కడ మద్దిచెట్టు నీడలో కూర్చుని ఉన్నది – కాలమెలా గడపగలనా అని ఆలోచిస్తూ.

(*ఇద్దరూ నిష్క్రమిస్తారు*)

**ప్రవేశకము సమాప్తము**

*(తతః ప్రవిశతి చిన్తాం నాటయన్తీ భూమ్యాసనోపవిష్టా సీతా)*

**సీతా:** *(నిఃశ్వస్య) అహో అవిస్ససణీఅదా పఇదిణిట్ఠురభావాణం పురుసహిఅఆణం। జం తంభప్పలిహిదవ్వణేఆణం దంపదీణం పసంగే ఉమామ హేస్సారోత్తి సగ్గే పుడవీఏ సీదారామోత్తి అదిప్పసిద్ధిం ఆరోవిఅ ణిరవరాధా ఏదం గఈం అత్తంతమణుభావిదోమ్హి । అథ కీస అహం అంఅఉత్తం ణిందామి। ఏవ్వం పురా అంఅఉత్తేణ ఏఅస్స వఅణీఅగా... ధాధణం సుఅమేత్తఏణ అదరదిమణ్ణుత్తి సంపదం అణేఅజోఅణాంతరిదే .. సణం అకారణం మారిసి పుణ్ణదుక్క కారిణీ జాదా।*

(నిఃశ్వస్య) అహో అవిశ్వసనీయతా ప్రకృతినిష్ఠురభావానాం పురుష-హృదయాణామ్। యత్సమ్భప్రలిఖితవ్యస్నేహానాం దమ్పతీనాం ప్రసఙ్గే ఉమామహేశ్వరావితి స్వర్గే పృథివ్యాం సీతారామావితి అతిప్రసిద్ధిమారోప్య నిరపరాధా ఏతాం గతిమత్యన్తమనుభావితాస్మి। అథ కీదృగహమార్య-పుత్రం నిన్దామి। ఏవం పురార్యపుత్రేణ... సామ్ప్రతమనేకయోజనాన్తరితే ... అకారణం... పూర్ణదుఃఖకారిణీ జాతా।

---

*(సీత దిగులుగా నేలపైన కూర్చొని ఉంటుంది)*

**సీత:** (నిట్టూర్చి) ఆహా! ఏమిటీ పురుషుల అవిశ్వాసనిష్ఠురస్వభావం! ఆశ్చర్యం కలుగుతున్నది. ఆదర్శదంపతులు అంటే పైన ఉమామహేశ్వరులూ, కింద సీతారాములే ప్రసిద్ధి అని చెప్పి, నిర్దోషినైన నన్ను ఈ దీనావస్థకు చేర్చారు. దీనికి ఆర్యపుత్రులను ఎలా తప్పుపడతాను! ఇలా ఆర్యపుత్రులకు దూరమై అంతులేని దుఃఖాన్ని అనుభవిస్తున్నాను.

*తేణ సహ దిట్ఠో చందోదఓ, తేణ సహ సుదో కోకిలకలప్పలాఓ, తేణ సహ అణుభూదో మలఅమారుదప్పరిసో, సంపదం మఏ ఏఆఇణీఏ దిఠ్ఠో అ సుదోఅ అణుభూదోఅ। పాణం పరిచ్చఆమిత్తి సవ్వహా అలిఅ మారిసీహి ఇత్థిఆహి। పురా అహం సామివల్లహదాఏ సఅలమిహిలాజణపత్థణీఅం భమిఅ అజ్జ ఉణ ఏదావత్థం శోఅణీఆ సంవుత్తేత్తి పరిచ్చాయ దుక్కాదో లజ్జా ఏవ మం అహిఅదరం బాహేది।*

తేన సహ దృష్టశ్చన్ద్రోదయః, తేన సహ శ్రుతః కోకిలకలప్రలాపః, తేన సహానుభూతో మలయమారుతస్పర్శః, సామ్ప్రతం మయైకాకిన్యా దృష్టశ్చ శ్రుతశ్చానుభూతశ్చ। ప్రాణాన్ పరిత్యజామీతి సర్వథా అలీకం మాదృశీభిః స్త్రీభిః। పురాహం స్వామివల్లభతయా సకలమిథిలాజనప్రార్థనీయా భూత్వా (?) అద్య పునరేతదవస్థం శోచనీయా సంవృత్తేతి పరిత్యాగదుఃఖతో లజ్జైవ మామధికతరం బాధతే।

---

ఆయనతో కలిసి చంద్రోదయాలను చూశాను. కోకిలగానాలను విన్నాను. మలయమారుతాన్ని అనుభవించాను ఆయనతో కలిసి. ఇప్పుడు ఒక్కదానినే ఇవన్నీ చూస్తూ, వింటూ, అనుభవిస్తూ ఉన్నాను. ఇప్పుడు నేను ప్రాణత్యాగం చేయటం కూడా ఉచితం కాదు. పూర్వం రామపత్నిగా, సకల మిథిలానగరవాసులకు పూజనీయురాలినిగా ఉండిన నాకు, ఇప్పుడు ఈ అవస్థ శోచనీయం. విడిచి పెట్టబడ్డానన్న దుఃఖంకన్నా, అవమానభారం నన్ను కుంగదీస్తున్నది.

*సంపదం ఉణ జాదా దారా సంవడ్డిఆ అ । సాదరో దాణిం భఅవం వంమీఈః । ణ జుత్తం మమ ఏదిణా తపోవణవాసవిరుద్ధేణ దీహణిస్సాసేణ కాలం అదివహిదుం । ఏత్త ఏవ్వ మరణవ్వవసాఅస్స పడిబంధో జం మఏ పిఅసహీ వేదవదీ ణ సందిట్టా ణవి ఉవణిమంతిదాఅ ।*

సామ్ప్రతం పునర్జాతౌ దారకౌ సంవర్ధితౌ చ । సాదర ఇదానీం భగవాన్ వాల్మీకిః । న యుక్తం మమైతేన తపోవనవాసవిరుద్ధేన దీర్ఘనిశ్వాసేన కాలమతివాహయితుమ్ । ఏతదేవ మరణవ్యవసాయస్య ప్రతిబన్ధో యన్మయా ప్రియసఖీ వేదవతీ న సన్దిష్టా నాప్యుపనిమన్త్రితా చ ।

(*తతః ప్రవిశతి వేదవతీ*)

**వేదవతీ:** *కిదో ఏవ్వ తపోధణాణం వందణువ్వాఆరో అదిహిజణ-సముఇదో సముదాఆరో అ । తా ఇదో ఏవ్వ సాలపాదపం గదుఅ పిఅసహిం సంభావఇస్సం । (పరిక్రమ్య విలోక్య చ) ఏసా విదేహరాఅతణఆ ణిదాహ-మాసలఆ విఅ పరిక్ఖామపాండరాఏ అవత్థాఏ హిఅఅ అక్ఖిపంతీ*

---

ఇక ఇప్పుడు పిల్లలు కూడా పుట్టి పెరుగుతున్నారు. వాల్మీకిభగవానులు మమ్మల్ని ప్రేమగా చూసుకుంటున్నారు. తపోవనాచారానికి విరుద్ధంగా నేను ఇలా నిట్టూర్పులు విడుస్తూ ఉండకూడదు. నా ప్రియసఖియైన వేదవతికి తెలియబరచకపోవడం, పిలవనైనా పిలవకపోవడం – ఈ రెండూ నా మరణనిశ్చయానికి అడ్డు తగులుతున్నాయి.

*సాలమూలమలంకరోది। తా ఉవసప్పిస్సం।(ఉపసృత్య) ఏసా చింతా-పరవసా అహోముహీ లంబాలఆచ్ఛాఇఅణఅణా దీణ పేక్ఖిదా। సద్దావఇస్సం। సహి వైదేహి! (ఇతి శబ్దాపయతి)*

కృత ఏవ తపోధనానాం వన్దనోపచారః అతిథిజనసముచితః సముదాచారశ్చ। తదిత ఏవ సాలపాదపం గత్వా ప్రియసఖీం సమ్భావయిష్యామి। (*పరిక్రమ్య విలోక్య చ*) ఏషా విదేహరాజతనయా నిదాఘమాసలతేవ పరిక్షామపాణ్డురయావస్థయా హృదయమాక్షిపన్తీ సాలమూలమలఙ్కరోతి। తదుపసర్పామి। (*ఉపసృత్య*) ఏషా చిన్తాపరవశేవాధోముఖీ లమ్బాలకాచ్ఛాదితనయనా దీనప్రేక్షితా। శబ్దాపయిష్యామి। సఖి వైదేహి! (*ఇతి శబ్దాపయతి*)

---

(*వేదవతి ప్రవేశిస్తుంది*)

**వేదవతి:** తపోధనులకు నమస్కరించాను. అతిథులకు అన్నీ సమకూర్చాను. ఇప్పుడు సాలవృక్ష చ్ఛాయలో కూర్చుని ఉన్న ప్రియసఖి సీతను పలకరిస్తాను. అదుగో వైదేహి! గ్రీష్మఋతువులో వాడిపోయి, పాలిపోయిన లతలాగా ఈ సాలవృక్షం కింద కూర్చున్నది. తలవంచుకొని విచారంలో మునిగిపోయి, శిరోజాలు కళ్ళను కప్పేస్తుంటే అతి దీనంగా ఉన్నది. తనను పిలుస్తాను... సఖీ, వైదేహీ!

**సీతా:** (ససమ్భ్రమం విలోక్య) *పిఅం మే పిఅం మే । సంపత్తా పిఅసహీ వేదవదీ । సాఅదం పిఅసహీఏ ।* (పరిష్వజ్యోపవేశయతి)

(ససమ్భ్రమం విలోక్య) ప్రియం మే ప్రియం మే । సమ్ప్రాప్తా ప్రియసఖి వేదవతీ । స్వాగతం ప్రియసఖ్యాః । (*పరిష్వజ్యోపవేశయతి*)

**వేదవతీ:** *అవి కుసలం కుసలవాణం?*

అపి కుశలం కుశలవయోః?

**సీతా:** *జహా వణవాసిణం ।*

యథా వనవాసినామ్ ।

**వేదవతీ:** *కీదిసో తుమ్హాణం వుత్తంతో?*

కీదృశో యుష్మాకం వృత్తాన్తః?

---

**సీత:** (*సంభ్రమంగా*) ఆహా! సంతోషం! వేదవతీ నువ్వు రావటం. (*కౌగలించుకొని కూర్చోబెడుతుంది*)

**వేదవతి:** కుశలవులకు కుశలమేనా?

**సీత:** ఆహా! వనవాసులలాగే.

**వేదవతి:** మరి నీ మాట?

**సీత:** *(వేణీం ణిర్దిశ్య) కీదిసో సో?*

*(వేణీం నిర్దిశ్య)* కీదృశోఽసౌ?

**వేదవతీ:** *(ఆత్మగతమ్) అదిమత్తం సంతవఇ ఏసా వరాఈ। రామసదేశస్స సంకిత్తణేణ విణిధారఇస్సం। (ప్రకాశమ్) అయి అపండిదే! తహ నిరపేక్ఖస్స నిరణుక్కోసస్స కిదే కీస తుమం అసిదపక్ఖ చందలేహా విఅ దిణే దిణే పరిహీఅసి?*

*(ఆత్మగతమ్)* అతిమాత్రం సన్తపతి ఏషా వరాకీ। రామసదేశస్స(?) సఙ్కీర్తనేన వినిధారయిష్యామి। *(ప్రకాశమ్)* అయి అపణ్డితే! తథా నిరపేక్షస్య నిరనుక్రోశస్య కృతే కీదృక్ త్వమసితపక్ష చన్ద్రలేఖేవ దినే దినే పరిహీయసే?

**సీతా:** *కహం సో ణిరణుక్కోసో?*

కథం స నిరనుక్రోశః?

---

**సీత:** *(సంస్కరించబడని తన శిరోజాలను చూపిస్తూ)* ఇలాగే.

**వేదవతి:** *(తనలో)* చాలా బాధపడుతున్నదీ దీనురాలు రాముడి అనాదరణ గురించి మాట్లాడి ఊరడిస్తానీమెను.

*(పైకి) అమాయకురాలా!* ఆ ప్రేమ లేని నిర్దయుడి కోసం నువ్వెందుకు ఇలా కృష్ణపక్ష చంద్రరేఖలా దినదినమూ క్షీణించిపోతున్నావు?

**సీత:** ఆయన నిర్దయుడా?

**వేదవతి:** *జేణ పరిచ్చత్తాసి।*

యేన పరిత్యక్తాసి।

**సీతా:** *కిమహం పరిచ్చత్తా?*

కిమహం పరిత్యక్తా?

**వేదవతీ:** *(విహస్య వేణీం పరిమార్జయతి) ఏవ్వం లోఓ భణది సచ్చం పరిచ్ఛత్తా।*

*(విహస్య వేణీం పరిమార్జయతి)* ఏవం లోకో భణతి సత్యం పరిత్యక్తా।

**సీతా:** *అహ సరీరేణ ణ ఉణ హిఅఏణ।*

అథ శరీరేణ న పునర్హృదయేన।

**వేదవతీ:** *కహం పరకేరఅం హిఅఅం జాణాసి?*

కథం పరకీయం హృదయం జానాసి?

---

**వేదవతి:** నిన్ను విడిచిపెట్టాడు కదా!

**సీత:** నేను విడిచిపెట్టబడ్డానా?

**వేదవతి:** *(నవ్వి జుట్టును దువ్వుతుంది)* అలా అని లోకం అంటున్నది. నిజంగానే విడిచిపెట్టాడు కదా!

**సీత:** భౌతికంగా మాత్రమే! హృదయపూర్వకంగా కాదు.

**వేదవతి:** పరహృదయం ఎలా తెలుసు నీకు?

**సీతా:** *కహం తస్స హిఅఅం సీదాఏ పరకేరఅం భవిస్సది?*

కథం తస్య హృదయం సీతాయాః పరకీయం భవిష్యతి?

**వేదవతీ:** *అహో! అపరిచ్చత్తాణురాఅదా!*

అహో! అపరిత్యక్తానురాగతా!

**సీతా:** *కహం సో మమ ఉవరి పరిచ్చత్తాణురాఓ జేణ అదిప్పసిత్తో ఏవ్వ మం అధణ్ణం ఉందిసిఅ అంఅఉత్తేణ అణుభూదో సేదుబంధాది-పరిస్సమో?*

కథం స మమోపరి త్యక్తానురాగః యేనాతిప్రసిద్ధ ఏవ మామధన్యా-ముద్దిశ్యార్యపుత్రేణానుభూతః సేతుబన్ధాదిపరిశ్రమః?

**వేదవతీ:** *అత్తసిలాహిణి! ఖత్తిఆణం సముఇదో ఏసో రావణస్స ఉవరి రోసో ణ సీదాఏ ఉవరి అణురాఓ।*

ఆత్మశ్లాఘిని! క్షత్రియాణాం సముచిత ఏష రావణస్యోపరి రోషో న సీతాయా ఉపర్యనురాగః।

---

**సీత:** ఆయన నాకెలా పరాయివాడయినాడు?

**వేదవతి:** ఆహా! గాఢానురాగం!

**సీత:** కాదా? ఆయన నాకోసం సముద్రానికి సేతువు కట్టాడన్నది లోక-ప్రసిద్ధమే కదా!

**వేదవతి:** నిన్ను నువ్వు ప్రశంసించుకోకు. ఆయన దానిని క్షత్రియ—

**సీతా:** *ఏదం అవరం ఙ పేక్షసి?*

ఏతదపరం న ప్రేక్ష సే?

**వేదవతీ:** *కిం ఏదం అవరం?*

కిమేతదపరమ్?

**సీతా:** *ఏదం।*

ఏతత్।

**వేదవతీ:** *కిం ఏదం?*

కిమేతత్?

---

ధర్మంగా చేశాడు. అది రావణుడి మీద సహజంగా ఉండే కోపంతో. సీత పైన ప్రేమతో కాదు.

**సీత:** ఇంకొక విషయం గమనించలేదు నువ్వు.

**వేదవతి:** అదేమిటో?

**సీత:** అదే.

**వేదవతి:** అదే ఏమిటి?

**సీతా:** *(సలజ్జమ్) జం సవత్తీజణణీసాసాణువవిద్ధే రామవచ్ఛత్థలే అదిచిరం సంభావిదమ్హి ।*

(సలజ్జమ్) యత్ సపత్నీజననిఃశ్వాసానుపవిద్ధే రామవక్షఃస్థలే అతిచిరం సమ్భావితాస్మి ।

**వేదవతీ:** *సహి! మా ఉత్తమ్మ, సమాసణ్ణో రామస్స జణ్ణదిక్ఖాసమఓ ।*

సఖి మా ఉత్తామ్య, సమాసన్నో రామస్య యజ్ఞదీక్షాసమయః ।

**సీతా:** *తదో కిం?*

తతః కిమ్?

**వేదవతీ:** *ణం తహిం అస్సస్స సహధంమఆరిణీఏ పాణిగ్గహో ణివ్వత్తిదవ్వో ।*

నను తత్రాశ్వస్య సహధర్మచారిణ్యా పాణిగ్రహో నిర్వర్తయితవ్యః ।

---

**సీత:** (*సిగ్గుతో*) ఏకపత్నీవ్రతుడైన ఆయన వక్ష స్థలం మీద చిరకాలం ఉన్నాను.

**వేదవతి:** సంబరపడకు సీతా! ఆయన యజ్ఞదీక్షా సమయం ఆసన్నమైంది.

**సీత:** ఐతే?

**వేదవతి:** అప్పుడు యాగార్థం ఆయన మళ్ళీ పెళ్ళాడాలి కదా.

**సీతా:** *అంఅఉత్తస్స హిఅఏ పహవామి ణ ఉణ హత్తే।*

ఆర్యపుత్రస్య హృదయే ప్రభవామి న పునర్హస్తే।

**వేదవతీ:** (*ఆత్మగతమ్*) *అహో అస్స దిఢాణురాఅదా!*

(*ప్రకాశమ్*) *సహి। పుత్తముహదంసణేణ వి దే పవాససోఓ ణావణీదో?*

(*ఆత్మగతమ్*) అహో అస్యా దృఢానురాగతా!

(*ప్రకాశమ్*) సఖి। పుత్రముఖదర్శనేనానాపి తే ప్రవాసశోకో నాపనీతః?

**సీతా:** *సోఅపడిఆరేణ వి సోఓ వడ్ఢఅది।*

శోకపరిహారేణాపి శోకో వర్ధతే।

**వేదవతీ:** *కహం విఅ?*

కథమివ?

---

**సీత:** ఆయన హృదయం పైనే నా అధికారము. పాణిగ్రహణం విషయంలో కాదు.

**వేదవతి:** (*తనలో*) ఆహా! ఏమిటీమె బద్ధానురాగం!

(*పైకి*) సఖీ! పుత్రులను చూసుకొని అయినా నీ దుఃఖం తగ్గలేదు.

**సీత:** పోగొట్టుకోవాలని ప్రయత్నించినకొద్దీ ఎక్కువౌతున్నదే కానీ దుఃఖం తగ్గటం లేదు.

**వేదవతి:** అదెలా?

**సీతా:** *జహ జహా దే దారఆ ఈససముంభిణ్ణదసణంకురకోమలేణ వదణేణ ముహం ఆలోఅంతా పహసంతి, అచ్చంతకోమలేణ ఆలావేణ తాదిసం సద్దావేఅంతి, తహ జాణామి తస్స ముందే ణిమజ్జామిత్తి। సంపదం ఉణ కాలవసేణ పరిణదా పరిచ్చత్తబాలభావా అబాలా సంవుత్తేవితి మం అహిఅతరం బాధేయది।*

యథా యథా ద్వౌ దారకావీషత్సముద్భిన్నదశనాఙ్కురకోమలేన వదనేన మమ ముఖమాలోకయన్తౌ ప్రహసతః, అత్యన్తకోమలేనాలాపేన తాదృశం శబ్దాపయతః తథా జానామి తస్య మౌగ్ధ్యే నిమజ్జామీతి। సామ్ప్రతం పునః కాలవశేన పరిణతౌ పరిత్యక్తబాలభావావబాలౌ సంవృత్తావితి మామధికతరం బాధతే।

**వేదవతీ:** *అహో కింతి తస్స మహగ్ఘం ణిసంసత్తణం జం సీదా ణామ బాలతణఆ ఈరిసం అవత్థం అణుభవదిత్తి।*

అహో కిమితి తస్య మహార్ఘం నృశంసత్వం యత్సీతా నామ బాల-తనయేదృశీమవస్థామనుభవతీతి।

---

**సీత:** నా పిల్లలు అప్పుడే వస్తున్న చిన్ని చిన్ని దంతాలతో నవ్వుతున్నప్పుడు చిన్న చిన్న మాటలు మాట్లాడుతూ ఉన్నప్పుడు, ఆయన బాల్యపు ముగ్ధత్వపు తలపులలో మునిగిపోతాను. వాళ్ళు బాల్యావస్థనుంచి బయటపడే ఈ సమయంలో మళ్ళీ నా బాధలు జ్ఞాపకం వస్తాయి.
**వేదవతి:** ఆహా! సీత అనుభవిస్తున్న ఈ అవస్థకు కారకుడైన ఆయన నిర్దయత్వం ఎంత ఘోరమైనది!

**సీతా:** *సహి వేదవది! అవి ణామ...*

సఖి వేదవతి! అపి నామ...

**వేదవతీ:** *కీస లజ్జిదేణ, భణాహి అంఅఉత్తం పేక్ఖామిత్తి।*

కిం లజ్జితేన, భణ ఆర్యపుత్రం ప్రేక్ష ఇతి।

**సీతా:** (*ఆత్మగతమ్*) *కిం లజ్జావేసేణ, ఏవ్వం భణామి। (ప్రకాశమ్) అవి కుసలవాణం తాదస్స దంసణేణ జమ్మం అమోహం భవేదిత్తి।*

(*ఆత్మగతమ్*) కిం లజ్జావేశేన, ఏవం భణామి। (*ప్రకాశమ్*) అపి కుశ-లవయోస్తాతస్య దర్శనేన జన్మామోఘం భవేదితి।

**వేదవతీ:** *ణం సమాసణ్ణం ఏవ్వ తుమ్హాణం రాఅదంసణం।*

నను సమాసన్నమేవ యుష్మాకం రాజదర్శనమ్।

---

**సీత:** సఖీ, వేదవతీ! ఇది జరుగుతుందా?

**వేదవతి:** సిగ్గెందుకు సీతా? అడుగు. ఆయన్ని చూడగలనా? అనే కదా.

**సీత:** (*తనలో*) సిగ్గుపడితే ఏం లాభం? అలాగే అడుగుతాను.

(*పైకి*) కుశలవుల తండ్రిని చూసి నా జన్మను సఫలం చేసుకుంటానా?

**వేదవతి:** నీవు రాజుగారిని చూసే సమయం కూడా దగ్గరపడింది.

**సీతా:** *కహం విఅ?*

కథమివ?

*(నేపథ్యే ఋషిః)*

భో భో ఆశ్రమవాసినో జనాః! శృణ్వన్తు భవన్తః —

ఇతో నాతిదూరే మహాక్రతురశ్వమేధః ప్రవర్తతే, సమ్భృతాని యజ్ఞోప-కరణాని, సన్నిపతితాశ్చ నానాదేశాశ్రమవాసినో వసిష్ఠాత్రేయప్రభృతయో మహామునయః। కేవలం భగవతో వాల్మీకేరాగమనముదీక్షమాణో నాద్యాపి యజ్ఞదీక్షాం ప్రవిశతి మహారాజః । ఆగతశ్చ వాల్మీకితపోవన-వాసినాముపనిమన్త్రణార్థం రామదూతః। తస్మాన్నైవ పరిలమ్బితవ్యమ్।

---

**సీత:** ఏ విధంగా?

*(తెర వెనుక నుంచి ఒక ఋషి)*

ఓ ఆశ్రమవాసజనులారా! వినండి. ఇక్కడికి అనతిదూరంలోనే అశ్వమేధక్రతువు జరుగుతున్నది. యజ్ఞసంభారాలు సేకరించబడినాయి. నానాదేశాలనుండి ఆశ్రమవాసులు, వశిష్ఠాత్రేయాదిమునులు విచ్చేశారు. వాల్మీకులవారి రాకకోసం నిరీక్షిస్తూ, మహారాజు ఇంకా యజ్ఞదీక్షను స్వీకరించలేదు. వాల్మీకుల వారిని ఆహ్వానించడానికి రామదూత తపోవనానికి వచ్చేశాడు. ఇక ఆలస్యం చేయకూడదు.

తీర్థోదకాని సమిధః పరిపూర్ణరూపా
దర్భాఙ్కురానవిహతాన్ పరిగృహ్య సద్యః ।
అగ్రే భవన్తు మునయో మునికన్యకాశ్చ
కుర్వన్తు మఙ్గలబలీనుటజాఙ్గణేషు ॥2॥

**సీతా:** *తువరేమి తువరేమి, ఏస అంఅకస్సవో పత్థాణఘోసణా-సమనన్తరం గహిదజణ్ణోవకరణో అగ్గదో పత్థిదో । అహం వి కుసలవాణాం పత్థాణమంగలం అణుచిట్ఠిసం ।*

త్వరామి త్వరామి, ఏష ఆర్యకాశ్యపః ప్రస్థానఘోషణాసమనన్తరం గృహీతయజ్ఞోపకరణోఽగ్రతః ప్రస్థితః । అహమపి కుశలవయోః ప్రస్థాన-మఙ్గలమనుష్ఠాస్యామి ।

(*ఇతి నిష్క్రాన్తాః సర్వే*)

---

వెంటనే తీర్థోదకాలు, సమిధలు, దర్భలు తీసుకుని మునులు ముందు నడవండి. మునికన్యలు కుటీరాల ముందు మంగళకరమైన బలులను[16] సమర్పించండి.

**సీత:** త్వరపడాలి. ఈ ఆర్యకాశ్యపులు ప్రస్థానఘోష చేసిన వెంటనే యజ్ఞోపకరణాలతో బయలుదేరారు. నేను కూడా కుశలవులకు మంగళహారతిచ్చి పంపుతాను.

(*అందరూ నిష్క్రమిస్తారు*)

[16] దేవతాప్రీత్యర్థం నివేదించే ఆహారం

# తృతీయోఽఙ్కః – మూడవ అంకము

*(తతః ప్రవిశతి మార్గపరిశ్రాన్తో గృహీతభారస్తాపసః)*

**తాపసః**: *(శ్రమమభినీయ) భో సుట్ఠు పరిస్సంతోమ్హి ఏదిణా సందావదీ పేణ గిమ్మసమఏణ। ణ ప్పహవామి పరిస్సమగలాణం జంఘాణం విక్కేవణిక్కేవం కాదుం। పాదదలం అ మే సంపక్కం పిఅలఅసంపోడఏహి సంవుత్తం। అణ్ణచ్చ, తహ సుఉమాలా దేవీ సీదా తహ కోమలా అ కుసలవా తాపససద్ధేణ సహ అణత్థమిదే సూరే ణేమిశం పత్తా। అహం అజ్జ వి ణాసాదేమి అడవి దిసాము హే।*

*(విచిన్త్య) కో దాణిం మే ణేమిసమగ్గం ఆచక్ఖిస్సది?*

(విలోక్య) *ఇణాణం ఏసో లక్ఖణసహోఓ రామో ణేమిసం సంపత్తో। తా అహం వి దాణం గఇం అణుసరేమి। (నిష్క్రాన్తః)*

---

*(బరువును మోసుకుంటూ ఆపసోపాలు పడుతూ ఉన్న ఒక తాపసి ప్రవేశిస్తాడు)*

**తాపసి**: (ఆయాసపడుతూ) ఉష్షు! బాగా అలిసిపోయాను తీవ్రమైన ఈ వేసవి ఎండ కారణంగా. బడలిక కారణంగా నా పిక్కలను ఎత్తలేకపోతున్నాను, దించలేకపోతున్నాను. అరికాళ్ళు బొబ్బలెక్కాయి.

ఇంకో మాట కూడా ఉంది – ఆ సుకుమారి సీతాదేవి, ఆ సుకుమారులు కుశలవులు మునులతో కలిసి సూర్యాస్తమయం కన్నా

(*శ్రమమభినీయ*) భోః, సుష్ఠు పరిశ్రాన్తోఽస్మి ఏతేన సన్తాపదీర్ఘేణ గ్రీష్మసమయేన। న ప్రభవామి పరిశ్రమగతయోర్జఙ్ఘయోర్విక్షేపనిక్షేపౌ కర్తుమ్। పాదతలఞ్చ మే సమ్పృక్వం పిటకసంస్ఫోటకైః సంవృత్తమ్। అన్యచ్చ తథా సుకుమారా దేవీ సీతా తథా కోమలౌ చ కుశలవౌ తాపస-సార్థేన సహానస్తమితే సూర్యే నైమిశం ప్రాప్తాః। అహమద్యాపి నాసాదయామి అటవీ దిశాముఖే। (*విచిన్త్య*) క ఇదానీం మే నైమిశమార్గమాచక్షీత?

(విలోక్య) నూనమేష లక్ష్మణసహాయో రామో నైమిశం సమ్ప్రాప్తః। తదహమపి తయోర్గతిమనుసరామి। (*నిష్క్రాన్తః*)

**ఇతి ప్రవేశకః**

---

ముందే నైమిశం చేరుకున్నారు. నేను అడవి మొదలయ్యే చోటికైనా చేరుకోలేదు.

(*సాలోచనగా*) నాకు నైమిశానికి వెళ్ళే దారి ఎవరు చెబుతారు?

(*పరికించి చూసి*) *అదిగో, రాముడు, లక్ష్మణసమేతంగా నైమిశానికి వచ్చాడు. వారిని అనుసరించి వెళతాను.* (*నిష్క్రమిస్తాడు*)

**ప్రవేశకము సమాప్తము**

(*తతః ప్రవిశతి శోకసన్తప్తో రామో లక్ష్మణశ్చాగ్రతః*)

**లక్ష్మణః:** ఆర్య ఇత ఇతః। (*పరిక్రమ్య*)

ప్రథమమనపరాధాం తాం సముత్సృష్య దేవీ–
మగమమహమగాధే కాననే త్యక్తుకామః।
పునరపి కులశేషం రామమాదాయ దేవం
స్వజనవిపది దక్షః క్వాప్యధన్యః ప్రయామి ॥1॥

హా! సుష్ఠు ఖల్విదముచ్యతే–

ప్రమాదః సమ్పదం హన్తి ప్రశ్రయం హన్తి విస్మయః।
వ్యసనం హన్తి వినయం హన్తి శోకశ్చ ధీరతామ్ ॥2॥

ఇతి।

---

(*ముందు లక్ష్మణుడు, అతడివెనుక శోకతప్తుడైన రాముడు ప్రవేశిస్తారు*)

**లక్ష్మణుడు:** ఇటు, ఇటువైపు నడవండి ఆర్యా! (*నడిచి*)

ఏమిటి నేను చేసేపని? మునుపు నిరపరాధి సీతమ్మను ఇక్కడికి తీసుకునివచ్చి విడిచిపెట్టాను. మళ్ళీ రామచంద్రుణ్ణి తీసుకుని ఇక్కడికే వచ్చాను. స్వజనులను ఆపదలపాలు చేయటమే నా కర్తవ్యంలాగా ఉన్నది.

అంటారు కదా –

అజాగ్రత్త సంపదను, గర్వము ప్రేమను నాశనం చేస్తాయి. అలాగే వ్యసనం శీలాన్ని, శోకం ధైర్యాన్ని పోగొడతాయి, అని.

తథా హి ఏష మన్దరమహీధరసమానధైర్యో భగవతో వాల్మీకే-రాగమనముపలభ్య తద్దర్శనార్థం గోమతీతీరాశ్రమపదముచ్చలితః। సమ్ప్రతి తామేవ దిశం పరిత్యజ్య శోకావేగసమాక్షిప్తహృదయో మహావనాభిముఖం ప్రస్థితః । తతః కిమేనం సమ్యగ్ జ్ఞాపయామి? అథ వా తత్ కిమనేన ప్రతిహారేణ ధావితం మార్గమాదేశయామి, యథాయమచేతయన్నేవ వాల్మీకేరాశ్రమమనుప్రాప్నోతి। ఇత ఇత ఆర్యః।

**రామః:** *(నిశ్వస్య)*

నీతస్తావన్మకరవసతౌ వన్ధ్యతాం శైలసేతు–
ర్దేవో వహ్నిర్న చ విగణితః శుద్ధిసాక్ష్యే నియుక్తః।

---

మందరపర్వతసమానుడైన ఈ ధీరుడు వాల్మీకి రాక గురించి తెలిసి అతడి దర్శనం కోసం గోమతీతీరాశ్రమానికి బయలుదేరాడు. శోకావేగంతో దారితప్పి అరణ్యంలోకి వెళ్తున్నాడు. ఈయనకు సరైన మార్గం చూపించనా? లేదా ప్రతీహారి వలె ముందుకు పరుగెత్తుతూ మార్గం చూపించనా? నేను అట్లా ముందు పరిగెడుతూ ఉంటే అతను తనకు తెలియకుండానే తాను వాల్మీకి ఆశ్రమానికి చేరుకుంటాడు. ఇటు, ఇటువైపు రండి, ఆర్యా!

**రాముడు:** *(నిట్టూర్చి)* సేతుబంధనం నిష్ఫలమైంది. అగ్నిదేవుడి సాక్ష్యం కూడా నిరాదరించబడింది. ఇక్ష్వాకువంశవారసులను ఇంతవరకు

ఇక్ష్వాకూణాం భువనమహితా సన్తతిర్నేక్షితా మే
కిం కిం మోహాదహమకరవం మైథిలీం తాం నిరస్య ॥3॥

(*పరిక్రమ్య*)

భో! భోః! కష్టమ్! అతినిరాలమ్బస్తపస్విన్యాః ప్రవాసః।

పాతయతి సా క్వ దృష్టిం కస్మిన్నాసాద్యచిత్తమాశ్వసితి ।
జీవతి కథం నిరాశా శ్వాపదభవనే వనే సీతా ॥4॥

**లక్ష్మణః:** (*ఆత్మగతమ్*) ఆర్యాయా విప్రవాసం తనయవైశసఞ్చ సమనుచిన్త్య సుతరామయం సన్తప్యతే, తతః ప్రస్తావాన్తరేణ దేవీవృత్తాన్త-మపసారయామి।

---

చూడలేదు. మూర్ఖత్వం కొద్దీ సీతను పరిత్యజించి నేనేమేమి చేశానో తెలియదు.

(*ముందుకు నడిచి*)

అయ్యో! చాలా కష్టం. నిరాధారంగా విడిచిపెట్టాను సీతను. ఏమి చూసుకొని తను ఊరడిల్లగలుగుతుంది? ఆశ్వాసనను కోల్పోయి ఉన్న తను ఈ మహారణ్యంలో క్రూరమృగాల మధ్య ఎలా జీవిస్తుంది?

**లక్ష్మణుడు:** (*తనలో*) సీతమ్మ వనవాసాన్నీ, తన సంతానానికి వాటిల్లిన హానిని ఊహించుకుంటూ చాలా బాధపడుతున్నాడు అన్న. మాట మారుస్తాను.

(*ప్రకాశమ్*) ఇతస్తావదవలోకయత్వార్యః –

మరకతహరితానామమ్భసామేకయోని–
ర్మదకలకలహంసీగీతరమ్యోపకణ్ఠా।
నలినవనవికాసైర్వాసయన్తీ దిగన్తాన్
నరవర పురతస్తే దృశ్యతే గోమతీయమ్ ॥5॥

**రామః:** (*స్పర్శమభినీయ*)

ముక్తాహారా మలయమరుతశ్చన్దనం చన్ద్రపాదాః
సీతాత్యాగాత్ప్రభృతి నితరాం తాపమేవావహన్తి।
అద్యాకస్మాద్రమయతి మనో గోమతీతీరవాయు–
ర్నూనం తస్యాం దిశి నివసతి ప్రోషితా సా వరాకీ ॥6॥

---

(*బైటికి*) ప్రభూ! ఇటు చూడు. మరకతమణుల హరితకాంతుల ఏకైక జలరాశి, కలహంసల మధురనాదాలతో రమ్యమైన పరిసరాలు. కమల-వనాల సుగంధాలు నిండిన దిగంతాలు. ఓ పురుషశ్రేష్ఠా! గోమతీనది నీ ముందున్నది చూడు.

**రాముడు:** (*గాలి తాకిడిని గమనించాక*) సీతాపరిత్యాగం తరువాత ముత్యాల హారాలు, మలయమారుతాలు, చందనం, వెన్నెల నాకు తాపాన్నే కలిగిస్తాయి. నేడు, అకస్మాత్తుగా నా హృదయం గోమతీతీరవాయువుల స్పర్శతో ద్రవిస్తున్నది. తప్పకుండా ఆ దీనురాలు ఇక్కడే ఎక్కడో ఉండి ఉంటుంది.

**లక్ష్మణః:** అతివిషమోఽయం నిమ్నగావతారః, తదప్రమత్తమవ-తీర్యతామ్ ।

(*ఉభావవతరణమభినీయ*) (*నిర్వర్ణ్య*)

యథైతాన్యవిరలపదన్యాసలాఞ్ఛితాని సైకతాని వృన్తమాత్రావ-శేషతయా సంసూచ్యమానకుసుమాపచయా రోధోలతాః తదాలూన-కిసలయతయా విరలచ్ఛాయా వనస్పతయః, తథా జానామి ప్రత్యాసన్న-వర్తినా మనుష్యాధివాసేన భవితవ్యమ్ । తథాహి –

అభినవరచితాని దేవతానాం
జలకుసుమైర్బలిమన్తి సైకతాని ।
ఇయమపి కురుతే తరఙ్గమధ్యే
భుజగవధూలలితాని కున్దమాలా ॥7॥

---

**లక్ష్మణుడు:** నదీతీరం దిగుడుగా, జారుడుగా ఉంది. జాగ్రత్తగా దిగండి.

(*ఇద్దరూ దిగుతూ ఉన్నారు*) (*పరీక్షించి చూసి*)

నదీతీరంలో, ఇసుకలో పాదాల గుర్తులు, పూలు కోసినట్లున్న లతలను, నిరంతరం ఆకులను కోయటం వల్ల తక్కువ నీడనిస్తున్న చెట్లూ, గమనిస్తే సమీపంలోనే మనుష్య నివాసాలు ఉన్నట్లు తెలుస్తున్నది.

దేవతార్చనలకోసం పూలు, నీరు సేకరిస్తూండటంవల్ల కావచ్చు ఈ ఇసుక నలిగినట్లున్నది. అదుగో నాగకన్యలా తరంగాల మధ్య ఆ కుందమాల కొట్టుకొని వస్తున్నది.

**రామః:** న కేవలం ప్రత్యాసన్నవర్తినా ప్రతిస్రోతోపగతేనాపి మనుష్యాధివాసేన భవితవ్యమ్।

**లక్ష్మణః:** ఆశ్చర్యమాశ్చర్యమ్! ఏషా హి కున్దమాలా చరణసపర్యామివ కర్తుకామయా సముద్రగామిన్యా తరఙ్గపరమ్పరయా క్రమేణ దేవస్య పాదాన్తికముపహృతా। అవహితం ప్రేక్షణీయా విరచనా, తదవలోకయ-త్వార్యః। (*గృహీత్వోపనయతి*)

**రామః:** (*నిర్వర్ణ్య రోమాఞ్చమభినీయ*) వత్స, దృష్టపూర్వమిదం కుసుమరచనావిన్యాసకౌశలమ్।

**లక్ష్మణః:** క్వ దృష్టమ్?

---

**రాముడు:** ఈ ప్రవాహగతికి వ్యతిరేకదిశలో, సమీపంలోనే, మానవ-నివాసాలుండాలి.

**లక్ష్మణుడు:** ఆశ్చర్యం! నదీ తరంగాలచేత నెట్టబడుతూ ఉన్న ఈ కుందమాల స్వామి పాదపూజకే వచ్చినట్లు అన్నగారి పాదాల చెంతకే వచ్చింది. దీని అల్లిన నైపుణ్యం చూడ చక్కగా ఉన్నది. (*ఆ దండను చేతిలోకి తీసుకొని రాముడికి ఇస్తాడు*)

**రాముడు:** (*పరీక్షగా చూసి, పులకరించిపోతూ*) వత్సా, ఈ పుష్ప-రచనావిన్యాసం ఇదివరకు చూసిందే.

**లక్ష్మణుడు:** ఎక్కడ చూశారు?

**రామః:** క్వ వాన్యత్రేదృశస్యావస్థానమ్?

**లక్ష్మణః:** కిం దేవ్యామ్?

**రామః:** అథ కిమ్?

**లక్ష్మణః:** కో జానాతి దుర్విదగ్ధః ప్రజాపతిః కథం కథం క్రీడతీతి। గచ్ఛత్వార్యః ఇదమేవ గోమతీతీరం ప్రతిస్రోతోఽనుసరావో యావదస్యాః కున్దమాలాయాః ప్రభవమాసాదయావః।

**రామః:** సులభసాదృశ్యో లోకసన్నివేశః। నచైతావదస్మాకం భాగధేయమ్। ఇతశ్చాత్యన్తవిప్రకృష్టే దేశే పరిత్యక్తాయాః సీతాయా ఆగమనం న సమ్భావ్యతే। తథాప్యాదేశయ మార్గం యేనేదం సలిలాన్తరమముఞ్చన్తౌ వసతిమాసాదయావః।

---

**రాముడు:** ఇంకెక్కడైనా ఇంత నైపుణ్యం ఉండే అవకాశం ఉందా?

**లక్ష్మణుడు:** వదినగారి యందేనా?

**రాముడు:** మరి?

**లక్ష్మణుడు:** బ్రహ్మ ఎలా ఆడిస్తాడో ఎవరికి తెలుసు? పదండి. ~~ఈ~~ గోమతీతీరప్రవాహానికి ఎదురుగా వెళ్లి, ~~ఈ~~ కుందమాల బయలుదేరిన ప్రదేశానికి చేరుదాం.

**రాముడు:** లోకంలో సన్నివేశాలు విచిత్రంగా ఉంటాయి. కానీ మనకంత భాగ్యమా? ఇక్కడికి ఎంతో దూరంగా వదలివేయబడిన సీత

**లక్ష్మణః:** ఏషా నదీభూమిః కణ్టకితశర్కరాశుక్తిపుటదుఃఖసఞ్చారా, తద్యథా యథా మార్గమాదేశయామి తథా తథా శనైరాగన్తవ్యమార్యేణ।

**రామః:** ఏవం క్రియతామ్। యద్యపీయమభిమతా కున్దమాలా తథాపి దేవతోపహారశఙ్కయా నోపభోగముపనీయతే। (*ఇతి విముఞ్చతి*)

**లక్ష్మణః:**

ఏతాం వేత్రలతాం విలఙ్ఘయ పదం మాస్మిన్ కృథాః శుక్తయో
మూర్ధానం వ్యవధాయ నామయ పురో దూరావనమ్రస్తరుః।
చాపాగ్రేణ వికృష్య ముఞ్చ పురతః శాఖాం తిరశ్చీమిమా–
ముత్త్రస్యన్తి పురా శరారుదయితా ధీరం పరిక్రమ్యతామ్ ॥8 ॥

---

ఇక్కడికి రావటం సంభవం కాదు. అయినా దారితియ్యి. ఈ మాల వదలివేయబడిన చోటికి చేరుదాం.

**లక్ష్మణుడు:** ఈ నదీతీరమార్గం ముళ్ళు, ఇసుక, గవ్వ పెంకులతో నిండి నడవడానికి కష్టంగా ఉంది. కనుక నేను చూపిన మార్గంలో నెమ్మదిగా నడవండి.

**రాముడు:** అలాగే. ఈ కుందమాలను తీసుకోవాలనిపించినా, ఇది దేవతలకు సమర్పించబడింది కనుక తీసుకోరాదు. (*వదిలేస్తాడు*)

**లక్ష్మణుడు:** ఈ తీగలను తప్పించుకుని జాగ్రత్తగా అడుగు మోపండి. ఆ చెట్టుకొమ్మ దగ్గర కొంచెం తల వంచాలి. ఈ తరుశాఖలను వింటికొనతో వంచి నడవాలి. అదుగో అక్కడ ఆడుపులులు పడుకొని ఉన్నాయి. అవి ఉలిక్కిపడి లేవకుండా మెల్లగా నడవండి.

**రామః:** (*యథోక్తం పరిక్రమ్య*) వత్స! కిమేతస్మిన్ దేశే భగవతో వాల్మీకేరాశ్రమసన్నివేశః?

**లక్ష్మణః:** కిం దృష్టమార్యేణ?

**రామః:** అసౌ తనుత్వాదవధానదృశ్యా
దిశః సమాక్రమతి ధూమలేఖా।
ఆకృష్యమాణో మృదునానిలేన
శ్రోత్రేషు సమ్మూర్ఛతి సామనాదః ॥9॥

**లక్ష్మణః:** సమ్యగుపలక్షితమార్యేణ। అహమప్యగ్రతో గత్వా నిరూపయామి।

---

**రాముడు:** వత్సా! ఇక్కడికి సమీపంలోనే ఉన్నదా వాల్మీకిభగవానుల ఆశ్రమం?

**లక్ష్మణుడు:** ఆర్యులు ఏం చూశారు?

**రాముడు:** అక్కడ సన్నగా కనిపిస్తున్న హోమధూమం, వాయువు మోసుకుని వస్తున్న సామగానధ్వనులు.

**లక్ష్మణుడు:** బాగా గమనించారు. నేను కొంచెం ముందుకు వెళ్ళి చూస్తాను.

(*పరిక్రామంస్తరుస్తమ్భమభినీయ*) కథమేతస్మిన్ పదోద్ధారే హృదయమ్; స్తమ్భితావూరూ, ఉత్క్షిప్యమాణౌ చరణౌ నాగ్రతో భూమిం గన్తుముత్సహేతే। తత్ కిమిదమ్।

(*విచిన్త్య*) సువ్యక్తం గురుజనసమాక్రాన్తేన ప్రదేశేన భవితవ్యమ్। అథ పదానీవ లక్ష్యన్తే। (*భూమిం నిర్వర్ణయతి*)

**రామః:** కిఞ్చ్కృతోఽయం వత్సస్య భూమినిరూపణాయామాదరః?

**లక్ష్మణః:** ఏతాని నితాన్తమనోహరతయా సఙ్క్రాన్తచరణతల-సౌకుమార్యాణి లలితనిభృతవిన్యాసతయా విజ్ఞాయమానస్త్రీపదభావాని పులినతలసన్నివేశపదాని దృశ్యన్తే। పశ్యత్వార్యః –

---

(*ముందుకు నడిచి, కాళ్ళు పట్టేసినట్లు ఆగిపోయాడు*) ఏమిటో ఇది!? కాలు కదలడం లేదు. హృదయంలో భయం, శంక కలుగుతున్నాయి.

(*ఆలోచించి*) ఏమిటో ఇది!? కాలు కదలడం లేదు. హృదయంలో భయం, శంక కలుగుతున్నాయి. ఇక్కడ ఈ పదచిహ్నాలు పూజ్యులవి వలె ఉన్నాయి. (*నేలను పరీక్షిస్తాడు*)

**రాముడు:** ఎందుకో ఈ చిన్నవాడు నేలను పరీక్షిస్తున్నాడు?

**లక్ష్మణుడు:** ఇక్కడ ఏ స్త్రీకి చెందినవో సుందర, సుకుమార, కోమల పదచిహ్నాలు కనుపిస్తున్నాయి. తమరు చూడండి.

విలాసయోగేన పరిశ్రమేణ వా
స్వభావతో వా నిభృతాని మన్థరమ్।
పదాని కస్యాశ్చిదిమాని సైకతే
ప్రయాన్తి తుల్యం కలహంసవిభ్రమైః ॥10॥

**రామః:** (*నిర్వర్ణ్య సహర్షమ్*) వత్స, కిముచ్యతే కస్యాశ్చిదితి। నను వక్తవ్యం సీతాయాః పదానీతి। పశ్య—

సమానం సంస్థానం నిభృతలలితా సైవ రచనా
తదేవైతద్రేఖాకమలరచితం చారు తిలకమ్।
యథా చేయం దృష్టా హరతి హృదయం శోకవిధురం
తథా హ్యస్మిన్ దేవ్యా సపది పదపఙ్క్తిర్వినిహితా॥11॥

---

అలసట వల్లనో, విలాసగతి కారణంగానో, స్వాభావికంగానో - కలహంస నడకలలా నెమ్మదిగా నడచినట్లున్న ఎవరివో పాదముద్రలు ఇసుకలో ముందుకుపోతూ కనుపిస్తున్నాయి.

**రాముడు:** వత్సా! ఎవరివో అంటావెందుకయ్యా? సీతవే అనరాదా?! చూడు –

పాదాల ఆకృతి అచ్చం అలాగే ఉంది. అవే సుందరమైన పాదాలు. అవిగో పాదాలలో పద్మరేఖలు. ఈ పాదచిహ్నాలు నన్ను ఆ శోకవిచలిత-మూర్తి దగ్గరకు ఈడ్చుకుంటూ పోతున్నాయి. నిశ్చయంగా ఈ పాద-చిహ్నాలు ఇప్పుడిప్పుడే ఏర్పడ్డాయి.

**లక్ష్మణః:** (*సహర్షమ్*) యావదేతామేవ పదపఙ్క్తిమనుసరన్తౌ వాల్మీకే-రాశ్రమపదమనుసరావః। యథా చేయం ప్రత్యగ్రనిహితా పదపఙ్క్తిస్తథా జానామి ప్రత్యాసన్నవర్తిన్యా దేవ్యా భవితవ్యమితి।

(*తతః ప్రవిశతి సీతా*)

**సీతా:** *ణివ్వత్తిదం సవణం, ఉవాసిదా సంఝా, హుదో హుదవహో, ఓగాహిదా భగవఈ భాఈరహీ, భగవఈం భాఈరహీం ఉద్దిసిఅ మహాపదిణ్ణా సహత్థగద్ధా కున్దమాలా సమప్పిదా। దాణిం అహం ఉణ్ణద-గంభీరసీదలం లదాజాలం పవిసిఅ అదిహిజణోపత్థాణజోగ్గాఇం కుసుమాఇం ఓచిణోమి। (ప్రవిష్ట కేనాపచయం నాటయతి)*

నిర్వర్తితం సవనమ్, ఉపాసితా సన్ధ్యా, హుతో హుతవహః, అవగాహితా భగవతీ భాగీరథీ, భగవతీం భాగీరథీముద్దిశ్య … … స్వహస్తగ్రథితా కున్దమాలా సమర్పితా ।

---

**లక్ష్మణుడు:** (*సంతోషంగా*) అయితే ఈ పాదచిహ్నాలను అనుసరించి వెళదాం. ఇప్పుడే నడిచినట్లున్నాయి కనుక సీతమ్మ జాడ తెలియవచ్చు.

(*సీత ప్రవేశిస్తుంది*)

**సీత:** స్నానం అయింది. సంధ్యోపాసన కూడా అయిపోయింది. అగ్నికార్యం కూడా చేశాను. భగవతి భాగీరథిలో మునిగాను. నా మొక్కు ప్రకారం నా స్వహస్తాలతో అల్లిన కుందమాలను నదీమతల్లికి సమర్పించాను.

ఇదానీమహమున్నతగమ్భీరశీతలం లతాజాలం ప్రవిశ్యాతిథి-
జనోపస్థానయోగ్యాని కుసుమాన్యవచినోమి। (*ప్రవిష్ట కేనాపచయం నాటయతి*)

**లక్ష్మణః:** ఏషా పదపఙ్క్తిః క్రమేణ మార్గవశాత్ పులినతలం పరిత్యజ్య స్థలమారూఢా, ప్రణష్టా చ। తదిదమేవ పురస్తాత్సందృశ్యమానలతాగుల్మ-ప్రచ్ఛాయమతిరమణీయమధ్యాస్య గతశ్రమౌ భగవన్తం ప్రాచేతసముప-సర్పావః।

**రామః:** యదభిరుచితం భవతే। (*పరిక్రమ్యోపవిశతః*)
(*నిఃశ్వస్య సబాష్పమ్*) వత్స వత్స –

---

ఇప్పుడీ ఎత్తైన, చల్లని లతాకుంజంలో ప్రవేశించి, అతిథుల కోసం ఫలపుష్పాలను సేకరిస్తాను. (*రంగస్థలద్వారం నుంచి పూవులు కోస్తూ సీత కనబడుతుంది*)

**లక్ష్మణుడు:** ఈ పాదచిహ్నాలు క్రమంగా ఇసుకలో మాయమై స్థలప్రదేశానికి చేరి అదృశ్యమైనాయి. ఎదురుగా ఉన్న లతానికుంజం నీడలో కొంత సేపు విశ్రాంతి తీసుకొని, ప్రాచేతసభగవానులను సమీపిద్దాం.

**రాముడు:** అలాగే! నీకు నచ్చినట్లే చేద్దాం. (*వెళ్ళి కూర్చుంటారు*)
(నిట్టూర్చి, కన్నీళ్ళు కారుస్తూ) నాయనా, నాయనా...

**సీతా:** (*కణ్ణం దత్వా*) *కో ణు ఖు ఏసో సఅలజలహరద్ధణిదగంభీరేణ సరవిసేసేణ అచ్చంతదుఃఖబాఅణం వి మే సరీరం రోమాంచేది। ణిరూవేమి దావ కో ఏసోత్తి। అహవా ణ జుత్తం మమ అజాణిఅ పరమత్థం అత్థాణే దిఠ్ఠిం విసజ్జఇదుం। కిం ఏత్థ జాణిదవ్వం? ణావణాహాయది మే సరీరం పరపురుససద్దో రోమంచగ్గహణేణ। సువ్వత్తం సో ఏత్థ ణిరణుకోసో సంపత్తో। త ణివ్వణ్ణఇస్సం। అహవా తహ పరంము హే జణే ఏవ్వం అహిముహీ హోమిత్తి జం సచ్చం అత్తణోవి అహం లజ్జిదమ్హి। తా ణ పేక్ఖిస్సం।*

(*కర్ణం దత్త్వా*) కో ను ఖల్వేష సజలజలదస్తనితగమ్భీరేణ స్వర-విశేషేణాత్యన్తదుఃఖభాజనమపి మే శరీరం రోమాఞ్చయతి। నిరూపయామి తావత్ క ఏష ఇతి। అథ వా న యుక్తం మమాజ్ఞాత్వా పరమార్థమస్థానే దృష్టిం విసర్జయితుమ్। కిమత్ర జ్ఞాతవ్యమ్? నావనాహయతి మే శరీరం పరపురుషశబ్దో రోమాఞ్చగ్రహణేన।

---

**సీత:** (*చెవి అప్పగించి*) ఎవరై ఉంటారు? మేఘగంభీరస్వరం. చాలా దుఃఖపూరితంగా ఉన్నా నా శరీరం రోమాంచితమవుతున్నది. చూస్తాను ఎవరో. అయినా తెలియకుండా, చూడగూడని చోట చూడటం యుక్తం కాదు. తెలుకోవలసిందేముంది కనుక? నా శరీరం పరపురుషుని మాట విన్నందువల్ల రోమాంచం కాదు.

సువ్యక్తం సోఽత్ర నిరనుక్రోశః సమ్ప్రాప్తః। తన్నిర్వర్ణయామి। అథ వా తథా పరాఙ్ముఖే జనే ఏవమభిముఖీభవామీతి యత్సత్యమాత్మనోఽప్యహం లజ్జితాస్మి। తన్న ప్రేక్షిష్యే।

(*పరాఙ్ముఖీ భూత్వా*) *కహం ణ ప్పహవామి అత్తాణఅస్స, అవంజిఅది మే బలక్కారేణ తహి ఏవ్వ దిట్ఠీ। కిం అవరం కరేమి అత్తాణఅస్స రాఅపరాహీణదాఏ ణిఓఓ।*

(*నిర్వర్ణయతి*) *అంహో దిఠ్ఠోత్తి పరిదోసో, చిరప్పవాసోత్తి మంణూ, పరిక్ఖామోత్తి ఉవ్వేఓ, ణిరణుకోసోత్తి అహిమాణో, చిరపరిచిదోత్తి అణురాఓ, దస్సణీఓత్తి ఉక్కణ్ఠా, సామిత్తి బహుమాణో, కుసలవాణం తాదోత్తి కుడుంబిణీసబ్భావో అవరాహం పవిసిదంహిత్తి లజ్జా, ణ జాణామి అంఅఉత్తదంసణేణ కీదిస అవత్థం అణుభవామిత్తి।*

(*పరాఙ్ముఖీ భూత్వా*) కథం న ప్రభవామ్యాత్మనః, ఆవర్జ్యతే మే బలాత్కారేణ తత్రైవ దృష్టిః। కిమపరం కరోమి ఆత్మనో రాజపరాధీనతాయా నియోగః।

---

ఆహాఁ, తెలిసింది. నిశ్చయంగా ఆ నిర్దయుడే వచ్చాడు. పరికించి చూస్తాను. నేనంటే ఇష్టపడని వ్యక్తికి ఎదురుపడటమంటే సిగ్గుగా ఉంటుంది. అందుకే చూడను.

(*ముఖము తిప్పుకొని*) నన్ను నేను ఎందుకు నియంత్రించుకోలేక-పోతున్నాను? నా దృష్టి బలవంతంగా అటే పోతున్నది. ఇంకేమీ చేయలేకుండా ఉన్నాను. మహారాజు పట్ల నా విధేయత నన్ను శాసిస్తున్నది.

(*నిర్వర్ణయతి*) అహో దృష్ట ఇతి పరితోషః, చిరప్రవాస ఇతి మన్యుః, పరిక్షామ ఇత్యుద్వేగః, నిరనుక్రోశ ఇత్యభిమానః, చిరపరిచిత ఇత్యనురాగః, దర్శనీయ ఇత్యుత్కణ్ఠా, స్వామీతి బహుమానః, కుశలవయోస్తాత ఇతికుటుమ్బినీసద్భావః అపరాధం ప్రవేశితాస్మీతి లజ్జా, న జానామి ఆర్యపుత్రదర్శనేన కీదృశీమవస్థామనుభవామీతి।

**లక్ష్మణః:** కిమర్థమార్యో మామకస్మాదేవామన్త్ర్య బాష్పాయమాన-నయనస్తూష్ణీమధోముఖః సంవృత్తః?

**రామః:** నిఃసమ్పాతవివిక్తమిదమరణ్యం తటరుహతరుచ్ఛాయా-సమాకీర్ణరమణీయసైకతాం ప్రసన్నసలిలవాహినీం సముద్రగామినీఞ్చావ-లోకయన్ సంస్మృత్య దణ్డకావనవాసమేవం వైక్లబ్యమనుప్రాప్తోఽస్మి।

---

(*పరకాయించి చూస్తుంది*) ఆశ్చర్యం! ఈయనను చూస్తే సంతోషం కలుగుతున్నది. నన్ను త్యజించి ఇంతకాలం వనవాసం విధించాడని కోపం వస్తున్నది. చాలా చిక్కి పోయాడు. చూస్తే దుఃఖం కలుగుతున్నది. నిర్దయుడని బాధ. చిరపరిచయం వల్ల ప్రేమ. చూడదగినవాడని ఉత్కంఠ. స్వామి అని ఆదరం. కుశలవులకు తండ్రి అని గృహిణీభావం. నేరారోపణకు గురైనానని సిగ్గు. ఆర్యపుత్రుల దర్శనం వల్ల నా స్థితి ఏమిటో నాకే అర్థం కావటంలేదు.

**లక్ష్మణుడు:** నన్ను సంబోధించిన తరువాత ఆర్యులు ఉన్నట్లుండి కన్నీరు పెట్టుకుని, మొగం వంచుకొని కూర్చున్నారెందుకు?

**రాముడు:** జనసంచారం లేని అరణ్యం, చెట్లనీడలలో అందమైన –

**సీతా:** *అంఅఉత్త సుమరసి వణవాసం ణ ఉణ వణవాసిణం జణం।*

ఆర్యపుత్ర! స్మరసి వనవాసం న పునర్వనవాసినం జనమ్।

**లక్ష్మణః:** కిం తత్ర దుఃఖైకవాసే వనవాసే స్మర్తవ్యమితి।

**రామః:** వత్స లక్ష్మణ! కిమేవం బ్రవీషి – దుఃఖైకవాసే వనవాసే స్మర్తవ్యమితి। పశ్య పశ్య –

కిసలయసుకుమారం పాణిమాలమ్బ్య దేవ్యా
వివిధరతిసఖీభిః సఙ్కథాభిర్దినాన్తే।

---

ఇసుక తిన్నెలు, నిర్మలంగా సముద్రంలో కలవడానికి ప్రవహిస్తున్న నదీ – ఇవన్నీ దండకారణ్యవాసదినాలను జ్ఞాపకం తెస్తున్నాయి. వ్యాకులపరుస్తున్నాయి.

**సీత:** ఆర్యపుత్రా! వనవాసాన్ని జ్ఞాపకం తెచ్చుకుంటున్నారు మీరు, మళ్ళీ వనవాసినిని అయిన దానిని కాదు.

**లక్ష్మణుడు:** ఎందుకు దుఃఖభాజనమైన వనవాసాన్ని స్మరిస్తారు?

**రాముడు:** వత్సా లక్ష్మణా! ఎందుకలా అంటావు, దుఃఖభాజనమైన వనవాసాన్ని ఎందుకు స్మరిస్తావని? చూడు చూడు.

సాయం సమయాలలో, లేత చివురు వలె సుకుమారమైన తన చేతిని పట్టుకొని, ప్రణయసల్లాపాలను కొనసాగిస్తూ, మా పాదాల క్రింద ఇసుక

చరణగమనవేగాన్మన్థరస్య స్మరామి
స్రుతపయసి తటిన్యాః సైకతే చఙ్క్రమస్య ॥12॥

**సీతా:** *అయి ణిరణుక్కోస! కిం ఏదిణా సంలావత్థాణేణ అసరణం దుఃఖిదం జణం అహిఅదరం బాధేసి।*

అయి నిరనుక్రోశ! కిమేతేన సంలాపస్థానేనాశరణం దుఃఖితం జనమధికతరం బాధసే।

**లక్ష్మణః:** ఆర్య, అలం శోకేన।

**రామః:** కథం న శోచామి మన్దభాగ్యః? పశ్య పశ్య –

పూర్వం వనప్రవాసః పశ్చాల్లఙ్కా తతః ప్రవాసోఽయమ్।
ఆసాద్య మామధన్యం దుఃఖాద్ దుఃఖం గతా సీతా ॥13॥

---

నుంచి నీళ్ళు ఊరుతూ ఉండగా నెమ్మదిగా నదీతీరం వెంట నడుస్తూ ఉండటం గుర్తుకు వస్తున్నది.

**సీత:** నిర్దయుడా! ఎందుకు అవన్నీ జ్ఞాపకం చేసి అసహాయను, దుఃఖమనుభవిస్తున్న అభాగినిని ఇంకా దుఃఖపెడతావు?

**లక్ష్మణుడు:** ఆర్యా! మిమ్మల్ని వేడుకుంటున్నాను, శోకించవద్దు.

**రాముడు:** శోకించకుండా ఎలా ఉండగలను లక్ష్మణా! మందభాగ్యుణ్ణి. చూడు.

ముందు వనవాసం. ఆ తరువాత లంకావాసం. మళ్ళీ ఇప్పుడీ వనవాసం. నన్ను ఈ అభాగ్యుణ్ణి కట్టుకొని సీత మరీ దుఃఖిస్తుంది.

**సీతా:** *అంఅఉత్త! ణివ్వాసిదాఏ అసదిసం।*

ఆర్యపుత్ర! నిర్వాసితాయా అసదృశమ్।

**రామః:** హా జనకరాజపుత్రి!

**సీతా:** *అప్పపుణ్ణభాఇణీఏ వజ్జణీఅ!*

అల్పపుణ్యభాగిన్యా వర్జనీయ!

**రామః:** హా! వనవాససహాయిని!

**సీతా:** *అవి ఏదం ణ సంపదం।*

అప్యేతన్న సామ్ప్రతమ్।

**రామః:** హా! క్వ గతాసి?

---

**సీత:** ఆర్యపుత్రా! పరిత్యక్త కోసం ఇలా దుఃఖించడం తగదు.

**రాముడు:** హా జనకరాజపుత్రీ!

**సీత:** అల్పపుణ్యం చేసుకున్న దానిని. విడిచిపెట్టదగినదానిని.

**రాముడు:** అయ్యో, వనవాసకాలసహచరీ!

**సీత:** ఇప్పుడు కాదు కదా.

**రాముడు:** అయ్యో! ఎక్కడికి వెళ్ళావు?

**సీతా:** *జహి మందభాఆ గచ్ఛది।*

యత్ర మన్దభాగ్యా గచ్ఛతి।

**రామః:** దేహి మే ప్రతివచనమ్।

**సీతా:** *అసంభావణీఏ జణే కీదిసం పడివఅణం?*

అసమ్భావనీయే జనే కీదృశం ప్రతివచనమ్?

***రామః:*** (*శోకం నాటయతి*)

**లక్ష్మణః:** ఆర్య, నను విజ్ఞాపయామి– అలం శోకేనేతి.

**రామః:** కథం న శోచామి శోచనీయాం వైదేహీం?

**సీతా:** *అంఅఉత్త, మా ఏవం భణ సోఅణీఆ వైదేహిత్తి। సోఅణిజ్జో జో ఏవ్వం వల్ల హేణ సోఈఅది।*

---

**సీత:** మందభాగ్యురాలు చేరదగినచోటికి.

**రాముడు:** నాకు సమాధానం చెప్పు.

**సీత:** సమీపించేందుకే అర్హత లేనిది ఏమి సమాధానమిస్తుంది?

**రాముడు:** (*దుఃఖిస్తాడు*)

**లక్ష్మణుడు:** ఆర్యా! ప్రార్థిస్తున్నాను. దుఃఖించవద్దు.

**రాముడు:** దయనీయ అయిన వైదేహి కోసం ఎలా దుఃఖించకుండా ఉండగలను లక్ష్మణా?

ఆర్యపుత్ర! మైవం భణ – శోచనీయా వైదేహీతి। శోచనీయః, య ఏవం వల్లభేన శోచ్యతే।

**రామః:** వత్స లక్ష్మణ! కిం శక్యతే జ్ఞాతుం క్వ వర్తత ఇతి?

**సీతా:** దిఅసాఅవసాణవిణివారిదపిఅసమాఅమా విఅ చక్కవాఈ ఇదో ఏవ్వ పవాసే వట్టామిత్తి।

దివసావసానవినివారితప్రియసమాగమేవ చక్రవాకీ ఇహైవ ప్రవాసే వర్తతే ఇతి।

**లక్ష్మణః:** న శక్యతే క్వ వర్తత ఇతి జ్ఞాతుమ్।

**రామః:** ఉత్పాదితం మయా చిరకాలావిచ్ఛిన్నం రఘుకులమ్। (*ఇతి రోదితి*)

---

**సీత:** ఆర్యపుత్రా! అలా అనవద్దు. భర్తను ఏడిపించే దానికోసం శోకం తగదు.

**రాముడు:** నాయనా లక్ష్మణా! సీత జాడ తెలుసుకోగలమా?

**సీత:** దివసావసానసమయంలో సంగమం నిషేధించబడిన చక్రవాకపక్షిలా ఇక్కడే వనవాసంలో ఉన్నాను.

**లక్ష్మణుడు:** ఎక్కడున్నదో తెలుసుకోవడం సాధ్యం కాదు.

**రాముడు:** చిరకాలం నుండి వర్ధిల్లుతున్న రఘువంశాన్ని విచ్ఛిన్నం చేశాను నేను. (*రోదిస్తాడు*)

**సీతా:** (*సశోకమ్*) అదిమత్తం సంతవది అంఅఉత్తో, కిం కరేమి। సాహసాదో తిమిదదంసణం పమజ్జామి అస్సుచలం । (*పదముత్క్షిప్య*) అహవా జణప్పవాదో రక్ఖిదవ్వో। అంఅఉత్తేణ జావ న పేక్ఖామి దావ సోఆవేఅబలక్కారిదా ణ ప్పహవామి అప్పాణఅస్స। మునిజణసంపాద-సముఇదో ఏసో ఉద్దేసో। అదో జఇచ్ఛాగదో కో వి మం పేక్ఖిస్సది। తా ఏదిణా లదాజాలపచ్ఛణ్ణసుహసంచారేణ మగ్గేణ అస్సమం గదుఅ కుసలవా సంభావఇస్సం ।

(*సశోకమ్*) అతిమాత్రం సన్తపత్యార్యపుత్రః, కిం కరోమి। సాహసతః స్తిమితదర్శనం ప్రమార్జయామ్యశ్రుసఞ్చయమ్। (*పదముత్క్షిప్య*) అథ వా జనప్రవాదో రక్షితవ్యః। అర్యపుత్రేణ యావన్నప్రేక్ష్యే తావచ్ఛోకావేగ-బలాత్కారితా న ప్రభవామ్యాత్మనః। మునిజనసమ్పాతసముచితోఽ-యముద్దేశః, అతో యదృచ్ఛాగతః కోఽపి మాం ప్రేక్షిష్యతే, తదేతేన

---

**సీత:** (*దుఃఖిస్తూ*) ఆర్యపుత్రులు చాలా దుఃఖిస్తున్నారు. ఏం చెయ్యగలను? ధైర్యంచేసి, చక్కగా దర్శించడానికి తన కళ్ళకు అడ్డంపడుతున్న కన్నీటిని తుడుస్తాను.

(*అడుగు ముందుకేసి*) కాదు. లోకాపవాదభయం ఉంది. ఆయన చూసేలోపలే తప్పుకుంటాను. శోకావేగంచేత నన్ను నేను ఆపుకోలేక-పోతున్నాను. ఇది మునులు తిరిగే స్థానం. వాళ్ళేవరైనా నన్ను చూడవచ్చు. అందువల్ల ఈ లతల పొదల మాటునుండి దారిచేసుకుని వెళ్ళి ఆశ్రమానికి

లతాజాలప్రచ్ఛన్నసుఖసఞ్చారేణ మార్గేణాశ్రమం గత్వా కుశలవౌ సమ్భావయామి। (*నాట్యేనావలోకయన్తీ నిష్క్రాన్తా*)

(*తతః ప్రవిశతి ఋషిః*)

**ఋషిః:** ఆదిష్టోస్మి భగవతా వాల్మీకినా – వత్స బాదరాయణ! శ్రుతం మయా లక్ష్మణసహాయో రామభద్రస్తపోవనమిదమనుప్రాప్త ఇతి । స కదాచిన్మాధ్యాహ్నికకార్యసమ్పాదనవ్యగ్రానస్మాన్మన్యమానో బహిరవస్థితో భవేత్ । తస్మాత్త్వమేనముపక్రమ్య పరిసమాప్తమాధ్యాహ్నికకార్యం దర్శనమాకాఙ్క్షమాణం మామావేదయ – ఇతి। తద్యావదహమపి భగవతో వాల్మీకేరాదేశాద్రామమేవాన్వేషయామి। (*పరిక్రామతి*)

---

చేరి లవకుశులను లాలిస్తాను. (*తొంగి తొంగి చూసుకుంటూ వెళ్ళిపోతుంది*)

(*ఇంతలో ఒక ఋషి ప్రవేశిస్తాడు*)

**ఋషి:** వాల్మీకి భగవానులు నన్ను ఈ విధంగా ఆదేశించారు – "వత్సా! బాదరాయణా! లక్ష్మణసమేతుడై రాముడు తపోవనానికి చేరాడని విన్నాను. నేను మాధ్యాహ్నికవిధులలో నిమగ్నమై ఉంటానని భావించి దూరంగా ఉండి ఉంటాడు. అందువల్ల నువ్వు అతడిదగ్గరకు వెళ్ళి, నేను మాధ్యాహ్నికకార్యాలు ముగించుకున్నాననీ, వాళ్ళను చూడాలనుకుంటున్నాననీ తెలియజేయి". ఆయన ఆజ్ఞానుసారం రాముడు ఎక్కడున్నాడో వెదుకుతాను. (*ముందుకు వస్తాడు*)

**లక్ష్మణః:** (*విలోక్య ససమ్భ్రమమ్*) ఆర్య! తపోధనోఽయమిత ఏవాభివర్తతే।

(*రామో ఽశ్రూణి ప్రమృజ్య కృతధైర్యః స్థితః*)

**ఋషిః:** (*నిర్వర్ణ్య*) అయే! లతాగుల్మప్రచ్ఛాయేఽస్మిన్ పురుష-యుగలమివ। అపి నామ లక్ష్మణసహాయో రామో భవేత్। (*పరిచిన్త్య*) కస్తత్ర సన్దేహః –

> మన్దం వాతి సమీరణో న పరుషో భానో నిదాఘార్చిషో
> న త్రస్యన్తి చరన్త్యశఙ్కమధునా మృగ్యోఽపి సింహైః సహ।
> మధ్యాహ్నేపి న యాతి గుల్మనికటం ఛాయా తదధ్యాసితా
> వ్యక్తం సోఽయముపాగతో వనమిదం రామాభిధానో హరిః ॥14॥

---

**లక్ష్మణుడు:** (*చూసి సంభ్రమంగా*) ఆర్యా! తపోధనులు ఇటే వస్తున్నారు.

(రాముడు అశ్రువులు తుడుచుకుని, ధైర్యంగా ఉంటాడు)

**ఋషి:** (*పరీక్షగా చూసి*) అరె! ఈ తీగల గుబురు నీడలో ఇద్దరు పురుషులు ఉన్నారు. లక్ష్మణసమేతుడైన రాముడే అయి ఉండాలి.

(*కాస్త ఆలోచించి*) గాలి మెల్లగా వీస్తున్నది. గ్రీష్మంలో కూడా సూర్య-కిరణాలలో తీక్ష్ణత లేదు. లేళ్ళు కూడా నిర్భయంగా సింహాలతో కలిసి తిరుగుతున్నాయి. మధ్యాహ్నమైనా కూడా వాళ్ళున్నచోట నీడ తగ్గటం

న కేవలమతిక్రాన్తమానుషేణ ప్రభావేణ, ఆకారేణాపి శక్యత ఏవ నిశ్చేతుమ్। (*నిర్వర్ణ్య*)

> వ్యాయామకఠినః ప్రాంశుః కర్ణాన్తాయతలోచనః।
> వ్యూఢోరస్కో మహాబాహుర్వ్యక్తం దశరథాత్మజః ॥15॥

తదేనముపగమ్య యథావస్థితమావేదయామి। (*ఉపాగమ్య*) రాజన్, స్వస్తి।

**రామః:** అభివాదయే।

**ఋషిః:** విజయీ భవ।

---

లేదు. నిశ్చయంగా రాముడి రూపంలో ఉన్న శ్రీమన్నారాయణుడే ఈ అరణ్యానికి వచ్చాడు.

మానవాతీతమైన ప్రభావమొక్కటే కాదు. ఆకారాన్ని చూసి కూడా నిర్ధారించుకోవచ్చును. (*పరీక్షగా చూసి*)

వ్యాయామకఠినదేహం, ఆకర్ణాంతలోచనాలు, ఉన్నతవిశాల వక్షం, ఆజానుబాహువులు ఈయన దాశరథి అనే స్పష్టం చేస్తున్నాయి.

వారిని సమీపించి వాల్మీకిభగవానుల సందేశాన్ని వినిపిస్తాను. (*సమీపించి*) రాజా, స్వస్తి!

**రాముడు:** అభివాదము.

**ఋషి:** జయమగు గాక!

**రామః:** కిమాగమనప్రయోజనమార్యస్య?

**ఋషిః:** పరిసమాప్తసకలకర్మా భగవాన్వాల్మీకిర్మహారాజస్యాగమన-ముద్వీక్షమాణస్తిష్ఠతి।

**రామః:** (*విలోక్య*) అయే! అతిక్రాన్తో మధ్యాహ్నః। తథాహి –

ప్రవిశ్య తరుమూలాని నీత్వా మధ్యన్దినాతపమ్।
అధ్వనీనా ఇవ ఛాయా నిర్గచ్ఛన్తి శనైః శనైః ॥16॥

అపి చ –

మధ్యాహ్నార్కమయూఖతాపమధికం తోయావగాహోదయం
నీత్వా వారికణార్ద్రకర్ణపవనైరాహ్లాద్యమానాననః।

---

**రాముడు:** ఆర్యులు దేనికోసమని విచ్చేసారు?

**ఋషి:** తమ కర్మలన్నింటినీ ముగించుకొని వాల్మీకిభగవానులు మహారాజు యొక్క రాకకై ఎదురుచూస్తున్నారు.

**రాముడు:** (చుట్టూ చూసి) అరె! మధ్యాహ్న సమయం దాటిపోయింది. మధ్యాహ్నపుటెండలో తరుమూలానికి వచ్చి సేదదీరి మళ్ళీ బయలుదేరిన బాటసారిలా నీడలు బయటకు వస్తున్నాయి.

అంతే కాదు –

తొండంతో చరుస్తూ నీటిసుడులను సృష్టిస్తూ, జలకణాలతోనున్న చెవులను అల్లాడించడం వల్ల వీచిన చల్లని గాలిచేత ఆహ్లాదాన్ని

మన్దం మన్దముపైతి కూలమధునా వక్షఃప్రణున్నైర్జలై–
రాక్రాన్తం కరఘాతఝూఙ్కృతిసరిత్కల్లోలచక్రః కరీ ॥14॥

(*ఇతి నిష్క్రాన్తాః సర్వే*)

---

అనుభవిస్తూ నీటిలోపల మధ్యాహ్నోష్ణసమయాన్ని గడిపిన ఈ ఏనుగు తన ఎదతో తోసుకువచ్చిన నీటితో గట్లను ముంచెత్తుతూ నెమ్మది నెమ్మదిగా బయటకు వస్తున్నది.

(*అందరూ నిష్క్రమిస్తారు*)

## చతుర్థోఽఙ్కః – నాలుగవ అంకము

(*తతః ప్రవిశతి తాపసీద్వయమ్*)

**ప్రథమా:** హలా జణ్ణవేది! రామాయణసఙ్గీతఅణిమిత్తం వంమీఇ-తపోవణం సంపత్తాఏ తిలుత్తమాఏ అహం ఏవ్వం భణిదా – అహం పహావణింమిదేన సీదారూవేణ రామస్స దంసణపహం ఓఅరిఅ రామో సీదాఏ ఉవరి సాణుకంపో ణ వేత్తి జాణిదుం ణు ఇచ్ఛామి! తా తుమం రామం అణ్ణేసహిత్తి। తా దంసేదు పియసహీ రామస్స విస్సమత్థాణమ్।

హలా యజ్ఞవేది! రామాయణసఙ్గీతకనిమిత్తం వాల్మీకితపోవనం సంప్రాప్తయా తిలోత్తమయాహమేవం భణితా – అహం ప్రభావనిర్మితేన సీతారూపేణ రామస్య దర్శనపథమవతీర్య రామః సీతాయా ఉపరి సానుకమ్పో నవేతి జ్ఞాతుం న్విచ్ఛామి। తత్త్వం రామమన్వేషయ ఇతి। తద్దర్శయతు ప్రియసఖి రామస్య విశ్రామస్థానమ్।

---

(*ఇద్దరు తపస్వినులు ప్రవేశిస్తారు*)

**తపస్విని 1:** హలా యజ్ఞవేదీ! రామాయణసంగీతప్రదర్శన కోసం వాల్మీకిభగవానుల తపోవనానికి చేరిన అప్సరస తిలోత్తమ తాను మాయాసీత రూపాన్ని ధరించి రాముడికి సీతమీద ప్రేమ, అనుకంప ఉన్నయ్యా, లేవా అని తెలుసుకోవాలనుకుంటున్నదట. నన్ను రాముడు ఎక్కడున్నాడో చూసి చెప్పమన్నది. అందువల్ల ఓ ప్రియసఖీ! నాకు రాముడు విశ్రమించిన ప్రదేశాన్ని చూపించు.

**యజ్ఞవేదీ:** హలా వేదవది! తిలుత్తమాఏ జదా ఏసో ఆలావో పవుత్తో తదా ఆసణ్ణగుమ్మలదాగహణపచ్ఛణ్ణత్థిదేణ రామవయస్సేణ అంఅహసిఏణ సవ్వం ఆఅణ్ణిదం।

హలా వేదవతి! తిలోత్తమయా యద్యేష ఆలాపః ప్రవృత్తస్తదాసన్న-గుల్మలతాగహనప్రచ్ఛన్నస్థితేన రామవయస్యేనార్యహసితేన సర్వ మాకర్ణితమ్।

**వేదవతీ:** అచ్చాహిదం ఖు ఆఅరిదం। జఇ గహిదసంకేఅస్స తస్స అగ్గదో తిలుత్తమా సీదాఏ చరిదాఇ అణువట్టిసదిత్తి తదో విపరీదో ఉవహాసో భవే। తా ఇమాదో పిఅసహిం తిలుత్తమం ణివారేమి।

అత్యాహితం ఖల్వాచరితమ్। యది గృహీతసఙ్కేతస్య తస్యాగ్రతస్తిలోత్తమా సీతాయాశ్చరితాన్యనువర్తిష్యత ఇతి తతో విపరీత ఉపహాసో భవేత్। తదస్మాత్ ప్రియసఖీం తిలోత్తమాం నివారయామి।

---

**యజ్ఞవేది:** హలా వేదవతీ! తిలోత్తమ ఇలా చెప్తున్నప్పుడు, రాముడి వయస్యుడు (విదూషకుడు) ఆర్యహసితుడు అక్కడ పూపొదలో చాటుగా ఉండి అంతా విన్నాడు.

**వేదవతి:** అయితే చాలా ప్రమాదమే! ఇప్పుడు తిలోత్తమ సీతరూపంలో వెళ్తే అపహాస్యం పాలవుతుంది. నేను వెళ్ళి తిలోత్తమను ఆపుతాను.

**యజ్ఞవేదీ:** సహి వేదవది! సీదా దాణిం కహిం?

సఖి వేదవతి! సీతేదానీం కుత్ర?

**వేదవతీ:** సుణాహి అజ్జ సత్తమే దివహే సంపాదిదాహి తపోవణ-
వాసిణీహి విణ్ణవిదో భఅవం వంమీఈ ఏసా ణూణం అస్సమదీహిఆ
పదుమాపచయాదిసు అత్తణో ఉపభోఏసు దాణిం మహారాఅస్స
సణ్ణిహాణేణ పరపురుసణఅణపరిఖిత్తా ణ సక్కా ఇత్థిఆజణేణ
ఓగాహిదుంతి। తదా భఅవదా వంమీఇణా ణిజ్ఝాణణిచ్చలణఅణేణ
ముహుత్తం ణిజ్ఝాఇఅ భణిదం – ఏదస్సిం దీహిఆఏ వట్టమాణో
ఇత్థిఆజణో పురుసణఅణాణం అగోఅరో భవిస్సదిత్తి। తతప్పుఉది సీదా
రామస్స దంసణపహం పరిహరంతీ దీహిఆతీరే సఅలం దివఅం
అదివాహేది ।

శృణు, అద్య సప్తమే దివసే సంపాతితాభిస్తపోవనవాసినీభిర్విజ్ఞాపితో
భగవాన్ వాల్మీకిః – ఏషా నూనమాశ్రమదీర్ఘికా పద్మాపచయాదిష్వాత్మన
ఉపభోగేష్విదానీం మహారాజస్య సన్నిధానేన పరపురుషనయనపరిక్షిప్తా న
శక్యా స్త్రీజనేనావగాహితుమ్ – ఇతి।

---

**యజ్ఞవేది:** సఖీ వేదవతీ! సీత ఇప్పుడు ఎక్కడున్నది?

**వేదవతి:** విను. ఈ రోజు ఆశ్రమవాసినులు వాల్మీకిభగవానులతో,
‘ఆశ్రమానికి దగ్గరున్న దిగుడు బావి పరిసరాల్లో రాముడి పరివారం
సంచరిస్తూ ఉంటారు, కనుక స్త్రీలు అక్కడ తామరపూలను కోయడానికి
వీలుకాదు.’ అని చెప్పారు.

తదా భగవతా వాల్మీకినా నిధ్యాననిశ్చలనయనేన ముహూర్తం నిధ్యాయ భణితం – ఏతస్యాం దీర్ఘికాయాం వర్తమానః స్త్రీజనః పురుషనయనానామగోచరోభవిష్యతి – ఇతి। తతః ప్రభృతి సీతా రామస్య దర్శనపథం పరిహరన్తీ దీర్ఘికాతీరే సకలం దివసమతివాహయతి।

**యజ్ఞవేదీ:** కిం జాణన్తి కుసలవా రామస్స అత్తణోఅ సంబంధం?

కిం జానీతః కుశలవౌ రామస్యాత్మనశ్చ సమ్బన్ధమ్?

**వేదవతీ:** అత్తణో బాలభావేణ ముణిజణస్స అ సంసగ్గేణ మాదరం వి ణామదో ణ జాణన్తి, కిం ఉణ దీహప్పవాసవిచ్ఛిణ్ణం రామస్స ఉత్తన్తమ్।

ఆత్మనో బాలభావేన మునిజనస్య చ సంసర్గేణ మాతరమపి నామతో న జానీతః, కిముత దీర్ఘప్రవాసవిచ్ఛిన్నం రామస్యవృత్తాన్తమ్।

---

అప్పుడాయన కనులను నిశ్చలంగా నిలిపి ధ్యానించి, చెప్పారు – 'ఆ బావి దగ్గర ఉన్న ఏ స్త్రీ అయినా పురుషులకు కనుపించదు.' అని. అప్పటినుండి సీత రాముడి దృష్టిలో పడకుండా ఉండటానికి రోజంతా ఆ బావి గట్టుపైనే గడుపుతున్నది.

**యజ్ఞవేది:** కుశలవులకు రాముడెవరో తెలుసా?

**వేదవతి:** పసివాళ్ళు కదా, పైగా మునిజనసాంగత్యం! వాళ్ళకు తమ తల్లి పేరే తెలీదు. ఇక ఎక్కడో దూరంగా ఉన్న రాముడి గురించి తెలుస్తుందా?

**యజ్ఞవేదీ:** కిం జాణ్ణాసి రామో ఏత్థ తపోవణం పవిసదిత్తి?

కిం జానాసి రామోऽత్ర తపోవనం ప్రావిశదితి?

**వేదవతీ:** *కుదో తస్స ఆఅమో?*

కుతస్తస్యాగమః?

**యజ్ఞవేదీ:** *గచ్ఛ తుమం తిలుత్తమాఏ సఆసం, అహం అ సీదాఏ పస్సపరివట్టిణీ హోమి।*

గచ్ఛ త్వం తిలోత్తమాసకాశమ్, అహం చ సీతాయాః పార్శ్వపరివర్తినీ భవామి। (*ఇతి నిష్క్రాన్తే*)

**ఇతి ప్రవేశకః**

---

**యజ్ఞవేది:** రాముడు తపోవనం ప్రవేశించాడని నీకు తెలుసా?

**వేదవతి:** ఎక్కడ నుండి ఆయన రాక?

**యజ్ఞవేది:** నువ్వు తిలోత్తమ దగ్గరకు వెళ్ళు. నేను సీత దగ్గరకు పోతాను. (*ఇద్దరూ నిష్క్రమిస్తారు*)

**ప్రవేశకము సమాప్తము**

*(తతః ప్రవిశత్యుత్తరీయకృతప్రావరణా సీతా యజ్ఞవేదీ చ)*

**యజ్ఞవేదీ:** *సహి వైదేహి, కేణ తుహ ఉవదిట్టం అపువ్వం ఉత్తరీఅ-జుఅలధారణం?*

సఖి వైదేహి, కేన తవోపదిష్టమపూర్వముత్తరీయయుగలధారణమ్?

**సీతా:** *అచ్చన్తసీఅలేణ తరఙ్గవాహిణా దీహేణ దీహిఆమారుదేణ।*

అత్యన్తశీతలేన తరఙ్గవాహిణా దీర్ఘేణ దీర్ఘికామారుతేన।

**యజ్ఞవేదీ:** *సహి, పవాసవిరుద్ధం ఖు ఏదం సారదచందకిరణరాసి-పరిపండురం సురహిబహులామోదసమారద్ధమహుఅరఉలసంగీద-మణహరం ఏదం పావరణం।*

సఖి, ప్రవాసవిరుద్ధం ఖల్వేతచ్ఛారదచన్ద్రకిరణరాశిపరిపాణ్డురం సురభిబహులామోదసమారబ్ధమధుకరకులసఙ్గీతమనోహరమేత-త్ప్రావరణమ్।

---

*(ఉత్తరీయాన్ని ధరించిన సీత, యజ్ఞవేది ప్రవేశిస్తారు)*

**యజ్ఞవేది:** సఖీ! రెండు ఉత్తరీయాలను ధరించమని ఎవరు చెప్పారు?

**సీత:** ఈ నడబావి మీదనుండి వచ్చే చల్లని గాలి.

**యజ్ఞవేది:** సఖీ! శరత్కాలపు వెన్నెలవలె తెల్లనైనవి, సుగంధాలను వెదజల్లుతూ ఝుంకారాలు చేసే తుమ్మెదలను ఆకర్షించేవీ అయిన ఉత్తరీయాలను ధరించటం ప్రవాస విరుద్ధం కాదా?

**సీతా:** *సహి, జదా అహం మహారాఅసాసణేణ వణప్పవాసే పరిచ్చత్తా చిత్తఊటం పరిచ్చఇఅ దక్ఖిణపహం పత్థిదా తదా చిరణివాససముప్పణ్ణ-సహిసిణేహాఏ చిన్తాఉలాఏ వణదేవదాఏ మాయావఈఏ సుమరణ-ణిమిత్తం చందధవలం వాసిదసుఅంధం అత్తణో దివ్వం ఉత్తరీఅఅం మమ పణీదం। తం అంఅఉత్తస్స మమ వి హత్థే అచ్చన్తసహీభూదం చిరదుఃఖ-సహాయంత్తి ఏత్థ అత్తాఇం సాఅరం ధారిదం।* (*ఇతి రోదితి*)

సఖి, యదాహం మహారాజశాసనేన వనప్రవాసే పరిత్యక్తా చిత్రకూటం పరిత్యజ్య దక్షిణాపథం ప్రస్థితా తదా చిరనివాససముత్పన్నసఖీస్నేహయా చిన్తాకులయా వనదేవతయా మాయావత్యా స్మరణనిమిత్తం చన్ద్రధవలం వాసితసుగన్ధమాత్మనో దివ్యముత్తరీయకం మమ ప్రణీతమ్। తదార్యపుత్రస్య మమాపి హస్తేఽత్యన్తసఖీభూతం చిరదుఃఖసహాయ-మిత్యత్రాత్మనా సాదరం ధారితమ్। (*ఇతి రోదితి*)

---

**సీత:** సఖీ! మేము మహారాజు ఆజ్ఞతో వనవాసం చేస్తూ చిత్రకూటంలో చాలాకాలంగా ఉంటున్నప్పుడు మాకు మిత్రురాలైన వనదేవత మాయావతి, మేము ఆ ప్రాంతాన్ని వదిలి దక్షిణానికి వెళ్ళేటప్పుడు, చింతాక్రాంతురాలై తన జ్ఞాపకార్థం ఇచ్చినదీ చంద్రుడిలాంటి తెల్లని, సుగంధపరిమళాలు వెదజల్లే దివ్యోత్తరీయం. ఇది ఆర్యపుత్రులకూ నాకూ అత్యంతసుఖదాయకమైనది. దుఃఖంలో ఓదార్పుగా, మైత్రికి గుర్తుగా దీనిని ధరించాను. (*ఏడుస్తుంది*)

**యజ్ఞవేదీ:** *సహి, మా రోదీ, ణహి ఏసో తపోవణవాసో వణవాసోత్తి పుచ్చిఅది।*

సఖి, మా రోదీః, నహ్యేష తపోవనవాసో వనవాస ఇతి ప్రోచ్యతే।

**సీతా:** *కహం ణ రోఇస్సం? కహం ఏదం తపోవణం ఆఅదో అంఅఉత్తోత్తి దిఉణం విద్ధారం ఆస సంఅణం పత్థరేమి। ఏఆఇణీ దీహ-ణీసాసేహి రత్తిందివం అదివాహేమి। తా బలియం ఖు ఆవేఅకారణం।*

కథం న రోదిష్యామి? కథమేతత్తపోవనమాగత ఆర్యపుత్ర ఇతి ద్విగుణః, ... ధారయామి। ఏకాకినీ దీర్ఘనిఃశ్వాసై రాత్రిన్దివమతి-వాహయామి। తద్బలవత్ ఖలు ఆవేగకారణమ్।

**యజ్ఞవేదీ:** *ఆలక్ఖణీఆఇ ఏదాణి కదణాణి। తుమం ఏతస్సిం దీహిఆ-తీరవిహంగమమిహుణవిభమం అవలోఅన్తీ అత్తాణం విణోదేహి। అహం వి అత్తణో ణిఓఅ అణుచిట్ఠామి।* (పరిక్రామతి)

---

**యజ్ఞవేదీ:** సఖీ! దుఃఖించకు. ఇది తపోవనవాసమే కాని వనవాసం కాదు.

**సీత:** ఎలా దుఃఖించకుండా ఉండగలను? ఆర్యపుత్రులు ఈ తపోవనానికి వచ్చారు. దీనివల్ల ఆశ రెండింతలయింది. ఏకాకినిగా దీర్ఘమైన నిట్టూర్పులు విడుస్తూ అహర్నిశలూ కాలం వెళ్ళదీస్తున్నాను. దుఃఖం ఉంటుంది కదా?!

ఆలక్షణీయాని ఏతాని కథనాని। త్వమేతస్మిన్ దీర్ఘికా తీరే విహఙ్గమ-మిథునవిభ్రమమవలోకయన్త్యాత్మానం వినోదయ, అహమప్యాత్మనో నియోగమనుతిష్ఠామి। (*పరిక్రామతి*)

**సీతా:** (*దీర్ఘికామాలోక్య*) *అఇధణ్ణం ఖు ఏదం రాఅహంసమిహుణం ఏవం అణాసాదిఅవిరహం సమాఅమసుహం అణుహోదిత్తి। ణత్థి దంపఈణం మమ విరహసమో ఉవదేసణిఉణో ఉవజ్ఝాయో, జేణ పక్ఖిణో వి అణ్ణోణ్ణహిఅఅగ్గహణసమత్థలలిఅమహురా చాడుప్పఓఅం పత్థావయన్తి।*

(*దీర్ఘికామాలోక్య*) అతిధన్యం ఖల్వేతద్రాజహంసమిథునమేవమ-నాసాదితవిరహం సమాగమసుఖమనుభవతీతి। నాస్తి దమ్పత్యోర్మమ విరహసమ ఉపదేశనిపుణ ఉపాధ్యాయః, యేన పక్షిణోపి అన్యోన్య-హృదయగ్రహణసమర్థలలితమధురాశ్చాటుప్రయోగం ప్రస్థాపయన్తి।

---

**యజ్ఞవేది:** సీతా! నువ్వీ దుఃఖాన్ని లక్ష్యపెట్టకూడదు. ఈ బావి గట్టుమీద కూర్చుని పక్షిమిథునాలను చూస్తూ ఆనందించు. నేను నా పనిమీద వెళ్తున్నాను. (*బయలుదేరబోతుంది*)

**సీత:** ఈ రాజహంసమిథునాలు ఎంత ధన్యములో, ఇలా విరహబాధ లేకుండా సుఖానుభవాన్ని పొందడానికి! నేను అనుభవిస్తున్నటువంటి విరహవ్యథను మించి దంపతులకు శిక్షణ లేదు. అందుకే కాబోలు – పక్షులు సైతం అన్యోన్యహృదయావగాహనతో, తీయనైన వలపు మాటలు మాట్లాడుకుంటున్నట్లు నాకు అనిపిస్తున్నది.

**యజ్ఞవేదీ:** *(నిర్వర్ణ్య) జహ ఏసో ససంభమతక్కణవిముత్తాసణో పరిగ్గహాఅంసదేస సముక్ఖిత్తవక్కలో సుఅసంఅమణపాఢధో విమయో-ఫుల్లలోఅణో సవ్వో జేవ (ఏవ్వ) ముణిఅణో ఏఅముఖఓ అపసరిదో తహ జాణామి సంపత్తేణ మహారాఏణ హోదవంది।* (*ఇతి నిష్క్రాన్తా*)

(*నిర్వర్ణ్య*) యథైష ససమ్భ్రమతత్క్షణవిముక్తాసనః పరిగ్రహాంసదేశ సముత్క్షిప్తవల్కలః... ... విస్మయోత్ఫుల్లలోచనః సర్వ ఏవ ... ... మునిజనః ఏకముఖకః అపసృతస్తథా జానామి సమ్ప్రాప్తేన మహారాజేన భవితవ్యమితి। (*ఇతి నిష్క్రాన్తా*)

(*తతః ప్రవిశతి రామః సచిన్తః కణ్వశ్చ*)

**కణ్వః:** ఆదిష్టోఽస్మి భగవతా వాల్మీకినా – కణ్వ. కణ్వ, దాశరథిం నైమిశారణ్యరామణీయకదర్శనేన వినోదయ ఇతి। ఏష పునశ్చిన్తా-

---

**యజ్ఞవేది:** స్త్రీలూ, పురుషులూ సంభ్రమంగా లేచి వస్త్రాలను సరిచేసుకొని బయలుదేరి వెళ్తున్నారు. శ్రవణసుభగంగా వేదపఠనం చేస్తూ, వికసించిన నేత్రాలతో మునిజనాలు గుంపులు గుంపులుగా కదులుతున్నారు. ఇదంతా చూస్తుంటే మహారాజు శ్రీరాముడు వచ్చేసినట్లున్నాడు. (*నిష్క్రమిస్తుంది*)

(*చింతాకులుడై ఉన్న రాముడు ప్రవేశిస్తాడు, అతని వెంట కణ్వుడు*)

**కణ్వుడు:** "కణ్వా, రాముడికి తోడుగా ఉండి నైమిశారణ్యపు అందాలు చూపించి రాముడిని వినోదింపజేయి" అని వాల్మీకిభగవానులు నన్ను

పరాధీనత్వాత్పురోగామినమపి మాం నావగచ్ఛతి। తథాహి –

> స్ఖలతి ముహురయం సమేపి మార్గే
> నిభృతగతిః ప్రవిలమ్బతే విదూరాత్।
> అవనతవదనో నితాన్తరమ్యే
> న చ నయనే నిదధాతి కాననేఽస్మిన్ ॥1॥

(*ఉపసృత్య*) భో రాజన్!

**రామః:** హన్త, వయస్య, తాపసవిరుద్ధమామన్త్రణమ్। అథ వా వయసః పరిణామేనేదమపరాద్ధం న భగవతా।

> అహం రామస్తవాభూవం త్వం మే కణ్వశ్చ శైశవే।
> యూయమార్యా వయశ్చాద్య రాజానో వయసా కృతాః ॥2॥

---

ఆదేశించారు. ఈయనేమో చింతకు లోనై తన ముందు నడుస్తున్న నన్ను సైతం గమనించేలా లేడు.

సమప్రదేశంలో నడుస్తూ కూడా తడబడుతున్నాడు. నెమ్మదిగా నడుస్తూ ఉన్నందున బాగా వెనకబడిపోయాడు. తల దించుకొని నడుస్తూ అత్యంతరమణీయమైన ఈ అడవిని ఓరకంటనైనా చూడటం లేదు.

(*దగ్గరగా వెళ్ళి పిలుస్తాడు*) హే రాజా!

**రాముడు:** అయ్యో! వయస్యా! తాపసవిరుద్ధంగా సంబోధిస్తున్నావు. వయస్సు పెరగడంవల్ల అయి ఉంటుందే కానీ, అది నీ దోషం కాదు.

**కణ్వః:** అహో ధీరోదాత్తోఽయముపాలమ్భః।

**రామః:** ఉచ్యతాం యద్వివక్షితమ్।

**కణ్వః:** సురభికుసుమగన్ధైర్వాసితాశాముఖానాం
ఫలభరనమితానాం పాదపానాం సహస్రైః
విరచితపరివేషశ్యామలోపాన్తరేఖో
రమయతి హృదయం తే హన్త కచ్చిద్వనాన్తః ॥3॥

**రామః:** బహుమాననిరన్తరీకృతమానసం మాం తపోవనమిదం రమయతి న రమయతీతి వచనావకాశ ఏవ నాస్తి। పశ్య –

దావాగ్నిం క్రతుహోమపావకధియా యూపాస్థయా పాదపాన్
అవ్యక్తం మునిగీతసామగతయా భక్త్యా శకున్తస్వనమ్।

---

బాల్యంనుండి నీకు నేను రాముడిని. నువ్వు నాకు కణ్వుడివి. ఇప్పుడు వయసు ముదరటం వల్ల నువ్వు ఆర్యుడవు, నేను రాజును అయ్యానా?

**కణ్వుడు:** ఎంత గంభీరమైన మందలింపు!

**రాముడు:** చెప్పదలచింది చెప్పవచ్చు.

**కణ్వుడు:** పుష్పసుగంధాలను దిశాంతాలవరకూ వ్యాపింపజేస్తూ, ఫలభారంతో వంగిపోయి ఉన్న వేనవేల వృక్షాలతో పచ్చని సీమావలయరేఖ గీసినట్లున్న ఈ వనశోభ నీ హృదయానికి ఆనందాన్ని కలిగించడం లేదా?

**రాముడు:** ఈ తపోవనం నన్ను ఆనందింపజేస్తున్నదా లేదా, అనే మాటకు అవకాశం లేదు. చూడు – ఈ వనంలోని దావాగ్నిని యాగాగ్నిలా,

వన్యాంస్తాపసగౌరవేణ హరిణాన్ సమ్భావయన్నైమిశే
సోహం యన్త్రణయా కథం కథమపి న్యస్యామి పాదౌ భువి ॥4॥

**కణ్వః:** యుక్తరూపోఽయం ధర్మైకపరాయణస్య మహారాజస్య సకలజగదభ్యుదయనిఃశ్రేయసహేతోర్నిష్ప్రత్యూహతపఃసిద్ధిక్షేత్రే పూర్వరాజర్షివంశాధ్యాసితే నైమిశే బహుమానః।

ఆనాకమేకధనుషా భువనం విజిత్య
పుణ్యైర్దివః క్రతుశతైర్విరచయ్య మార్గమ్।
ఇక్ష్వాకవః సుతనివేశితరాజ్యభారా
నిఃశ్రేయసాయ వనమేతదుపాశ్రయన్తే ॥5॥

---

ఈ వృక్షాలను యూపస్తంభాల వలె, పక్షుల కలకలరావాలు మునుల సామగానం వలె, ఈ అడవిలోని హరిణాలను తాపసుల వలె సంభావిస్తూ ఉన్న నేను ఎంతో సంకోచంతో, అతికష్టంగా నా పాదాలను ఈ నైమిశారణ్యభూమిపై మోపుతున్నాను.

**కణ్వుడు:** పూర్వులైన రాజర్షులందరూ తపస్సుచేసి సిద్ధిపొందిన నైమిశారణ్యక్షేత్రంపట్ల ధర్మైకపరాయణుడైన మహారాజు అభిప్రాయం ప్రశంసనీయం.

ఇక్ష్వాకురాజులు ధనుస్సుతో స్వర్గంవరకు జయించి, పుణ్యార్జన కోసం నూరుయజ్ఞాలు చేసి, పుత్రులకు రాజ్యభారాన్ని అప్పగించి మోక్షంకోసం నైమిశాన్ని ఆశ్రయిస్తారు.

**రామః:** (*ప్రణమతి*)

**కణ్వః:** ఇదమనన్యతపోవనసాధారణం నైమిశస్య మాహాత్మ్య-
మవలోకయ

> అస్మిన్ సన్నివసన్మహేశ్వరశిరస్తారాధిపజ్యోత్స్నయా
> మిశ్రీభూయ కవోష్ణతాముపగతస్తిగ్మో నిదాఘాతపః।
> న మ్లానిం తరుపల్లవేషు సరసాం తోయేషు నైవ క్షయం
> సన్తాపం న జనస్య కిన్తు జనయత్యాలోకమాత్రం దృశామ్ ॥6॥

కిఞ్చ –

> ఏతస్మిన్ వితతాధ్వరే ప్రతిదినం సాన్నిధ్యయోగాద్ధరే–
> స్త్యక్త్వా నన్దనచన్దనావనీరుహానాలానతాం ప్రాపితాః।

---

**రాముడు:** (*ప్రణమిల్లుతాడు*)

**కణ్వుడు:** అన్య తపోవనాలకన్నా విలక్షణమైన నైమిశారణ్య-
మాహాత్మ్యాన్ని దర్శించు –

ఇక్కడి ప్రచండగ్రీష్మపు ఎండవేడి, శివుడి జటాజూటంలోని చంద్రుడి వెన్నెలతో కలవడంవల్ల కళ్ళకు వెలుగును మాత్రం ప్రసాదిస్తూ, చెట్లు ఎండిపోకుండా, జలస్థానాలు ఇంకిపోకుండా, జనులకు బాధలేకుండా ఉంటుంది.

ఇంకా –

యజ్ఞాలకు ప్రసిద్ధికెక్కిన ఈ అరణ్యానికి ఇంద్రుడు ప్రతిరోజూ వస్తూ

బిభ్రత్యుచ్చనివేశితేన నయనేనాలోకనీయా అమీ
మత్తైరావణకణ్ఠరజ్జువలయన్యాసక్షతిం పాదపాః ॥7॥

**రామః:** విలోక్య సతతప్రవృత్తమహాధ్వరేణ ధర్మారణ్యేన నన్దనవనమపి విస్మరితో భగవాన్ పురన్దరః।

సచకితమవధాయ కర్ణమస్మిన్
సురపతికర్షణమన్త్రనిఃస్వనేషు।
విరచయతి శచీ సదైవ నూనం
స్రజమవధూయ వియోగవేణిబన్ధమ్ ॥8॥

**కణ్వః:** ఇదమపరం న పశ్యసి –

---

ఉంటాడు కనుక నందనవనంలోని చందనవృక్షాలకు బదులుగా ఈ అడవిలోని చెట్లకు అతడి ఐరావతం కట్టివేయబడుతుంది.ఆ కట్టుతాళ్ళ రాపిడులవలన ఈ సమున్నతవృక్షాలపై ఏర్పడిన గుండ్రటి చారలను చూడు.

**రాముడు:** సంతతం యజ్ఞాలు జరుగుతూ ఉండటంచేత ఈ ధర్మారణ్యం ఇంద్రుడు తన నందనవనాన్ని మరచిపోయేలా చేస్తున్నది.

ఇంద్రుణ్ణి ఆవాహన చేస్తూ ఈ నైమిశక్షేత్రంలో చేయబడే మంత్ర-ధ్వనుల భయం కారణంగా శచీదేవి పుష్పమాలలను విసర్జించి వియోగ-సూచకమైన వేణీబంధాన్ని ధరిస్తుంది.

**కణ్వుడు:** నీవు ఇంకో విశేషం గమనించలేదు.

అస్మిన్ కపోలమదపానసమాకులానాం
విఘ్నం న జాతు జనయన్తి మధువ్రతానామ్ ।
సామధ్వనిశ్రవణదత్తమనోఽవధాన–
నిష్పన్దమన్దమదవారణకర్ణతాలాః ॥9॥

**రామః:** (*విహస్య*) కిమత్రాశ్చర్యమ్ –

మునీనాం సామగీతాని పుణ్యాని మధురాణి చ ।
ప్రవాసినామపి మనో హరన్తి కిము దన్తినామ్ ॥10॥

**కణ్వః:** (*ఆత్మగతమ్*) అహో రామస్య ప్రవాసే మహాన్నిర్వేదః, యదయం తిర్యగ్భ్యోఽపి ప్రవాసిన ఏవ శూన్యహృదయానవగచ్ఛతి ।

---

మనస్సును సామగానంమీద లగ్నంచేసిన మదపుటేనుగులు వాటి కపోలాల మీద స్రవించే మదరసాన్ని తాగడానికి మూగిన మధుపాలను చెవులతో తోలడం లేదు.

**రాముడు:** (*నవ్వి*) అందులో ఆశ్చర్యమేముంది? మునుల సామగానం పుణ్యప్రదమూ, మధురమూ కూడా. అవి ఏనుగులనేమిటి? విరహుల మనస్సులనూ దోచుకుంటయి.

**కణ్వుడు:** (*తనలో*) ఆహా! రాముడి విరహబాధ! ఆ బాధవల్ల ఈయన ప్రవాసులు జంతువులకన్నా శూన్యహృదయులై (అన్యమనస్కులై) ఉంటారని భావిస్తున్నాడు.

(*ప్రకాశమ్*) ఇతస్తావదవధీయతాం దృష్టిః–

ముక్త్వా వసన్తవిరహేఽపి మునిప్రభావా–
దున్నిద్రసాన్ద్రకుసుమాం సహకారశాఖామ్ ।
ధావన్త్యమీ మధుకరాః క్రతుహోమధూమ–
సన్త్రాసితాః సరసి వారిరుహోదరాణి ॥11॥

**రామః:** కథమనవరతాహుతిసంవర్ధితో ధూమరాశిర్మధుకరాని-వాస్మాన్ పర్యాకులయితుం ప్రవృత్తః । (*ధూమసంబాధాం నాటయతి*)

**కణ్వః:** భో భోః కిం బాఢం ధూమేన పర్యాకులనయన ఇవాసి సంవృత్తః ।

**రామః:** సీతావిరహబాష్పేణ క్షరతా నిత్యదుఃఖితే ।
బాఢమాయాసితే భూయో ధూమేన మమలోచనే ॥12॥

---

(*పైకి*) ఇటు దృష్టి సారించండి .మునుల ప్రభావం కారణం చేత వసంతానంతరకాలంలో సైతం బాగా పూచి ఉన్నాయీ చెట్లకొమ్మలు. అయినా, క్రతుహోమధూమబాధతో ఈ తుమ్మెదలు ఆ చెట్లకొమ్మలను విడిచి కమలపుష్పాల గర్భాలలో దూరడానికి పరుగులిడుతున్నాయి.

**రాముడు**: ఎడతెగని హోమధూమం తుమ్మెదలను బాధించినట్లే, మమ్మల్ని కూడా బాధిస్తున్నది.

**కణ్వుడు**: ఏమిటి! పొగవల్ల అంత బాధగా ఉందా కళ్ళకు?

**రాముడు:** సీతావిరహదుఃఖబాష్పాల వల్ల నిత్యదుఃఖితుణ్ణైన నేను మళ్ళీ ఈ పొగ కళ్ళలోకి పోవడంవల్ల ఇంకా బాధపడుతున్నాను.

**కణ్వః:** తదేనామగ్రతోవర్తినీమాశ్రమదీర్ఘికామవగాహ్య శీతలేన సలిలేన క్షాలితవ్యపనీతనయనఖేదం విశ్రమ్య ముహూర్తమత్ర తిష్ఠతు। అహమపి కులపతేరగ్నిహోత్రవేలాం సన్నిధానేన సమ్భావయామి। (*ఇతి నిష్క్రాన్తః*)

**రామః:** (*పరిక్రమ్య*) ఏతద్దీర్ఘికాతీరమవతరామి। (*అవతీర్య*) అహో ప్రసన్నసలిలతా కమలాకరస్య । (*ఉదకమధ్యే ఛాయాం నిర్వర్ణ్య ససమ్భ్రమమ్*) కథం సీతాప్యత్రైవ (*హర్షవిస్మయం నాటయతి*)

**సీతా:** (విలోక్య) హద్ధీ హంసమిహుణదంసణావావుదాఏ మఏ అతక్కిదసమాఅదో అంఅఉత్తో ణ సంలక్ఖిదో। తా ఓసరిస్సం। (*తథా కరోతి*)

హా ధిక్! హంసమిథునదర్శనవ్యాపృతయా మయా అతర్కితసమాగత

---

**కణ్వుడు:** అలా అయితే ముందున్న ఆశ్రమ నడబావిలోని చల్లని నీటితో కళ్ళను కడుక్కొని, కాస్సేపు విశ్రమించునేను కూడా వెళ్ళి . కులపతి అగ్నిహోత్రసమయంలో దగ్గరుంటాను.

**రాముడు:** (ముందుకు నడిచి) ఈ బావి గట్టు మీదినుంచి క్రిందికి దిగుతాను. (దిగి) ఆహా! ఈ కమలాకరం ఎంత నిర్మలంగా ఉంది. (*నీటిలో సీత ప్రతిబింబాన్ని చూసి, ఆశ్చర్యంగా*) సీతాదేవి! ఇప్పుడు ఇక్కడ ఎలా?

**సీత:** (*గమనించి*) అయ్యో! హంసమిథునాలను చూసే ధ్యాసలో,

ఆర్యపుత్రో న సంలక్షితః। తదపసరామి। (*తథా కరోతి*)

**రామః:** కథమసమ్భావ్యైవ మాం ప్రస్థితా సీతా?

ఆపాణ్డరేణ మయి దీర్ఘవియోగఖేదం
లమ్బాలకేన వదనేన నివేదయన్తీ ।
ఏషా మనోరథశతైః సుచిరేణ దృష్టా
క్వాపి ప్రయాతి పునరేవ విహాయ సీతా ॥13॥

తదేనామాలమ్బే। (*బాహూ ప్రసార్య*) నైషా వైదేహీ, కిన్తు –

వైదేహ్యాః క్వాపి గచ్ఛన్త్యా దీర్ఘికాతీరవర్త్మనా।
అన్తర్గతజలచ్ఛాయా మయా సైవేతి వీక్షితా ॥14॥

తదస్యాః ప్రతికృతేర్మూలప్రకృతిమన్వేషయామి। (*అన్వేషణం నాటయతి*)

---

అనుకోకుండా వచ్చిన ఆర్యపుత్రుణ్ణి చూడలేదు. తప్పుకుంటాను. (*తప్పుకుంటుంది*)

**రాముడు:** నన్ను పలుకరించకుండా ఎలా వెళ్ళిపోయింది సీత?

వేలాడే ముంగురులతో, పాలిపోయిన ముఖముతో తన విరహ-దుఃఖాన్ని తెలియజేస్తూ కనబడిన సీత నన్ను మళ్ళీ దీర్ఘవియోగ–దుఃఖంలో ముంచి వెళ్ళిపోయింది. ఆమెను పట్టుకుంటాను.

(*చేతులు చాచి*) ఆమె సీత కాదా? కానీ... ఈ బావిగట్టు మీద నుండి ఎక్కడికో వెళ్తున్న సీత ప్రతిబింబాన్ని నీటిలో చూశాను.

ఈ ప్రతిబింబం యొక్క మూలాన్ని వెదుకుతాను. (*వెదుకుతాడు*)

నిఃసమ్పాతవివిక్తమిదం దీర్ఘికాతీరమ్, బిమ్బేన చ వినా ప్రతిబిమ్బ-మిత్యసమ్భావ్యమేతత్ । కిమిదమ్?

**సీతా:** *పేక్ఖదే పడికిదిం, కహం ణ పేక్ఖది మం అంఅఉత్తో । (విచిన్త్య) హోదు, విణ్ణాదం ముణిప్పసాదో ఏసో తపోవణవాసిణీణం ఇత్థిఆణం ఏదస్సిం దీహిఆతీరే పురుసణఅణాణం అగోఅరదా । జది పడికిదిఏ వి అదంసణం మ హేసిణా ఆదిట్ఠం భవే । తదా అఅం జణో అణుగ్గహిదో భవే । అహం వి జావ జహ ఏసా పడికిదీ ణ దీసఇ తహ ఓసరిస్సం । (అపసరతి)*

ప్రేక్షతే ప్రతికృతిం కథం న ప్రేక్షతే మామార్యపుత్రః । (*విచిన్త్య*) భవతు, విజ్ఞాతమ్ మునిప్రసాద ఏష తపోవనవాసినీనాం స్త్రీణామేతస్మిన్ దీర్ఘికాతీరే పురుషనయనానామగోచరతా । యది ప్రతికృతేరప్యదర్శనం మహర్షిణాఽదిష్టం భవేత్ తదాయం జనోఽనుగృహీతో భవేత్ । అహమపి తావత్ యథైషా ప్రతికృతిర్నదృశ్యతే తథాపసరామి । (*అపసరతి*)

---

అయ్యో! ఇక్కడ ఎవరూ లేరే! కానీ బింబం లేకుండా ప్రతిబింబం ఎలా వస్తుంది? ఏమిటిది?

**సీత:** ప్రతిబింబాన్ని చూడగలిగిన ఆర్యపుత్రులు నన్నెందుకు చూడలేకపోతున్నారు? ఆహా! తెలిసింది. ముని మహిమవల్ల తపోవనంలోని స్త్రీలు ఈ నడబావి దగ్గర పురుషులకు కనుపించరు కదా! మహర్షి ప్రతిబింబాన్ని కూడా కనుపించకుండా చేసి ఉంటే, నేను ఆయననుండి తప్పించుకునేదానిని. ఇప్పుడు నేను నీటిలో నా ఛాయ కనబడకుండా తప్పుకుంటాను. (*తప్పుకుంటుంది*)

**రామః:** తామేవ తావత్ ప్రసన్నసలిలమధ్యవర్తినీం ప్రతిమాసీతామవ-లోకయామి। (*విలోక్య*) కథం సాప్యన్తర్హితా? (*మోహం గచ్ఛతి*)

**సీతా:** *హద్ధీ! హద్ధీ! మోహం గదో అంఅఉత్తో। ఉవసప్పిస్సం। (పరిక్రామతి) అహవా జది సంలక్ఖిదో అంఅఉత్తో పుణో వి కుప్పిస్సది తదా మునిఅణా అవిణీదేత్తి మం సంభావఇస్సంతి। తా గమిస్సం। (నివృత్య) అహవా ణ ఏసో జుత్తాజుత్తవిఆరణస్స కాలో, కుప్పదు వా మం అంఅఉత్తో, మునిఅణో వా అవిణీదేత్తి సంభావేదు। సంవహా ణ సక్కణోమి ఏదారిసావత్థం గదం అంఅఉత్తం ఉవేక్ఖిదుం। (పరిక్రామతి) సుణ్ణంతు భవన్తో లోఅవాలా, అహం అంఅఉత్తేణ ణివ్వాసిదా, సంపదం అవిణీదదాఏ అంఅఉత్తస్స ణ సాసణం ఖు అదిక్కమామి, కిందు సోఆవేఅబలక్కారిదా అత్తణో ణ పహవన్తీ ఈదిసం సాహసం అణుచిట్ఠామి। (ఉపసృత్య నిర్వర్ణ్య) హద్ధీ! హద్ధీ! పరిచ్చత్తచేదణో విఅ అంఅఉత్తో। (పరిష్వజతే)*

హా ధిక్! హా ధిక్! మోహం గత ఆర్యపుత్రః। ఉపసర్పామి। (*పరిక్రామతి*) అథవా యది సంలక్షిత ఆర్యపుత్రః పునరపి కోపిష్యతి తదా మునిజనా అవినీతేతి మాం సమ్భావయిష్యన్తి। తద్గమిష్యామి। (*నివృత్య*) అథ వా నైష యుక్తాయుక్తవిచారణస్య కాలః, కుప్యతు వా మామార్యపుత్రః, మునిజనో వావినీతేతి సమ్భావయతు। సర్వథా న శక్నోమి ఏతాదృశావస్థాం

---

**రాముడు**: ఇప్పటివరకు ఈ నిర్మల జలాలలో సీత ప్రతిబింబాన్ని చూస్తున్నాను. (చూసి) ఇంతలో ఆమె ఎలా మాయమైంది? (*మూర్ఛిల్లుతాడు*)

గతమార్యపుత్రముపేక్షితుమ్। (*పరిక్రామతి*) శృణ్వన్తు భవన్తో లోకపాలాః, అహమార్యపుత్రేణ నిర్వాసితా సామ్ప్రతమవినీతతయార్యపుత్రస్య న శాసనం ఖలు అతిక్రమామి, కిన్తు శోకావేగబలాత్కారితాఽఽత్మనో న ప్రభవన్తీ ఈదృశం సాహసమనుతిష్ఠామి। (*ఉపసృత్య నిర్వర్ణ్య*) హా ధిక్! హా ధిక్! పరిత్యక్తచేతన ఇవార్యపుత్రః। (*పరిష్వజతే*)

**రామః** (*ప్రత్యాగమనం నాటయతి*)

**సీతా:** (*అపసరణం నాటయతి*)

---

**సీత:** అయ్యో! ఆర్యపుత్రులు మూర్ఛపోయారు. దగ్గరగా వెళతాను. (*సమీపించబోతుంది*) ఒకవేళ ఆయన నన్ను చూసి కోపిస్తారేమో? మునిజనులు నన్ను అవినీతిపరురాలననుకుంటారేమో? వెళ్ళిపోతాను. (*వెనుదిరిగి*) అయినా ఇది తప్పొప్పులు ఎంచే సమయం కాదు. ఏమైనా స్వామిని ఈ అవస్థలో విడిచిపెట్టివెళ్ళలేను. (*రాముడున్నవైపుకు నడుస్తుంది*) లోకపాలకులారా! వినండి. అవినీతి ఆరోపణల వల్ల ఆర్యపుత్రులచేత త్యజించబడిన నేను, ఆర్యపుత్రుల శాసనాన్ని అవినీతురాలనై అతిక్రమించడంలేదు. కానీ శోకావేగంవల్ల నిలువరించలేని మనస్సుతో ఇలాంటి సాహసం చేస్తున్నాను. (*దగ్గరగా వెళ్ళి పరీక్షగా చూసి*) అయ్యో! ఈయన మళ్ళీ స్పృహతప్పిపోయాడు. (*రాముడిని పట్టుకుంటుంది*)

**రాముడు:** (*తేరుకుంటాడు*)

**సీత:** (*పక్కకు తప్పుకుంటుంది*)

**రామః:** కథమకస్మాదేవ రోమాఞ్చితోఽస్మి?

**సీతా:** తహ ణామ ణివ్వాసిదా ఈదిసం సాహసం అణుచిట్టిఅ జం సచ్చం భీదంమి సంవుత్తా।

తథా నామ నిర్వాసితేదృశం సాహసమనుష్ఠాయ యత్సత్యం భీతాస్మి సంవృత్తా।

**రామః:** (*విలపన్*) గాఢమాలిఙ్గ వైదేహి...

**సీతా:** అణవరద్ధంమి।

అనపరాద్ధాస్మి।

**రామః:** దేహి మే దర్శనం ప్రియే।

**సీతా:** పహవది సిద్ధసాసణం; కిం ఏత్థ కరేమి మన్దభాఆ।

ప్రభవతి సిద్ధశాసనం కిమత్ర కరోమి మన్దభాగ్యా।

---

**రాముడు:** హఠాత్తుగా నాకు పులకరింత కలుగుతున్నదేమి?

**సీత:** పరిత్యక్తనైనా సాహసించానని భయంగా ఉన్నది...

**రాముడు:** (*ఏడుస్తూ*) గట్టిగా కౌగిలించుకో వైదేహి...

**సీత:** నిర్దోషిని నేను.

**రాముడు:** ప్రియా! నాకు కనిపించు.

**సీత:** వాల్మీకిమహర్షి శాసనాన్ని అతిక్రమించలేను, మందభాగినిని. ఏం

**రామః:** త్యజ్యతాం దీర్ఘరోషోఽయం...

**సీతా:** అహం వి అంఅఉత్తం ఏవ్వం విణ్ణవేమి।

అహమప్యార్యపుత్రమేవం విజ్ఞాపయామి।

**రామః:** ... కిం ను నిష్కరుణా మయి ॥15॥

**సీతా:** అంఅఉత్త! వివరీఓ ఖు ఉవాలంభో।

ఆర్యపుత్ర! విపరీతః ఖలూపాలమ్భః।

**రామః:** దేవి విజ్ఞాపయామి త్వాం ...

**సీతా:** అవహిదంమి ఏసా, ఆణవేహి।

అవహితాస్మ్యేషా, ఆజ్ఞాపయ।

---

చెయ్యగలను?

**రాముడు:** నీ దీర్ఘకోపాన్ని విడిచిపెట్టు సీతా.

**సీత:** నేనూ మిమ్మల్ని అదే ప్రార్థిస్తున్నాను.

**రాముడు:** నా పట్ల నీకు దయలేదా?

**సీత:** ఆర్యపుత్రా! ఇది విపరీతమైన ఆరోపణ.

**రాముడు:** దేవీ! వేడుకుంటున్నాను నిన్ను.

**సీత:** నేను శ్రద్ధగా వింటున్నాను. ఆజ్ఞాపించండి.

**రామః:** ... యత్త్వం చారిత్రశాలినీ।

**సీతా:** అహో అచ్చాహజోగ్గా పాణా।

అహో అత్యాగయోగ్యాః ప్రాణాః।

**రామః:** నిర్వాసితాసి విషయాత్...

**సీతా:** పహవది అంఅఉత్తో సఅలస్స పరిఅణస్స।

ప్రభవత్యార్యపుత్రః సకలస్య పరిజనస్య।

**రామః:** ... అస్మిన్ దోషే ప్రసీద మే ॥16॥

**సీతా:** తుమం పసీద, ణిచ్చపసణ్ణా అహం।

త్వం ప్రసీద, నిత్యప్రసన్నాహమ్।

---

**రాముడు:** శీలవతివైన నువ్వు...

**సీత:** ఆహా! ప్రాణత్యాగం చేయక జీవించి ఉన్నందుకు కదా ఈ మంచి మాట విన్నాను.

**రాముడు:** ... రాజ్యబహిష్కారం పొందావు.

**సీత:** ఆర్యపుత్రులకు సకలపరిజనులపై అధికారం ఉంటుంది.

**రాముడు:** ఈ తప్పుకు నన్ను క్షమించు. ప్రసన్నవుకా!

**సీత:** మీరు సంతోషంగా ఉండండి. నేను సదా ప్రసన్నంగానే ఉన్నాను.

**రామః:** కదా బాహూపధానేన పటాన్తశయనే పునః।
గమయేయం త్వయా సార్ధం పూర్ణచన్ద్రాం విభావరీమ్ ॥17॥

**సీతా:** అయి జణవాదభీరుఅ, ఏత్థ సణ్ణిహిదే జణే సంతపసి।

అయి జనవాదభీరుక, అత్ర సన్నిహితే జనే సన్తపసి।

**రామః:** హా ప్రియే జనకరాజపుత్రి దేహి మే ప్రతివచనమ్ । (*మోహం గచ్ఛతి*)

**సీతా:** *కహం పుణో వి అంఅఉత్తో మోహం గదో। సమస్సస్సం।* (పటాన్తేన వీజయతి)

కథం పునరప్యార్యపుత్రో మోహం గతః। సమాశ్వాసయామి। (*పటాన్తేన వీజయతి*)

---

**రాముడు:** చక్కని వస్త్రం పరచిన సుఖశయ్య మీద నా బాహువులే నీకు తలగడగా మళ్ళీ ఎప్పుడు పూర్ణచంద్రుడు వెలిగే రాత్రులు గడుపుతామో కదా!

**సీత:** జనాపవాదానికి వెరచేవాడా! నేను నీ పక్కనే ఉన్నా బాధపడుతున్నావు.

**రాముడు:** హా ప్రియా! జనక రాజపుత్రీ! సమాధానం చెప్పు నాకు. (*మూర్ఛిల్లుతాడు*)

**సీత:** అయ్యో! ఆర్యపుత్రులు మళ్ళీ మూర్ఛపోయారు. ఓదారుస్తాను. (*కొంగుతో విసురుతుంది*)

**రామః:** (హస్తం ప్రసార్య పటాన్తం గృహ్ణాతి) కథం పటాన్త ఇవ సంలక్ష్యతే । కో ను ఖల్వేష భవిష్యతి? (*విచిన్త్య*) అథ వా –

> జనకదుహితరం విహాయ దేవీం
> జనమపరం భువనే తథాప్రభావమ్ ।
> అహమిహ న విలోకయామి యా మే
> స్పృశతి పటాన్తసమీరణైః శరీరమ్ ॥18॥

తదేనామవలోకయామి । (*చక్షురున్మీలయన్*) అనవరతబాష్పపిహిత-లోచనతయా న కిఞ్చిదపి దృశ్యతే । తస్మాదేనమపకృష్య తావదపనయామి । (*తేనైవోత్తరీయాన్తేనాశ్రూణి ప్రమార్జన్నాకర్షతి*)

**సీతా:** (*ఉత్తరీయం ముఞ్చతి*) *అంఅఉత్త ణ తుప పరకేరపణ ఉత్తరీపణ పణఅ కోవిదస్స విఅ జణస్స అస్సుప్పమంజ్జణం అణుచిట్ఠిదవ్వం ।*

---

**రాముడు:** (*చేతులు చాచి*) ఉత్తరీయం కొంగులా ఉన్నదే? ఎవరై ఉంటారు? (*ఆలోచించి*) ఒకవేళ ... జానకి తప్ప వేరెవరూ నన్ను చీరకొంగుతో విసరిన గాలితోనైనా నన్ను తాకలేరు. చూస్తాను.

(*కళ్ళు తెరిచి*) అంతులేని కన్నీటిప్రవాహం వల్ల ఏమీ కనుపించడం లేదు. కళ్ళు తుడుచుకొని చూస్తాను. (*ఆ ఉత్తరీయంతోనే కన్నీళ్ళను తుడుచుకుంటూ దానిని లాక్కుంటాడు*)

(*ఉత్తరీయం ముఞ్చతి*) ప్రణయకోవిదస్య (కోపితస్య) ఇవ జనస్యాక్షు-ప్రమార్జనమనుష్ఠాతవ్యమ్।

**రామః:** (*ఉత్తరీయం పతితమవలోక్య*) కథముత్తరీయమాత్రమేవ పశ్యామి న పునః పరిధానకమ్।

అన్యాంశుకమతిరభసాదవిమృశ్యవిధాయినా మయాకృష్టమ్।
గగనతలాత్పరిగలితం జ్యోత్స్నానిర్మోకలలితమిదమ్ ॥19॥

(*పునర్నిర్వర్ణ్య*) కిమపరమకస్మాదేవాసమీక్ష్యకారిణమాత్మానమవ-గచ్ఛామి । సువ్యక్తం తయైవ చిత్రకూటవనదేవతయా మాయావత్యా ప్రదర్శితమ్ –

---

**సీత:** (*ఉత్తరీయాన్ని వదిలేస్తుంది*) ఆర్యపుత్రా! పరాయి స్త్రీ ఉత్తరీయంతో ప్రణయకోవిదుడిలాగా అశ్రువులు తుడుచుకోకూడదు.

**రాముడు:** (*క్రిందపడిన ఉత్తరీయాన్ని చూసి*) ఉత్తరీయం మాత్రమే కనుపిస్తున్నది. ధరించినవారు కనుపించడం లేదే?!

అన్యుల వస్త్రాన్ని నేను తొందరలో ఆలోచించకుండా కళ్ళు తుడుచుకోవడానికి తీసుకున్నాను. పాము కుబుసంలా, ఆకాశంనుండి ఒలికిన వెన్నెలలా ఉన్నదీ ఉత్తరీయం.

(*మళ్ళీ పరిశీలించి*) అనాలోచితంగా ప్రవర్తించానని నన్ను నేను అనుకోవడం ఎందుకు? ఇది చిత్రకూటంలో అరణ్యావాసం చేస్తున్నప్పుడు వనదేవత మాయావతి ఇచ్చినదే.

ద్యూతే పణః ప్రణయకేలిషు కణ్ఠపాశః
క్రీడాపరిశ్రమహరం వ్యజనం రతాన్తే।
శయ్యా నిశీథకలహే హరిణేక్షణాయాః
ప్రాప్తం మయా విధివశాదిదముత్తరీయమ్ ॥20॥

**సీతా:** *దిట్ఠిఆ అహిణ్ణాదం అంఅఉత్తేణ।*

దిష్ట్యాఽభిజ్ఞాతమార్యపుత్రేణ।

**రామః:** కీదృశమిదానీమస్య ప్రియావల్లభస్య సమ్మానవిశేషమను-తిష్ఠామి (*విచిన్త్య*) భవత్వయమేవాస్యానన్యసాధారణః సమ్మానవిశేషః। (*ప్రావృణోతి*) (*ఆత్మానం ప్రావృత్యావలోక్య*) ద్వితీయప్రావరణం మామవలోక్య కిమపి చిన్తయిష్యతి మునిజనః। తస్మాదాత్మీయ-ముత్తరీయం పరిత్యజామి। (*ఇత్యుత్క్షిపతి*)

---

జూదమాడేటప్పుడు పణంగా, ప్రణయకేళిలో కంఠపాశంలా, రతిక్రీడానంతరం శ్రమను పోగొట్టడానికి విసురుకునే వ్యజనం(వీవెన) లా, అలిగినప్పుడు సీతకు శయ్యలా ఉపయోగపడిన ఈ ఉత్తరీయం విధివశాత్తు నాకు దొరికింది.

**సీత:** ఆహా! తెలిసిపోయింది ఆర్యపుత్రులకు.

**రాముడు:** ఎలా దీనిని, నా ప్రియపత్ని ఉత్తరీయాన్ని గౌరవించను? (*ఆలోచించి*) అవును. ఇదే దీనికి సరియైన గౌరవం. (*కప్పుకుంటాడు*) (*తనను తాను చూసుకొని*) రెండు ఉత్తరీయాలను కప్పుకున్న నన్ను

**సీతా:** (*గృహీత్వా సహర్షమ్*) *పిఅం మే సంవుత్తం చిరజీవిదాఏ ఫలం। (ఆఘ్రాయ) దిట్టిఆ అసంకంతవిలేవణామోఅం అంఅఉత్తస్స ఉత్తరీఅం। సవ్వహా సచ్చసన్ధా రాహవా। (ప్రావృత్య) అమ్హే ఏదం పిఅజణసంసగ్గ-సుహప్పరిసం ఉత్తరీఅం పావరిఅ అంఅఉత్తవచ్ఛత్థలపరిస్సంతం విఅ అవిరలసముబ్భిణ్ణరోమంచణిరంతరం అత్తాణం ఉవ్వహామి।*

(*గృహీత్వా సహర్షమ్*) ప్రియం మే సంవృత్తం చిరజీవితాయాః ఫలమ్। (*ఆఘ్రాయ*) దిష్ట్యాఽసఙ్క్రాన్తవిలేపనామోదమార్యపుత్రస్యోత్తరీయమ్। సర్వథా సత్యసన్ధా రాఘవాః। (*ప్రావృత్య*) అహో ఏతత్ ప్రియజనసంసర్గ-సుఖస్పర్శముత్తరీయం ప్రావృత్యార్యపుత్రవక్షఃస్థలపరిశ్రాన్తమివావిరల-సముద్భిన్నరోమాఞ్చనిరన్తరమాత్మానముద్వహామి।

---

చూసి మునులు ఏమనుకుంటారో? నా ఉత్తరీయాన్ని వదలేస్తాను. (తన ఉత్తరీయాన్ని వదిలేస్తాడు)

**సీత:** (*ఆ ఉత్తరీయాన్ని తీసుకొని, సంతోషంగా*) నాకు చాలా సంతోషంగా ఉంది. చిరకాలం జీవించి ఉన్నందుకు ఫలం కలిగింది. (*వాసన చూసి*) ఆహా! ఈ ఉత్తరీయానికి ఏ సుగంధద్రవ్యాలు పూసుకోలేదు. రాఘవులు నిజంగా సత్యసంధులు. (*కప్పుకొని*) ఆహా! ప్రియమైనవారు ధరించిన ఈ ఉత్తరీయం వారి స్పర్శవల్ల సుఖదాయకంగా ఉన్నది. దీన్ని కప్పుకుంటే, ఆర్యపుత్రుల వక్షస్థలం మీద ఉన్నట్లు రోమాంచపరంపరలు నన్ను సంతోషపరవశురాలిని చేస్తున్నవి.

**రామః:** (*సవిస్మయమ్*) యథైతదుత్తరీయమప్రాప్తమహీతలమేవ కేనాప్యపహృతం తథా జానామి ప్రత్యాసన్నఫలో మే మనోరథ ఇతి।

(*విచిన్తయన్*) ఉత్తరీయాపహారో జలచ్ఛాయాయాం దృశ్యతే, న సీతా; కిమేతత్? భవతు సిద్ధాశ్రమవాసిభ్యో జనేభ్యోఽస్యాః ప్రభావో భవిష్యతి। తత్కో ను ఖల్వస్యాః ప్రత్యాసన్నదర్శనేఽభ్యుపాయః। అయి వైదేహి! న కిఞ్చిత్ స్మరసి కస్యచిత్ పూర్వవృత్తాన్తస్య, యన్మామేవం దర్శన-మాత్రేణాపి న సమ్భావయసి?

**సీతా:** *అజ్జవి కీదిసో పువ్వవుత్తన్తో?*

అద్యాపి కీదృశః పూర్వవృత్తాన్తః?

---

**రాముడు:** (*ఆశ్చర్యంగా*) ఆహా! నా ఉత్తరీయాన్ని నేలకు తాకకముందే ఎవరో గ్రహించారు. దీనివల్ల నా మనోరథం సిద్ధించే సమయము ఆసన్నమైనట్లు భావన కలుగుతున్నది.

(*ఆలోచించి*) ఉత్తరీయగ్రహణం నీటిలో కనబడింది కానీ, సీత కనుపించలేదు. ఏమిటిది? ఈ ప్రభావం ఆశ్రమతపస్వులది కావచ్చు. అయితే, సీతను త్వరగా చూసే ఉపాయం ఏమిటి? వైదేహి! పూర్వవృత్తాంతాలేవీ జ్ఞాపకం లేవా? నన్ను చూసి కూడా మాట్లాడటం లేదు.

**సీత:** ఇప్పుడు కూడా ఎటువంటి పూర్వవృత్తాంతాలు?

**రామః:** అవిదితమనుస్పృత్య చిత్రకూటే
సుతను సుమాపచయాయ నిర్గతాం త్వామ్।
కుసుమమపచితం వికీర్య భూమౌ
స్మరసి రసేన మయా ధృతం పటాన్తమ్ ॥21॥

**సీతా:** *(విహస్య) సాహసిఅ అదో ఏవ్వ దూరే పరిహరిఅసి।*

(విహస్య) సాహసిక, అత ఏవ దూరే పరిహ్రియసే।

**రామః:** కథం న కిఞ్చిదపి ప్రతివచనం ప్రయచ్ఛతి?

**సీతా:** *ఆసణ్ణా మమ దిఅహావసాణవేలా। ణ జుత్తం అ ఏతావత్థం గదం అంఅఉత్తం దేవదాదుదిఅం కదుఅ అపక్కమిదుం। తా కిం ఏత్థ కరఇస్సం। (దిశోఽవలోక్య) దిట్ఠిఆ ఏసో పిఅవఅస్సో కోసిఓ కింవి అణ్ణేసంతో విఅ కోదూహలసమావేసణిక్కితలోఅణో ఇదో ఏవ్వ ఆఅచ్ఛఇ, తా ఓసరిస్సం।*

ఆసన్నా మమ దివసావసానవేలా। న యుక్తం చైతదవస్థాం గతమార్య-

---

**రాముడు:** చిత్రకూటంలో ఒకసారి నువ్వు పూలు కోయడానికి వెళ్ళినప్పుడు, నీకు తెలియకుండా నేను నీ వెనుకనే వచ్చి నీ చీరచెంగు పట్టుకున్నప్పుడు పూలన్నీ నేలమీద పడిపోయినాయి. జ్ఞాపకం ఉన్నదా?

**సీత:** (నవ్వి) దుడుకు మనిషివి! అందుకే దూరంగా ఉంచుతాను నిన్ను.

**రాముడు:** ఎందుకు సమాధానమే చెప్పదు?

**సీత:** సాయంకాలమవుతున్నది. ఇక వదలివెళ్ళే సమయం దగ్గరపడింది.

పుత్రం దేవతాద్వితీయం కృత్వాపక్రమితుమ్। తత్ కిమత్ర కరిష్యామి? (*దిశోఽవలోక్య*) దిష్ట్యా ఏష ప్రియవయస్యః కౌశికః కిమప్యన్విష్యన్నివ కౌతూహలసమావేశనిక్షిప్తలోచన ఇత ఏవాగచ్ఛతి। తదపసరామి। (*నిష్క్రాన్తా*)

(*తతః ప్రవిశత్యన్వేషమభినయన్ విదూషకః*)

**విదూషకః:** *ఏసో పిఅవఅస్సో చిన్తాఉలో విఅ ణిహుదమణోహరాఏ ఆకిదీఏ దీహిఆతీరం అలంకరేఇ, తా ఉవసప్పిస్సం। (ఉపసృత్య) జేదు భవం।*

ఏష ప్రియవయస్యశ్చిన్తాకుల ఇవ నిభృతమనోహరయాఽకృత్యా దీర్ఘికాతీరమలఙ్కరోతి। తదుపసర్పామి। (*ఉపసృత్య*) జయతు భవాన్।

---

ఐతే ఈయనను ఈ స్థితిలో ఒంటరిగా వదలివెళ్ళడం న్యాయం కాదు. ఇప్పుడేం చెయ్యాలి? (*దిక్కులు చూసి*) అదృష్టంకొద్దీ ఈయన ప్రియవయస్యుడు కౌశికుడు ఏదో వెదుకుతున్నట్లు కుతూహలంగా చూస్తూ, ఇటే వస్తున్నాడు. ఇక తప్పుకుంటాను. (*నిష్క్రమిస్తుంది*)

(*రాముడిని వెదుకుతూ ఉన్న విదూషకుడు అక్కడికి వస్తాడు*)

**విదూషకుడు:** అడుగో, ప్రియవయస్యుడు చింతాకులుడై ఉన్నా, సుందరాకృతితో ఆ బావి గట్టును అలంకరించి ఉన్నాడు. (*సమీపించి*) మీకు జయమగు గాక!

**రామః:** (*విలోక్య*) దిష్ట్యా ప్రియవయస్యః కౌశికః ప్రాప్తః। వయస్య కౌశిక! కుతో భవాన్?

**విదూషకః:** *అజ్జ సూరోదఅప్పహుది మమ తుమం అణ్ణేసమాణస్స సఅలో దిఅహో అదిక్కందో।*

అద్య సూర్యోదయప్రభృతి మమ త్వామన్వేషమాణస్య (?) సకలో దివసోఽతిక్రాన్తః।

**రామః:** కిఙ్కృతోఽయమస్మదన్వేషణే భవతః ప్రయాసః?

**విదూషకః:** *సుదం మఏ పహాదఏ సమఏ అదిముత్తమండవబ్భంతరే పచ్ఛణ్ణట్టిదేణ విస్సద్ధపఉత్తసంకహాణం మునికణ్ణఆణం అచ్ఛరాణం వి ముహాదో కింవి తవోవణరహస్సం వి మంతిఅమాణం। తం తుహ ప్పిఅం ఆసీ। అబ్భంతరత్తిదం విఅ గూఢగబ్భం అహిఅదరం బాహేఇ।*

శ్రుతం మయా ప్రాభాతికే సమయేఽతిముక్తమణ్డపాభ్యన్తరే ప్రచ్ఛన్న-స్థితేన విస్రబ్ధప్రవృత్తసఙ్కథానాం మునికన్యకానామప్సరసామపి ముఖతః

---

**రాముడు:** (చూసి) వయస్యా! కౌశికా! ఎక్కడినుండి వస్తున్నావు?

**విదూషకుడు:** ఉదయం మొదలుకొని ఈరోజంతా నిన్ను వెదకడంలోనే గడిచిపోయింది.

**రాముడు:** ఎందుకు నన్ను వెదకడానికి ప్రయాసపడ్డావు?

**విదూషకుడు:** ప్రభాతసమయంలో మాధవీలతామంటపంలో రహస్యంగా దాగి, మునికన్యలూ అప్సరసలూ మాట్లాడుకుంటుంటే

కిమపి తపోవనరహస్యం మన్త్ర్యమాణమ్। తత్ తవ చ ప్రియమాసీత్। అభ్యన్తరస్థితమివ గూఢగర్భమధికతరం బాధతే।

**రామః:** కీదృశం తపోవనరహస్యమ్?

**విదూషకః:** *భో కిం ణ జాణాసి తత్తహోదీ –*

భోః కిం న జానాసి తత్రభవతీ –

**రామః:** (*కర్ణౌ పిధాయ*) స్త్రీసమ్బద్ధమేవ తద్రహస్యమ్, తదలమనేన శ్రుతేన।

**విదూషకః:** *మా భయాహి, రామవఅస్సో ఖు అహం। ణ జాణాసి తత్తహోదిం పురాణసగ్గదాసీం।*

మా భీః, రామవయస్యః ఖల్వహమ్ । న జానాసి తత్రభవతీం పురాణ-స్వర్గదాసీమ్।

---

ఒక రహస్యం విన్నాను. అది నీకు ప్రియాన్ని కలిగించేదే. అది లోపల దాచుకోలేక నానా అవస్థా పడుతున్నాను.

**రాముడు:** ఎటువంటి రహస్యం?

**విదూషకుడు:** అయ్యా! పూజనీయురాలైన ఆమె...

**రాముడు:** (*చెవులు మూసుకొని*) ఆ రహస్యం స్త్రీ విషయమైతే నేను వినదలచుకోలేదు.

**విదూషకుడు:** అయ్యయ్యో! నేను రాముడి మిత్రుణ్ణి కాదా...

**రామః:** (*ఆత్మగతమ్*) దేవగణికాసమ్బద్ధైషా కథా, న కశ్చిద్దోష-స్తదాకర్ణనే। (*ప్రకాశమ్*) కతమాసౌ పురాణస్వర్గదాసీ కిముర్వశీ కిం తిలోత్తమా।

**విదూషకః:** *ణ ఆణామి కిం తిలుత్తమా సిలుత్తమేత్తి । సా కిల తత్తహోదీఏ చిరకాలవిఉత్తాఏ విదేహరాఅతణఆఏ చరిదం అణుచిట్టియ పిఅవయస్సం ఉవహసిదుం ఇచ్ఛఇ।*

న జానామి కిం తిలోత్తమా సిలోత్తమేతి। సా కిల తత్రభవత్యాశ్చిర-కాలవియుక్తాయా విదేహరాజతనయాయాశ్చరితమనుష్ఠాయ ప్రియ-వయస్యముపహసితుమిచ్ఛతి।

**రామః:** (*ఆత్మగతమ్*) కష్టం! సమ్యగుపలక్షితం కౌశికేన। అన్యథా హి దృశ్యమానే ప్రియాసన్నిధానాభిజ్ఞానే స్వయం న దృశ్యత ఇత్యసమ్భావ్యమే-

---

భయపడవద్దు. ఆ అప్సరస తెలుసు కదా?

**రాముడు:** (*తనలో*) దేవగణికాసంబంధమా? ఐతే దోషంలేదు. (ప్రకాశంగా) ఎవరా పురాణదేవవేశ్య? ఊర్వశియా? తిలోత్తమయా?

**విదూషకుడు:** తిలోత్తమో, సిలోత్తమో తెలియదు. ఆవిడ మీ చిరకాలవియోగంలో ఉన్న విదేహ–రాజపుత్రిరూపంలో వచ్చి ప్రియ వయస్యుణ్ణి అపహాస్యం చేయదలచింది.

**రాముడు:** (*తనలో*) కష్టం. కౌశికుడు సరిగానే చెప్పాడు. అలా కాకపోతే ప్రియురాలు సమక్షంలోనే ఉంటూ అదృశ్యంగా ఉండగలగటం

తన్మానుషీషు। సర్వథా వఞ్చితోऽస్మి కామరూపిణ్యా తిలోత్తమయా। (*ఉత్తరీయమవలోక్య*) కథముత్తరీయమపి నిర్మితమతిమాయావిన్యా। అహో! పరవఞ్చనాయామతిమహన్నైపుణమ్।

తృషితేన మయా మోహాత్ ప్రసన్నసలిలాశయా।
అఞ్జలిర్విహితః పాతుం కాన్తారమృగతృష్ణికామ్ ॥22॥

**విదూషకః:** *భో వయస్స! విలక్ఖముహో విఅ దీససి। కిం తాఏ వంచిదోసి?*

భో వయస్య! విలక్షముఖ ఇవ దృశ్యసే। కిం తయా వఞ్చితోసి?

**రామః:** వఞ్చితః కృతోస్మి ।

---

మనుష్యులకు సాధ్యమా? కామరూపిణి తిలోత్తమచేత పూర్తిగా మోసగింపబడ్డాను.

దాహంవల్ల మోసపోయి మంచినీళ్ళనుకొని అరణ్యంలో ఎండమావి కోసం దోసిలిపట్టాను.

ఆ మాయావిని ఉత్తరీయాన్ని కూడా ఎలా కల్పించింది?! ఆహా! వంచనలో కూడా ఎంత నైపుణ్యం!

**విదూషకుడు:** వయస్యా! ఏమిటి ముఖం అలా ఉన్నది? తను నిన్ను వంచించిందా?

**రాముడు:** వంచింపబడ్డాను.

**విదూషకః:** *కిం మప సుదం రహస్సం అణ్ణహా హోది?*

కిం మయా శ్రుతం రహస్యమన్యథా భవతి?

(*నేపథ్యే*)

సన్తాప్య లోకమఖిలం నిరవగ్రహేణ
తీవ్రో నరేశ్వర ఇవ ప్రథమం స్వధామ్నా।
సోఽయం వయఃపరిణతేరివ శాన్తతేజాః
సాయం మృదుర్భవతి తిగ్మరుచిః క్రమేణ ॥23॥

**రామః:** (*నిర్వర్ణ్య*) అస్తం గచ్ఛతి భగవాన్ దివాకరః।

ప్రియజనరహితానామఙ్గులీభిర్వధూనా–
మవధిదివససఙ్ఖ్యావ్యాపృతాభిః సహైవ
వ్రజతి కిరణమాలిన్యస్తమేకైకశోఽస్మిన్
సరసకమలపత్రశ్రేణయః సఙ్కుచన్తి ॥24॥

---

**విదూషకుడు:** ఔను. నేను విన్న రహస్యం అసత్యం ఎలా అవుతుంది?

(*తెర వెనకనుంచి*)

యుక్తవయస్సులో ఉన్నప్పుడు ప్రజలను హింసించి, పెద్దయ్యే కొద్దీ శాంతుడైన రాజు లాగా, మొదట తన ప్రతాపంతో లోకాన్ని తీవ్రంగా బాధించిన సూర్యుడు సాయంకాలమయ్యేటప్పటికి శాంతుడైనాడు.

**రాముడు:** (*గమనించి*) సూర్యభగవానుడు అస్తమిస్తున్నాడు. దూరదేశం వెళ్ళిన భర్త తిరిగి ఎప్పుడొస్తాడో అని వేళ్ళపైన రోజులు లెక్క

అపి చ,–

> ఆకర్షాత్ ప్రగ్రహాణాం నియమితగతయో నోదితాస్తోత్రపాతై–
> ర్నైవ స్థాతుం న యాతుం సచకితచరణాః సారథేః పారయన్తః।
> దుర్విన్యస్తైః ఖురాగ్రైర్విషమపరిసరాదస్తశైలస్య శృఙ్గా–
> ద్గాహన్తే వారిరాశిం కథమపి విధురా వాజినస్తిగ్మరశ్మేః ॥25॥

*(ఇతి నిష్క్రాన్తాః సర్వే)*

---

పెడుతున్న వధువులవలె, ఈ సరస్సులో పద్మాలు – సూర్యుడు అస్తమిస్తూ ఉండగా – ఒక్కొక్క రేకే ముడుచుకుంటున్నాయి.

ఇంకా – సారథి అనూరుడు కళ్ళాలను లాగినప్పుడు ఆగుతూ, కొరడా విదిలించినప్పుడు పరుగెత్తబోయి, అటు నడవలేక ఇటు నిలువలేక గిట్టలు తడబడుతూండగా అస్తాద్రి నుండి సముద్రంలో ప్రవేశిస్తున్నాయి సూర్యాశ్వాలు.

*(అందరూ నిష్క్రమిస్తారు)*

## **పఞ్చమోఽఙ్కః – ఐదవ అంకము**

(*తతః ప్రవిశతి విదూషకః*)

**విదూషకః:** (నేపథ్యాభిముఖమవలోక్య) *ఆసణ్ణో తవోధణాణం సంపాతసమఓ, తా తువరేదు భవం।*

(నేపథ్యాభిముఖమవలోక్య) ఆసన్నస్తపోధనానాం సమ్పాతసమయః, తత్ త్వరతు భవాన్।

(*తతః ప్రవిశతి రామః*)

**రామః:** సవనమవసితం హుతం కృశానా–
వుదయగతః సముపాసితో వివస్వాన్।
ఇతి విధిమవసాయ్య వాసరాదౌ
నియమధనానహమాగతః ప్రణన్తుమ్ ॥1॥

---

(*విదూషకుడు ప్రవేశిస్తాడు*)

**విదూషకుడు:** (*తెర వైపుకు చూస్తూ*) తపోధనులు సమావేశమయ్యే సమయం ఆసన్నమైంది. కనుక త్వరపడాలి.

(*రాముడు ప్రవేశిస్తాడు*)

**రాముడు:** స్నానాదులు పూర్తైనాయి. అగ్నికార్యం చేయబడింది. సూర్యోపాసన కూడా చేశాను. ఉదయానుష్ఠానకార్యాలు పూర్తి చేసుకుని, తపస్వులకు ప్రణామం చేయడానికి వచ్చాను.

**విదూషకః:** *ఏదం అత్థాణమంటపం, పవిసదు భవం।*

ఏతదాస్థానమణ్టపమ్ ప్రవిశతు భవాన్।

**రామః:** (*ప్రవిష్ట కేన చిన్తాం నాటయన్*) ఆ! ఆశ్చర్యమస్మాకం కిం వృత్తమతీతేఽహని?

> అతిప్రసాదాదసతీవ తస్మిన్
> దృష్టా మయా వారిణి పఙ్కజాక్షీ।
> లమ్బాలకం పాణ్డురపీనగణ్డం
> ప్రసాదరమ్యం వదనం వహన్తీ ॥2॥

అథ వా విలోక్యతే తిలోత్తమయా కృతోఽయం పరిహాస ఇతి।

> తస్యాః స్వహస్తరచితామివ కున్దమాలాం
> సాదృశ్యవన్తి సికతాసు పదాని తాని।

---

**విదూషకుడు:** ఇదే ఆస్థాన మండపం. తమరు ప్రవేశించండి.

**రాముడు:** (*రంగస్థలం మీదకు వస్తాడు, ఆలోచిస్తూనే*) నిన్న పగలు జరిగిందేమిటి? ఆశ్చర్యంగా ఉంది. ఆ నిర్మలజలంలో, దీర్ఘకేశపాశం గలదీ, పాలిపోయినా చక్కని కపోలాలు గలదీ, తామరరేకులవంటి కన్నులు గలదీ, భ్రాంతివలె తోచినదీ అయిన సీతను చూశాను.

ఒకవేళ అది తిలోత్తమ చేసిన అల్లరి పని అనుకుంటే –

ఎంత దివ్యమహిమ ఉన్నా, ఆమె సీత స్వహస్తాలతో అల్లినట్లు, కుందమాలను ఎలా అల్లగలిగింది? నేలపై సీత పదచిహ్నాలను ఎలా

ఛాయాం చ దేవగణికా విదధాతు యేన
రామం కథం స్పృశతి హస్తపటాన్తవాతైః ॥3॥

(*చిన్తాం నాటయతి*)

**విదూషకః:** *ఏసో సచిన్తో విఅ, అజ్జ తా ఉపవిసిఅ నిబ్బన్ధఇస్సమ్ । (ఉపవిశ్య) భో భో వఅస్స, మా తుమం ఏత్థ ఠిదో ఖు కహిం ఠిదో ఖు తుమం ణవమేహసిణిద్ధస్సామలో పరిణద్ధముత్తాహారో అచ్ఛందసముణ్ణద్ధ-దురారోహేణం ఇందనీలమఆణం భవణక్కంభాణం అణ్ణతమో విఅ మమ హిఅఅ విబ్భమం ఉప్పాదేసి । తా ఏదస్స లక్ఖీణివాసభవణస్స సేవాసమఅ సముపాగదసామంతణరిందమహూరసద్దోవగీతస్స అత్థాణకాసారే మండవపుణ్డరీఅస్స కణ్ణిఆమండలే విఅ ఏదస్సిం సింహాసణే మహుమహణ్ణాభికమలకణ్ణిఅ సమారూఢస్స భఅవదో పిదామహస్స మహత్తణం అధిక్ఖిపన్తో ఉవవిట్ఠో హోహి ।*

ఏష సచిన్త ఇవ, అద్య తదుపవిశ్య నిర్బన్ధయిష్యామి । (ఉపవిశ్య) భో భో వయస్య, మా త్వమత్ర స్థితః ఖలు కుత్ర స్థితః ఖలు త్వం నవమేఘస్నిగ్ధ-

---

రూపొందించగలిగింది? నీటిలో సీత నీడను కూడా ఎలా చూపించ-గలిగింది? అయినా, సీత వస్త్రంతో విసరబడిన గాలి కాకపోతే అది రాముడి శరీరాన్ని ఎలా తాక గలిగింది? (*ఆలోచనలో ఉండిపోతాడు*)

**విదూషకుడు:** ఈయన చింతలోనుంచి ఇంకా తేరుకోలేదు. కూర్చొని నేను ఈయనను గట్టిగా అడుగుతాను.

శ్యామలః పరిణద్ధముక్తాహారోఽత్యన్తసమున్నద్ధ-
దురారోహేణామిన్ద్రనీలమయానాం భవనస్తమ్భానామన్యతమ ఇవ మమ
హృదయవిభ్రమముత్పాదయసి। తదేతస్య లక్ష్మీనివాసభవనస్య సేవా-
సమయసముపాగతసామన్తనరేన్ద్రమధురశబ్దోపగీతస్యాస్థానకాసారే
మణ్టపపుణ్డరీకస్య కర్ణికామణ్డల ఇవైతస్మిన్ సింహాసనే మధుమథన-
నాభికమలకర్ణికాసమారూఢస్య భగవతః పితామహస్య మహత్త్వమధి-
క్షిపన్నుపవిష్టో భవ।

**రామః:** యథాహ భవాన్। (*ఉపవిశ్య చిన్తాం నాటయన్*) అద్యాహమభి-
నవసుఖదుఃఖస్య సచేతన ఇవాస్మి సంవృత్తః।

---

(*కూర్చొని*) ఓహో వయస్యా! నవనీలమేఘశ్యామలవర్ణదేహంపై
ముత్యాలహారాలను ధరించి, అధిరోహించనలవికాని ఇంద్రనీలమణి-
స్తంభమువలె నిలిచి నా హృదయాన్ని విభ్రమంలో ముంచుతున్నావు. ఈ
సభాభవనంలో నీ సేవకై వచ్చిన సామంతరాజుల కలకలమూ, గీతవాద్యాల
ధ్వనులతోనున్న ఆస్థానమనే అనే సరస్సు నడుమన తామరపూవువలెనున్న
మంటపము మధ్యన కర్ణికవలె అమర్చిన సింహాసనాన్ని అధిష్టించి,
విష్ణునాభికమలకర్ణికను అధివసించిన బ్రహ్మదేవుని గొప్పదనాన్ని
అధిక్షేపింతువుగాక!

**రాముడు:** అలాగే, నువ్వు చెప్పినట్లే కానీ.

(*చింతాక్రాంతుడై కూర్చొని*) నేడు నేను సుఖదుఃఖాలు రెండింటినీ
అనుభవిస్తున్నాను.

(*ధ్యానమభినీయ హస్తం చ హృదయే నివేశ్య*)

ఆసీదియత్సు దివసేషు నిరస్తజానే–

ర్నైరాశ్యలుప్తమనసో న సుఖం న దుఃఖమ్ ।

ఛాయాదిదర్శనబలాదధునా మనో మే

దుఃఖం సుఖఞ్చ పరిగృహ్య పునః ప్రసూతమ్ ॥4॥

(*చిన్తాం నాటయతి*)

**విదూషకః:** (*నిర్వర్ణ్యాత్మగతమ్*) *అహో! సే సంపదం అభిప్పాఅం లక్ఖఇస్సమ్ ।* (*ప్రకాశమ్*) *భో రాఅం, ఏదే ఆసనకేసరిణో గురుదర-భరువ్వహణజాదపరిస్సమా విఅ ముహవివరవిణిగ్గఅముత్తాకలావచలేన ఫేణధారం ఉవ్వమంతి, తహ తక్కేమి బాహూజుఅలేణ పుఢవీం హిఅఏణ పుఢవీదుహిదరం ఉవ్వహంతో అదీవ గురుఅరో సంవుత్తోత్తి ।*

(*నిర్వర్ణ్యాత్మగతమ్*) అహో! అస్య సాంప్రతమభిప్రాయం లక్షయిష్యే ।

---

(*చేతిని హృదయంపైనుంచుకొని, ధ్యానమగ్నుడై*) సీతను విడిచిపెట్టిన నాటినుండి నాకు సుఖమూ లేదు. దుఃఖమూ లేదు. నీటిలో సీత ప్రతిబింబాన్ని చూశాక నా మనసు సుఖదుఃఖాలతో నిండి పునర్జన్మను దాల్చినది. (*ఆలోచనలో ఉండిపోతాడు*)

**విదూషకుడు:** (*రాముడి తీరును గమనిస్తాడు. తనలో*) ఓహో... ఈయన మనస్సులో ఏమున్నదో తెలుసుకుంటాను.

(*ప్రకాశమ్*) భో రాజన్, ఏత ఆసనకేసరిణో గురుతరభారోద్వహన-జాతపరిశ్రమా ఇవ ముఖవివరవినిర్గతముక్తాకలాపచ్ఛలేన ఫేనధారా-ముద్వమన్తి, తథా తర్క్యయామి బాహుయుగలేన పృథివీం హృదయేన పృథివీదుహితరముద్వహన్నతీవ గురుతరః సంవృత్త ఇతి।

**రామః:** (*ఆత్మగతమ్*) సీతాకథాముపశ్రుత్య కౌశికో నూనం జిజ్ఞాసతే। ఏష బాలమిత్రమ్, తదస్మై యథాస్థితం నివేదయామి। (*ప్రకాశమ్*) వయస్య, అస్త్యేతత్ స్మరామ్యహమవిచ్ఛేదేన వైదేహీమ్।

**విదూషకః:** *కిం దోసదో ఆదు గుణదో?*

కిం దోషత ఉత గుణతః?

---

(*ప్రకాశంగా*) హే రాజా! ఈ ఆసనాన్ని మోస్తున్న సింహాలు వాటి నోటిలో అమర్చిన ముత్యాల సరాలతో, ఎంతో భారాన్ని మోస్తూ అలసట చేత నురుగులు కక్కుతున్నట్లు ఉన్నాయి. వాటిలానే నువ్వు కూడా భుజ-యుగళంతో పృథ్వినీ, హృదయంలో పృథ్వీకుమారినీ ధరించి – గొప్ప భారాన్ని వహిస్తున్నావు.

**రాముడు:** (*తనలో*) సీతను గురించి కౌశికుడు కుతూహలంతో ఉన్నాడు. ఇతడు నా బాల్యమిత్రుడు. కనుక నా మనస్సులోని మాట చెప్పుతాను. (*ప్రకాశంగా*) మిత్రమా, నిరంతరంగా సీతను తలచుకుంటున్నాను.

**విదూషకుడు:** ఆమె దోషాలనా? లేక గుణాలనా?

**రామః:** న దోషతో నాపి గుణతః ।

**విదూషకః:** *ఏదం ఉభయం ఉజ్ఝిఅ కహం సీమన్తిణీఓ సుమరీఅంతి?*

ఏతదుభయముజ్ఝిత్వా కథం సీమన్తిన్యః స్మర్యన్తే?

**రామః:** అన్యదమ్పతీవిషయ ఏవ కారణానురోధీ ప్రేమావేశః, సీతారామయోస్తు న తథా।

> దుఃఖే సుఖేష్వప్యపరిచ్ఛదత్వా–
> దసూచ్యమాసీచ్చిరమాత్మనీవ।
> తస్యాం స్థితో దోషగుణానపేక్షో
> నిర్వ్యాజసిద్ధో మమ భావబన్ధః ॥5॥

---

**రాముడు:** గుణదోషాలను రెండింటినీ కాదు.

**విదూషకుడు:** అవి రెండూ కాక, సీత గురించి ఏమని తలుచుకుంటున్నావు?

**రాముడు:** అన్యదంపతులు కారణాలుంటేనే తలుచుకుంటారు. సీతారాములు అలా కాదు.

సుఖదుఃఖాలలో సువ్యక్తంగా ఉంటుంది కనుక ప్రత్యేకంగా సూచించనక్కరలేనిది, కారణాలతో ప్రమేయం లేనిది, గుణదోషాలను ఎంచనిది అయిన నా అనురాగము నాలో ఉన్నట్లే తనలోనూ ఉంటుంది.

**విదూషకః:** *మా తుమం వైదేహిం అలిఅమహురవఅణేహి అంహారిసం వంచేసి । సో ఖు తుమం దేవిం అన్తరేణ –*

మా త్వం వైదేహీమలీకమధురవచనైరస్మాదృశం వఞ్చయసి । స ఖలు త్వం దేవీమన్తరేణ...

**రామః:** నైవమధ్యవసితం – ఏకాన్తే సీతానిరపేక్షో రామ ఇతి ।

అన్తరితా అనురాగా భావా మమ కర్కశస్య బాహ్యేన ।
తన్తవ ఇవ సుకుమారాః ప్రచ్ఛన్నాః పద్మనాలస్య ॥6॥

**విదూషకః:** *తుమం అదిప్పబలేణ హిఅఅసందావేణ వడవాణలేణ విఅ భఅవం మహాసముద్దో అత్తణో మహత్తణేన పరిహీఅసి, అహం ఉణ సహావలహుదాఏ దేవీఏ సీదాఏ గఇం సుమరిఅ దావాణలేణ విఅ తుసారబిందు ణిరవసేసం పరిసుస్సామి, తా పరిత్తాఏహి మం । (ఇతి రోదితి)*

త్వమతిప్రబలేన హృదయసన్తాపేన వడవానలేనేవ భగవాన్మహాసముద్ర

---

**విదూషకుడు:** నువ్వు వైదేహిని వంచించినట్లు, అసత్యమైన మధురవచనాలతో మాబోంట్లను వంచించకు. నువ్వు సీత లేకుండా...

**రాముడు:** రాముడు సీతపట్ల నిర్లక్ష్యంగా ఉన్నాడని అనుకోవద్దు. ప్రేమ లోపలి వస్తువు. బాహ్యంగా కఠినంగా ఉండే నాలో కోమలభావాలు తామరతూడులోని నాళాలలా లోపలే దాగి ఉంటయి.

**విదూషకుడు:** నీ హృదయంలో ఇంత బాధ ఉన్నా, లోపల బడబానలాన్ని

ఆత్మనో మహత్త్వేన పరిహీయసే, అహం పునః స్వభావలఘుతయా దేవ్యాః సీతాయా గతిం స్మృత్వా దావానలేనేవ తుషారబిన్దుర్నిరవశేషం పరిశుష్యామి, తత్ పరిత్రాయస్వ మామ్। (*ఇతి రోదితి*)

**రామః:** యది త్వం స్మరణయోగ్యాం సీతామవగచ్ఛసి కస్మాదహం తత్పరిత్యాగప్రవృత్తస్తదా న ప్రతిషిద్ధః?

**విదూషకః:** *పసాదసుముహో వి రాఆ దువ్విణ్ణవ్వో సేవఏహిం, కిం ఉణ కోవభీసణో,*

ప్రసాదసుముఖోఽపి రాజా దుర్విజ్ఞాప్యః సేవకైః, కిం పునః కోపభీషణః।

---

దాచుకున్న సముద్రంలా, నీ గొప్పదనం తగ్గకుండా ఉన్నావు. నేనే నా అల్పబుద్ధి కారణంగా, సీత గతిని తలచుకొని దావానలంలో తుషార-బిందువులా ఇగిరిపోతున్నాను. నన్ను కాపాడు. (*ఏడుస్తాడు*)

**రాముడు:** ఒకవేళ సీత యోగ్యురాలనుకుంటే పరిత్యాగ-సమయంలో నువ్వు నన్ను ఎందుకు వారించలేదు?

**విదూషకుడు:** శాంతంగా ఉన్నప్పుడే రాజులకు సేవకులు చెప్పలేరు. ఇక కోపంగా ఉన్నప్పుడు ఎలా?

**రామః:** వయస్య, నహి మాదృశాస్తాదృశీం కోపావస్థామవగాహన్తే, యస్యాం వర్తమానాయాం సుహృదామనాశ్రవా భవన్తి।

నరపతిరధికప్రవృత్తతేజా గుణనిహితైః సచివైర్నివారణీయః।
భువనమభితపన్ సహస్రరశ్మిర్జలగురుభిర్వ్యపనీయతే హి మేఘైః ॥7॥

వయస్య, వర్తమానా సీతాకథా ద్వయోః సన్తాపకారిణీ । తద్గచ్ఛ ప్రతీహారభూమిమ్, సమాజ్ఞాపయ దౌవారికాన్ – సమాసన్నస్తపోధనానాం సమ్ప్రాప్తసమయః, తస్మాత్సమ్భృతవేత్రాణి సర్వద్వారాణి క్రియన్తామ్।

---

**రాముడు:** నాలాంటి వాళ్ళు మిత్రుల మాట వినలేనంత క్రోధావస్థకు ఎప్పుడూ లోనుగారు.

రాజు అనుచితంగా ప్రవర్తిస్తే, నియుక్తులైన సచివులు వారించడం కర్తవ్యం. సంసారాన్ని తపింపజేస్తున్న సూర్యుణ్ణి నీటితో నిండిన మేఘాలు ఆపుతయి గదా!

వయస్యా! ఇప్పటి సీతా వృత్తాంతం మనిద్దరికీ సంతాపకారణం. కనుక ద్వారప్రదేశానికి వెళ్ళి దౌవారికులకు (ద్వారపాలకులకు) చెప్పు. తపస్వులు విచ్చేసే సమయం ఆసన్నమైంది. దౌవారికులందరూ వేత్రహస్తులై ద్వారాల వద్ద సావధానులై ఉండాలి. తపస్వుల రాకపోకలకు ఎటువంటి కష్టమూ కలుగకూడదు. అలాగే ఇతరులు లోనికి రాకూడదు.

**విదూషకః:** *భో రాఅ, కీస ఉణ ఏదే కందమూలఫలాసిణో వక్కలపరిధాణా ఉద్దండదండధరా ఈరిసేణ ఆఆరేణ సంభావిఅన్తి?*

భో రాజన్ కీదృశాః పునరేతే కన్దమూలఫలాశినో వల్కలపరిధానా ఉద్దణ్డదణ్డధరా ఈదృశేనాచారేణ సమ్భావ్యన్తే?

**రామః:** అస్థానేఽయమత్రభవతః సన్దేహః। నను మూలస్వయోగ-మూలసకలపురుషార్థసంవేదినీ జ్ఞాననిష్పత్తిః। పశ్య –

జ్యోతిః సదాభ్యన్తరమాప్తపాదై–
రదీపితం నార్థగతం వ్యనక్తి ।
నాలం హి తేజోఽప్యనలాభిధానం
స్వకర్మణో మారుతమన్తరేణ ॥8॥

---

**విదూషకుడు:** ఓ రాజా! కందమూలాలు తినేవాళ్ళూ, చెట్ల బెరడుతో చేసిన వస్త్రాలను ధరించేవారూ, దీర్ఘదండధారులూ అయిన ఈ తపస్వులకు ఇంత గౌరవ మర్యాదలెందుకు?

**రాముడు:** నీ సందేహం సరి కాదు. ఆత్మ పరమాత్మలను కలిపేదే సకలపురుషార్థాల సారం. ఆ జ్ఞానం వాళ్ళ దగ్గరే ఉంది.

మనలో వెలుగుతున్న ఆత్మరూపబ్రహ్మ, జ్ఞానుల చేత బోధింపబడక ప్రకాశించలేదు. అగ్ని కూడా వాయువు సహాయం లేనిదే దహించలేదు.

**విదూషకః:** జది మహత్థో తపోధణాణాం సమాఅమో, అహ అ లహు గచ్ఛిఅ జహాఆణత్తి సంపాదేమి। (*నిష్క్రమ్య పునః ప్రవిశ్య*) హీ హీ భో సంపదం రాఇణో ఆణ్ణాఏ పడిహారణిక్ఖిత్తేణ దిట్ఠా సుసిణిద్ధసామలచ్ఛాఆ, అణుబ్భిణ్ణతారుణ్ణవిగ్గహో, తోరణత్థంభవత్థిదా, మంగలంకురా విఅ బాలభావేణ, అసమత్తపమాణా విఅ, అప్రమాధా విఅ, కందప్పదారఆ విఅ రుపసోబ్భగేణ, ఉచ్చదరా సాలతరు విఅ, పప్పందా విఅ, లోలదరా విఅ, మహాబలా విఅ అచంతధీరా విఅ, అచ్చందలలిదా విఅ, అసంఖేపిదా విఅ, వఅస్సస్స కలాదంసణా ఆగదా దువే తాపసకుమారఆ।

యది మహార్థస్తపోధనానాం సమాగమః, అహం చ లఘు గత్వా యథాజ్ఞప్తి సమ్పాదయామి। (*నిష్క్రమ్య పునః ప్రవిశ్య*) హీ! హీ! భో! సామ్ప్రతం మయా రాజ్ఞ ఆజ్ఞయా ప్రతీహారనిక్షిప్తేన దృష్టౌ సుస్నిగ్ధశ్యామలచ్ఛాయౌ, అనుద్భిన్నతారుణ్యావిగ్రహౌ, తోరణస్తమ్భావస్థితౌ, మఙ్గలాఙ్కురావివ బాలభావేన, అసమాప్తప్రమాణావివ, అప్రమాదావివ, కన్దర్పదారకావివ రూపసౌభాగ్యేన, ఉచ్చతరౌ సాలతరూ ఇవ, ప్రస్పన్దావివ, లోలతరావివ, మహాబలావివ, అత్యన్తధీరావివ,

---

**విదూషకుడు:** తపోధనుల సమాగమం అంత అమూల్యమైనదైతే, నేను త్వరగా వెళ్ళి, మీరు ఆజ్ఞాపించినట్లే చేస్తాను.

(*నిష్క్రమిస్తాడు. తిరిగి వచ్చి, ఇకిలిస్తూ*) రాజాజ్ఞతో ద్వారప్రదేశానికి వెళ్ళిన నేను, అక్కడ, స్నిగ్ధశ్యామలవర్ణులూ, కౌమారవయస్కులూ, మంగళాకారులూ, బాల్యచాపల్యాన్ని వదలని వాళ్ళూ,రూపసౌందర్యాలలో

అత్యన్తలలితావివ, అసంక్షేపితావివ, వయస్యస్య కలాదర్శనావాగతౌ ద్వౌ తాపసకుమారకౌ।

**రామః:** (సాకూతమ్) కస్తయోరస్మన్నయనసీమావతరణప్రతిబన్ధః?

**విదూషకః:** సుణాహి దావ ఏదాణం బాలభావలలిదాణం కోఊహల–సంబద్ధాణం ఏదం ఉవంణాసమ్।

శృణు తావదేతయోర్బాలభావలలితయోః కౌతూహలసమ్బద్ధయో-రేతముపన్యాసమ్।

**రామః:** కథయ కథయ।

**విదూషకః:** *తే కిల భఅవదో వమ్మీఇమ హేసిణో సిస్సా పవీణా వీణాకలా-విణ్ణాణేఅపువ్వం కిల ఆఅమం ధారింతి। ఏదే కిల ఏవ్వం వదంతి –*

---

కందర్పసంతానంలా ఉన్న వాళ్ళూ, సాలవృక్షాలలా ఉన్నత విగ్రహులూ,చంచలస్వభావులూ, విశాలమనస్కులూ వలె ఉన్న తాపసకుమారులు ఇద్దరు, మిత్రుడికి తమ కళను ప్రదర్శించటం కోసం వచ్చి తోరణస్తంభం దగ్గర నిలుచుని ఉండటం చూశాను.

**రాముడు:** (*నొక్కి పలుకుతూ*) వాళ్ళు నాకళ్ళ ముందుకు రావడానికి ఏమిటి ప్రతిబంధం?

**విదూషకుడు:** వాళ్ళగురించి ఇంకా విను. బాలభావలలితులూ, కుతూహలాన్ని కలిగించే మాటలు చెప్పారు.

**రాముడు:** చెప్పు!

*"రాఏసిణోజణాణం తపోధణబహుమాణేణ అహ్లాణం విఅ భూట్ఠాణం ఆసణం పదాణం అ అణుచిట్ఠిదవ్వం జదా అం హే మందభద్దస్స దీఅఇ రాదలలఅ దుక్కరవిణ్ణాసం మహాకఇసంగధితమహాపురుసచరిత్తబంధం మహన్థగంభీరం కేణ వి అస్సుదపువ్వం ఆఅమం గంధవ్వవేదసంవాది సరసం జోఅవిరఇఅవణ్ణరమణీఅఅం వీణాతంతిరసిదాణువిద్ధం గీదం గాఅంహ్మా, తదా విణ్ణాణవి సేసపసణ్ణహిఅఓ రాఆ జం వుత్తంతం అణుచిట్ఠస్సది ఏసో జాణిదంవోత్తి అహ్మాణం భఅవదో వంమీఇమ హేసిణో ఆదేసోత్తి" ।*

తౌ కిల భగవతో వాల్మీకిమహర్షేః శిష్యౌ ప్రవీణౌ వీణాకలావిజ్ఞానేఽపూర్వే కిలాగమం ధారయతః। ఏతౌ కిలైవం వదతః –"రాజర్షేర్జనానాం తపోధనబహుమానేనాస్మాకమివ భూస్థానమాసనం... అనుష్ఠాతవ్యమ్... ... దుష్కరవిన్యాసం మహాకవిసగ్ర్థితమహాపురుషచరిత్రబన్ధం మహార్థ-గమ్భీరం కేనాప్యశ్రుతపూర్వమాగమం గాన్ధర్వవేదసంవాది సరసం

---

వాళ్ళు వాల్మీకిమహర్షి శిష్యులట. వీణావాదనకళలోఅపూర్వమైన నైపుణ్యం ఉన్నవారట. వాళ్ళు ఇలా చెప్పారు. 'రాజర్షిపరివారము తపోధనులకు ఇచ్చే గౌరవానికి అనుగుణంగా మేము నేల మీద కూర్చోవాలి. దుష్కరమైన పదవిన్యాసముతో ఉన్నటువంటిది, మహార్థగంభీరమైనది, ఇతఃపూర్వం ఎవరూ విననిదీ, సంగీతాత్మకమైనది, వీణావాదనసహితమైనది, యోగమహిమచేత కూర్చబడ్డ అక్షర-రామణీయకాన్ని కలిగి ఉన్నది, మహాకవి వాల్మీకిభగవానులు రచించినది

యోగవిరచితవర్ణరమణీయకం వీణాతన్త్రీరసితానువిద్ధం గీతం గాయావః, తదా విజ్ఞానవిశేషప్రసన్నహృదయో రాజా యద్వృత్తాన్తమనుష్ఠాస్యతి ఏష జ్ఞాతవ్య ఇత్యస్మాకం భగవతో వాల్మీకిమహర్షేరాదేశః—ఇతి।

**రామః:** అహో! విజ్ఞానావలేపః శౌణ్డీర్యగర్భశ్చోపన్యాసః। వయస్య! యథాభిమతం ప్రతిజ్ఞాయ ప్రవేశయావిలమ్బితం పురా తౌ న చిరావస్థాన-నిర్వేదేన పరాఙ్ముఖీభవతః।

**విదూషకః:** *కుదో దాణిం ణివ్వేదో? తే హి అణ్ణోణ్ణవచ్ఛలత్తణం ఆఆరసారిచ్ఛం కాఅపక్ఖపరిభూసిదం చ వఅణం పేక్ఖిఅ – ఏవ్వం రామలక్ఖణా మహారాఅదసరహే ధరమాణే రాఅత్తాణం అలంకరంత్తా భవంతి – త్తి తుహ్మాణం బాలభావం మహారాఅం అ సుమరిఅ బప్ఫపుణ్ణణఅణేహిం సోవిదల్లఏహిం పరిపుట్టా చిట్ఠంతి।*

కుత ఇదానీం నిర్వేదః? తౌ హి అన్యోన్యవత్సలత్వమాకారసాదృశ్యం కాకపక్ష పరిభూషితం చ వదనం ప్రేక్ష్య 'ఏవం రామలక్ష్మణౌ మహారాజ

---

అయిన మహాపురుష చరిత్రమును మేము పాడుతాము. తరువాత మేము ఈ రచనమీద మహారాజు అభిప్రాయం తెలుసు కోవాలి అని మహర్షి ఆజ్ఞ.'

**రాముడు:** ఆహా, వీరి కళాభిమానం! మిత్రమా! వారికి ఇష్టమైనట్లే జరుగుతుందని చెప్పి, త్వరగా ప్రవేశపెట్టవయ్యా. వాళ్ళు చాలాసేపు నిరీక్షించి నిరాశతో తిరిగి వెళ్ళిపోతారేమో!

దశరథే ధ్రియమాణే రాజస్థానమలఙ్కుర్వన్తావభూతామ్' – ఇతి యువయోర్బాలభావం మహారాజం చ స్మృత్వా బాష్పపూర్ణనయనైః సౌవిదల్లైః పరిపృష్టౌ తిష్ఠతః।

**రామః:** కిమస్మచ్ఛైశవానుకారిణీ తయోరాకృతిః?

**విదూషకః:** *అహ ఇం।*

అథ కిమ్।

**రామః:** వర్ధతే మే కుతూహలమ్, తత్ప్రవేశయావిలమ్బితమ్।

---

**విదూషకుడు:** ఇక విచారమెందుకు? ఈ మునిబాలకుల అన్యోన్యప్రేమ, ఆకారాల పోలికలు, కూకటిజుట్టుతో ఉన్న అందమైన ముఖాలు చూసి, ఇలాగే దశరథమహారాజు జీవించి ఉన్నప్పుడు బాల్యంలో రామలక్ష్మణులు రాజాస్థానానికి వచ్చినప్పటి సంగతులు తలుచుకుంటూ కంచుకులు కంటతడి పెట్టుకుంటున్నారు.

**రాముడు:** మేము బాల్యంలో ఉన్నప్పటిలాగా ఉన్నయ్యా వాళ్ళ ఆకృతులు?

**విదూషకుడు:** ఔను మరి. కాక మరేమిటి?

**రాముడు:** నాకు కుతూహలం పెరిగిపోతున్నది. ఇక ఆలస్యం చెయ్యకుండా వాళ్ళను ప్రవేశపెట్టు.

**విదూషకః:** *జం భవం ఆణవేది ।* (*ఇతి నిష్క్రాన్తః*)

యద్భవానాజ్ఞాపయతి । (*ఇతి నిష్క్రాన్తః*)

(*తతః ప్రవిశతో విదూషకేణోపదిశ్యమానమార్గౌ తాపసౌ కుశలవౌ*)

**విదూషకః:** ఇదో ఇదో అంఆ ।

ఇత ఇత ఆర్యౌ ।

(*పరిక్రమ్య*)

**కుశః:** (*అపవార్య*) వత్స లవ! ఇదానీం భగవతో వాల్మీకేరాదేశాదమ్బా-మభివాద్య పార్థివభవనాభిముఖం ప్రస్థితే మయి కాకపక్షగ్రహణసంజ్ఞయా పర్ణశాలాయాం ప్రవేశ్య కీదృశేన రహస్యేనామ్బయా పృథక్ సంవిభక్తో భద్రముఖః?

---

**విదూషకుడు:** మీ ఆజ్ఞ! (*నిష్క్రమిస్తాడు*)

(*విదూషకుడి వెంట తాపసవేషంలో కుశలవులు ప్రవేశిస్తారు*)

**విదూషకుడు:** ఇటు, ఇటు అయ్యలారా!

(*ముందుకు నడిచి*)

**కుశః:** (*లవుణ్ణి పక్కకు పిలిచి*) వత్సా లవా! మనం వాల్మీకిభగవానుల వారి ఆదేశానుసారం, అమ్మకు నమస్కరించి బయలుదేరినప్పుడు, అమ్మ నీ కూకటిజుట్టును లాగటం ద్వారా సంజ్ఞ చేసి నిన్ను కుటీరంలోకి తీసుకుని వెళ్లి నీకు రహస్యంగా ఏమని ఉపదేశించింది?

**లవః:** న ఖలు కశ్చిత్సంవిభాగః। కిన్తు తదానీం తాపసజన-సఙ్కీర్ణముటజాభ్యన్తరం ప్రవిశ్య బాహూపపీడం తనూదరేణ పరిష్వజ్య శిరసి చాఘ్రాయ సీత్కారలక్షితస్మితమధురం సాశఙ్కా శనైః శనైః కర్ణపత్రం వర్ధయన్తీ స్వముఖేన మన్ముఖమపవార్యైవం సన్దిష్టవతీ – "వత్స! యువాభ్యాం స్వాభావికమవలేపం పరిత్యజ్య సత్కర్తవ్యో మహారాజః, కుశలఞ్చ పరిప్రష్టవ్యమ్" – ఇతి।

**కుశః:** యుజ్యతే కుశలప్రశ్నః, ప్రణామస్తు కథమ్?

**లవః:** న కథమ్?

**కుశః:** అప్రణన్తారః కిలాస్మద్వంశ్యాః।

---

**లవుడు:** ప్రత్యేకంగా ఏమీ చెప్పలేదు. నన్ను ఆలింగనం చేసుకుని భుజాలు వత్తుతూ, శిరస్సునాఘ్రాణించి మందహాసం చేస్తూ, మృదువుగా కర్ణభూషణాన్ని పక్కకు తప్పిస్తూ, నా ముఖాన్ని చేతులలోకి తీసుకొని మధురంగా ఇలా అన్నది. 'నాయనా! మీకు స్వభావసిద్ధమైన అభిమానాన్ని వదిలి, మహారాజును గౌరవించండి. క్షేమసమాచారాలు అడగండి.' అని.

**కుశుడు:** కుశలప్రశ్నలవరకూ సరేగానీ ప్రణామం చెయ్యడమెలా?

**లవుడు:** ఎలా అంటే?

**కుశుడు:** మన వంశంలో పుట్టినవాళ్ళు ఎవరికీ ప్రణామం చెయ్యరు గదా?

**లవః:** క ఏవమాహ?

**కుశః:** అమ్బా।

**లవః:** ప్రణామమపి సైవోపదిష్టవతీ న చ గురునియోగా విచారమర్హన్తి।

**కుశః:** సాధయామస్తావత్, అగ్రతస్తత్ర యత్కాలోచితమనుష్ఠాస్యావః।

(*పరిక్రామతః*)

**విదూషకః:** *ఇదో ఇదో అంఆ।*

ఇత ఇత ఆర్యౌ ।

---

**లవుడు:** ఎవరు చెప్పారలా?

**కుశుడు:** అమ్మ.

**లవుడు:** ప్రణామం చెయ్యడం కూడా అమ్మే నేర్పింది గదా! పెద్దలు చెప్పిన మాటలను విమర్శించకూడదు.

**కుశుడు:** సరే వెళ్దాం. సమయానుకూలంగా చేద్దాం.

(*ముందుకు సాగుతారు*)

**విదూషకుడు:** ఇటు, ఇటు ఆర్యులారా!

**రామః:** (విలోక్య) నూనం తదేవైతద్దారకద్వయం కౌశికేనోపదిశ్య-మానమార్గమిత ఏవాభివర్తతే। కథమస్మ్యాయితోఽస్మి। కిన్ను ఖల్వేతత్।

న చైతదభిజానామి నాకూతమపి కిఞ్చన।
తథాప్యాపాతమాత్రేణ చక్షురుద్బాష్పతాం గతమ్ ॥9॥

అథ వా కిమత్రాశ్చర్యమ్ –

ఆపాతమాత్రేణ కయాపి యుక్తయా
సమ్బన్ధినః సన్నమయన్తి చేతః।
విమృశ్య కిం దోషగుణానభిజ్ఞ–
శ్చన్ద్రోదయే శ్చ్యోతతి చన్ద్రకాన్తః ॥10॥

---

**రాముడు:** కౌశికుడు తీసుకుని వస్తున్న బాలకులు ఇటే వస్తున్నారు. నా మనస్సు ఎందుకు ఎటో వెళ్లిపోతున్నది!

వీళ్ళను గురించి నాకేమీ తెలియదు. తెలుసుకోవాలని కూడా లేదు. అయినా వీళ్ళను చూడగానే నా కళ్ళు ఎందుకు చెమరుస్తున్నాయి?

అయినా ఆశ్చర్యమేముంది?

మనకు అయిన వాళ్ళు కలిస్తే, వాళ్ళెవరో తెలియకపోయినా మనస్సు స్పందిస్తుంది. చంద్రకాంతమణి, గుణదోషాలు తెలియకపోయినా చంద్రకిరణాలు సోకగానే కరిగిపోతుంది కదా!"

నిర్వర్ణయామి తావత్కిమాకారావేతావితి। కథం ద్రష్టుమపి న ప్రభవామి? యథా యథా కుమారావేతౌ నిర్వర్ణయామి తథా తథా హృదయమప్యననుభూతపూర్వేణ సాధ్వసప్రహర్షశోకానుక్రోశసమ్భేద-చిత్రేణావస్థావిశేషేణాక్రమ్యమాణం మూర్ఛయేవ తిరోధీయతే। (*మూర్ఛామభినీయ*) బాష్పపాతశ్చ కథమ్! ప్రశాన్త ఇవ మే హృదయ-స్తమ్భో బాష్పపాతనే; స్వస్థీభూతోఽస్మి సంవృత్తః। ఏతద్వ్యపనీత-బాష్పవ్యవధానేన చక్షుషా పునరవలోకయామి।

(*నిర్వర్ణ్య*) గమ్భీరోదారః సన్నివేశః, ప్రశాన్తమనోహరా వేషరచనా, వినయోదయోదాత్తమభిక్రాన్తమ్, సువ్యక్తమనేన యుగలేన కులీనేన భవితవ్యమ్।

---

వీళ్ళ ఆకారాలు ఎలా ఉన్నాయో చూస్తాను. చూడటం కూడా కష్టంగానే ఉన్నది. వీళ్ళను చూస్తుంటే పూర్వం ఎన్నడూ కలుగని అనుభూతి కలుగుతున్నది.

ఎప్పుడూ కలుగని భయహర్షకరుణాది విచిత్రావస్థలు కలగాపులగంగా కలుగుతున్నాయి. మూర్ఛ వస్తున్నది. కన్నీళ్ళు ఆగటంలేదు. పట్టేసిపోయినట్లున్న నా హృదయం ఈ కన్నీటివల్ల శాంతిని పొందుతున్నది. స్వస్థత చేకూరినట్లున్నది నాకు. అశ్రువులు తుడుచుకొని చూస్తాను.

ఆహా! ఆ శరీరవిన్యాసం, గంభీరోదారవేషధారణ. శాంతంగా మనోహరంగా ఉన్నారు. వీళ్ళు తప్పకుండా కులీనులై ఉంటారు.

**విదూషకః:** *ఏసో అత్తభవం రాఆ, ఉపసప్పదు అంఆ జహోహిప్పాఅం।*

ఏషోఽత్రభవాన్ రాజా, ఉపసర్పతామార్యౌ యథాభిప్రాయమ్।

**కుశః:** వత్స లవ! అపి జానాసి త్వం సమ్ప్రత్యేవ ప్రణామసమ్బన్ధేన యథా మయా కథితమ్?

**లవః:** అథ సమ్ప్రతి కిమ్?

**కుశః:** యథా యథైనం పార్థివం ప్రత్యాసీదామి తథా తథా హృదయోత్కమ్పకారిణా సాధ్వసేన న ప్రభవామి స్వాఙ్గానామ్, పరిత్యక్తోఽస్మి కస్మాత్తుల్యాఽవలేపేన? న శక్నోమి చాస్య పురస్తాదనవ-నతముత్తమాఙ్గముద్వోఢుమ్, కిం బహునా ఏష ప్రణతోఽస్మి।

**లవః:** కథమార్యోఽప్యహమివ పరమవశత్వమాపాదితః।

---

**విదూషకుడు:** వీరే పూజ్యమహారాజు. మీరు సమీపించవచ్చు.

**కుశుడు:** వత్సా! ప్రణామం విషయంలో చెప్పింది గుర్తుంది కదా?

**లవుడు:** అయితే ఇప్పుడేం చేద్దాం?

**కుశుడు:** మహారాజును సమీపిస్తున్న కొద్దీ నా హృదయం కంపిస్తున్నది. నన్ను నేను అదుపు చేసుకోలేకపోతున్నాను. నా స్వభావ-సిద్ధమైన అభిమానాన్ని వదిలేస్తున్నాను. మహారాజు ముందు శిరస్సు పైకెత్తి నిలబడలేకపోతున్నాను. వేయేల? ఇదుగో ప్రణామం చేస్తున్నాను.

**లవుడు:** అన్నగారి లాగే నేనూ పరవశుడనై పోతున్నాను.

*(ఉభౌ ప్రణమతః)*

**రామః:** న ఖలు భవద్భ్యాం మర్యాదాలఙ్ఘనమనుష్ఠేయమ్। కథం ప్రణతావేవ? కష్టం బ్రహ్మశిరసా నతోఽస్మి। *(విషాదం నాటయతి)*

**విదూషకః:** *భో తువం కిం విసణ్ణో? ఏదేహి పఉత్తో పణామో ణ పడిగహీదో, ఏత్థ ణ తుమం పరిహీయసి।*

భో త్వం కిం విషణ్ణః? ఏతాభ్యాం ప్రయుక్తః ప్రణామో న ప్రతిగృహీతః, అత్ర న త్వం పరిహీయసే।

**రామః:** సమ్యగుపలక్షితం కౌశికేన। ఆర్యావతిదాక్షిణ్యపేశలౌ, శ్రూయతామ్ –

---

*(ఇద్దరూ నమస్కరిస్తారు)*

**రాముడు:** మీరిలా మర్యాదను అతిక్రమించకూడదు. ఎందుకిలా ప్రణమిల్లుతున్నారు? అయ్యో! బ్రహ్మశిరస్సుల చేత ప్రణామం చేయించుకున్నానే. (*దిగులు పడతాడు*)

**విదూషకుడు:** అయ్యా! ఎందుకు విషాదం? మీరు వీరి ప్రణామాన్ని స్వీకరించలేదు కదా! దీనివల్ల మీకు పాపం రాదు.

**రాముడు:** కౌశికుడు సరిగానే ఆలోచించాడు. వీళ్ళు ఇద్దరూ శిష్టాచారపరులు. అయితే వినండి.

అయం భవద్భ్యామతిసమ్భ్రమేణ
మయి ప్రయుక్తః శిరసా ప్రణామః।
భవత్వదానీం మదనుజ్ఞయైవ
యుష్మద్గురూణాం చరణోపహారః ॥11॥

**విదూషకః:** *అప్పడిహదసాసణో పిఅవఅస్సో । ఏస పణామస్స పరిణామోత్తి ।*

అప్రతిహతశాసనః ప్రియవయస్యః – ఏషప్రణామస్య పరిణామః – ఇతి ।

**కుశలవౌ:** (*ఉత్థాయ*) అపి కుశలం మహారాజస్య?

**రామః:** యుష్మద్దర్శనాత్కుశలమివ । భవతోః కిం వయమత్ర కుశలప్రశ్నస్య భాజనమ్, న పునరతిథిభాజనస్య సముచితస్య కణ్ఠగ్రహస్య?

(*పరిష్వజ్య*) అహో హృదయగ్రాహీ స్పర్శః ।

---

మీరిద్దరూ తొందరపాటులో నాకు చేసిన ప్రణామాన్ని నేను మీ గురుదేవులకు సమర్పిస్తున్నాను.

**విదూషకుడు:** ప్రియమిత్రుడి వచనం అప్రతిహతం. ప్రణామానికి ఇది ఉచితమైన చేష్ట.

**కుశలవులు:** (*పైకి లేచి*) మహారాజునకు క్షేమమా?

**రాముడు:** మీ దర్శనంవల్ల కుశలమే. కేవలం కుశలప్రశ్నలేనా? ఆలింగనం చేసుకోవద్దా?

(*కౌగిలించుకొని*) ఆహా! హృదయాన్ని కదిలించే స్పర్శ.

*(విచిన్త్య)* అనభిజ్ఞో౽హం తనయపరిష్వఙ్గసౌఖ్యస్య, యద్యపి తాం తులామారోహే। స్థానే ఖలు పరిక్రామన్తి తపోవనపరాఙ్ముఖా గృహమేధినః। (*ఆసనార్ధముపవేశయతి*)

**ఉభౌ:** రాజాసనం ఖల్వేతత్ న యుక్తమధ్యాసితుమ్।

**రామః:** సవ్యవధానం న చారిత్రలోపాయ, తస్మాదఙ్కవ్యవహిత-మధ్యాస్యతాం సింహాసనమ్। (*అఙ్కముపవేశయతి*)

**ఉభౌ:** (*అనిచ్ఛాం నాటయతః*) రాజన్, అలమతిదాక్షిణ్యేన।

**రామః:** అలమతిశాలీనతయా।

---

(*ఆలోచించి*) పుత్రగాత్రపరిష్వంగసుఖం నేను ఎరుగను. కానీ ఇది దాదాపు అలాగే అనిపిస్తున్నది. అందుకేనేమో గృహస్థులు తపోవనాలకు దూరంగా ఉంటారు. (*తన ఆసనంలో సగం చోటునిచ్చి కూర్చోబెడతాడు*)

**కుశలవులు:** ఇది రాజాసనం. ఇక్కడ మేము కూర్చోకూడదు.

**రాముడు:** నా ఒడిలో కూర్చుంటే సింహాసనానికి అమర్యాద కాదు. (*ఒడిలో కూర్చోబెట్టుకుంటాడు*)

**కుశలవులు:** (అనిష్టంగా) రాజా! ఇంత ఔదార్యం వద్దు.

**రాముడు:** అతిగా సంకోచించకండి.

భవతి శిశుజనో వయోఽనురోధా–

ద్గుణమహతామపి లాలనీయ ఏవ।

వ్రజతి హిమకరోఽపి బాలభావా–

త్పశుపతిమస్తకకేతకచ్ఛదత్వమ్ ॥12॥

(*సాస్రమవలోకయన్ పునః పరిష్వజతే*)

(*విదూషకమవలోక్య*) అపి స్మరతి భవాన్ నిర్వాసితాయాః సీతాయాః కియన్తః సంవత్సరా అతిక్రాన్తా ఇతి?

**విదూషకః:** (*విచిన్త్య*) *సుమరామి మందభాఓ,*

(*హస్తాఙ్గులిప్రమాణసఙ్ఖ్యాం విగణయ్యోపరిష్టాత్పదాఙ్గులిత్రయమపి నిర్దిశ్య*) *కిం బహుణా గణిదేణ, సవ్వహో అజ్జ దసమో సంవచ్ఛరో దేవీఏ సీదాఏ సహత్థేణ పరిప్పేసిదాఏ।*

(*విచిన్త్య*) స్మరామి మన్దభాగ్యః,

---

బాలురు బాల్యావస్థవల్ల పెద్దలచేత లాలించబడటానికి యోగ్యులౌతారు. బాలచంద్రుడనేగదా శివభగవానుడతనిని శిరస్సుపై మొగలిరేకువలె అలంకరించుకున్నాడు. (*నీరు నిండిన కళ్ళతో చూస్తూ మళ్ళీ వాళ్ళను కౌగిలించుకొన్నాడు*)

(*విదూషకుడి వైపుకు తిరిగి*) సీతను విడిచి ఎన్నిసంవత్సరాలయిందో జ్ఞాపకం ఉన్నదా?

**విదూషకుడు:** (ఆలోచించి) ఆఁ, గుర్తుంది. (*చేతి వేళ్ళను లెక్కించి,*

(*హస్తాఙ్గులిప్రమాణసఙ్ఖ్యాం విగణయ్యోపరిష్టాత్పాదాఙ్గులిత్రయమపి నిర్దిశ్య*) కిం బహునా గణితేన సర్వథాద్య దశమః సంవత్సరో దేవ్యాః సీతాయాః స్వహస్తేన పరిప్రేషితాయాః।

**రామః:** (*కుమారౌ నిర్వర్ణ్య*) యది స్వస్తినా గర్భమపి నిర్వర్తయేత్, యది కశ్చిదవగాహేత తదపత్యమియతా కాలేనేదృశీమవస్థామ్।

**విదూషకః:** హన్త! తంభిదో మ్హి మన్దభాఓ ఏదాఏ అణ్ణాదవిప్పఉత్తతణఅ సంకహాఏ। (*రోదితి*)

హన్త! స్తమ్భితోఽస్మి మన్దభాగ్య ఏతయా అజ్ఞాతవిప్రయుక్తతనయ-సఙ్కథయా। (*రోదితి*)

**రామః:** అహమప్యేతౌ తాపసకుమారావవలోకయన్ అసహ్యావేదనా-మవస్థామవతీర్ణోఽస్మి ।

---

*ఆపైన కాలి వేళ్ళను మూడింటిని లెక్కించి*) ఎందుకు గణించటం? నీ స్వహస్తాలతో సీతను పంపించి ఇది పదో ఏడు.

**రాముడు:** (*కుశలవులను పరీక్షగా చూస్తూ*) ప్రసవం సరిగా జరిగి సంతానం జీవించి ఉంటే ఇప్పుడీ వయస్సులోనే ఉండేవారు కదా!

**విదూషకుడు:** అయ్యో! మందభాగ్యుడిని. తెలియకుండానే కొడుకు నుంచి దూరమైన తండ్రి కథను వింటూ నిశ్చేష్టితుడనైపోయాను. (*ఏడుస్తాడు*)

**రాముడు:** నేను కూడా ఈ మునికుమారులను చూసి భరించలేని

యాం యామవస్థామవగాహమాన–
ముత్ప్రేక్షతే స్వం తనయం ప్రవాసీ ।
విలోక్య తాం తాఞ్చ గతం కుమారం
జాతానుకమ్పో ద్రవతాముపైతి ॥13॥

(*పరిష్వజ్య రోదితి*)

**విదూషకః:** (ససమ్భ్రమమ్) *అవిహా ముంచ, సప్పం, ముంచ, జీవదు తవస్సితణఓ, ఓదరదు సింహాసణాదో।*

(ససమ్భ్రమమ్) అవిధా ముఞ్చ, సర్పః, ముఞ్చ, జీవతు తపస్వితనయః, అవతరతు సింహాసనతః ।

**రామః:** (*ససమ్భ్రమం కుమారౌ ముఞ్చన్*) వయస్య, కిమేతత్?

---

వేదనావస్థలో పడ్డాను.

దూరదేశంలో ఉన్న వారు తమ పుత్రుల ఎదుగుదలను ఊహించుకుంటూ, ఆ ప్రాయంవాళ్ళు ఎవరైనా ఎదురైతే ప్రేమభావంతో కరిగిపోతారు. (*కౌగిలించుకొని ఏడుస్తాడు*)

**విదూషకుడు:** (*సంభ్రమంగా*) ప్రమాదం, ప్రమాదం, వదిలిపెట్టు. మునికుమారులు జీవించాలి. సింహాసనం మీద నుండి దిగండి, త్వరగా, త్వరగా.

**రాముడు:** (*తత్తరపడుతూ, కుశలవులను వదిలిపెడుతూ*) మిత్రమా, ఏమిటిది?

**విదూషకః:** *సుదం మఏ సాకేదణివాసిణం చిరజీవిఆణం ముహాదో– జో కిల అరాహవో ఇమం సింహాసణం అదిరోహది తస్స ముద్ధా సదహా సదహా విదలదిత్తి ।*

శ్రుతం మయా సాకేతనివాసినాం చిరజీవితానాం ముఖతః– యః కిలారాఘువ ఇమం సింహాసనమధిరోహతి తస్య మూర్ధా శతధా శతధా విదలేదితి।

**రామః:** (సావేగమ్) అవతీర్యతాం శీఘ్రమ్।

(*ఉభావవతీర్య భూమావుపవిశతః*)

**రామః:** అపి స్వస్థౌ భవన్తౌ, మూర్ధ్నో వా న కిఞ్చిద్వికారః?

**ఉభౌ:** భోః స్వస్థావేవావామ్, న కిఞ్చిన్మూర్ధ్నో వికారః।

---

**విదూషకుడు:** సాకేతవాసులైన వృద్ధుల వల్ల విన్నదేమిటంటే, రఘుకులం వారు తప్ప ఇతరులు ఈ సింహాసనం మీద కూర్చుంటే వాళ్ళ తలలు పగిలి నూరు వక్కలౌతయ్యని.

**రాముడు:** (కంగారుగా) దిగేయండి, తొందరగా.

(ఇద్దరూ నేలపైన కూర్చుంటారు)

మీరు బాగున్నారు కదా! తలలో ఏమైనా బాధగా ఉన్నదా?

**కుశలవులు:** మేం బాగానే ఉన్నాం. తలలో ఏమీ వికారం లేదు.

**విదూషకః:** *అహో అచ్చరిఅం అచ్చరిఅం! ఏవం ణామ అవరిక్ఖద-పఇదిత్థసరీరా చిట్ఠంతి ।*

అహో ఆశ్చర్యమాశ్చర్యమ్! ఏవం నామాపరిక్షతప్రకృతిస్థశరీరౌ తిష్ఠతః।

**రామః:** కిమత్రాశ్చర్యమ్ (*కుమారౌ నిర్దిశ్య*) స్వస్త్యయనపరిగృహీతాని తపశ్శరీరాణి । పశ్య –

> అపి నామ శరా మోఘాస్తపస్సన్నద్ధమూర్తిషు ।
> వాసవస్యాపి సువ్యక్తం కుణ్ఠాః కులిశకోటయః ॥14॥

(*కుమారావుద్దిశ్య*) కిం భవద్భ్యామవ్యవహితా భూమిరధ్యాస్యతే?

**ఉభౌ:** మహారాజ! ప్రథమపరిణీతోఽయమర్థః ।

---

**విదూషకుడు:** ఆహా, ఏమాశ్చర్యం! వీరు స్వస్థులై ఉన్నారు.

**రాముడు:** ఇందులో ఆశ్చర్యమేముంది? (*కుశలవులను చూపిస్తూ*) మునుల శరీరాలు స్వస్తివచనముల మంత్రమహిమ వల్ల క్షేమంగా ఉంటాయి. చూడు –

తపస్సులు కవచాలలా రక్షిస్తుంటే ఆ సురక్షిత శరీరాలపై బాణాలు కూడా వ్యర్థమౌతయి సరే కోటి వజ్రాయుధాలు కూడా ఏమీ చెయ్యలేవు.

(*మునికుమారులనుద్దేశించి*) మీరిద్దరూ ఒకచోటే ఉంటారా?

**కుశలవులు:** అది ముందే నిర్ణయించబడింది.

**రామః:** తథా నామ।

**విదూషకః:** *భో రాఅ, అదిహీ ఖు ఏదే, తా కరిదు సంకహాహిం ఆహిహేఅం।*

భో రాజన్, అతిథీ ఖల్వేతౌ తత్కరోతు సఙ్కథాభిరాతిథేయమ్।

**రామః:** ఏష భవతోః సౌన్దర్యావలోకనజనితేన కౌతూహలేన ప్రతార్య-మాణః పృచ్ఛామి, - కతమో వర్ణ ఆశ్రమో వా భవతోర్జన్మ-దీక్షాభ్యామలఙ్క్రియతే?

**కుశః:** (*సంజ్ఞయా లవమాదిశతి*)

**లవః:** ద్వితీయో వర్ణః ప్రథమ ఆశ్రమః।

---

**రాముడు:** ఆఁ!

**విదూషకుడు:** రాజా! వీళ్ళు అతిథులు కదా! చక్కని మాటలతో ఆదరించండి.

**రాముడు:** మీ రూపసౌందర్యాలను చూసి కలిగిన కుతూహలంతో అడుగుతున్నాను. జన్మవల్ల, ఆచారం వల్ల మీరు ఏ వర్ణానికి, ఏ ఆశ్రమానికి చెందినవారు?

**కుశుడు:** (*లవుడికి సైగ చేస్తాడు*)

**లవుడు:** ద్వితీయ వర్ణం, ప్రథమాశ్రమం.

**రామః:** నైతావగ్రజన్మానౌ, తదల్పాపరాధః ప్రణామప్రయోగే న్యూనాసనపరిగ్రహశ్చ । అథ క్షత్రియకులపితామహయోః సూర్యా-చన్ద్రమసోః కో వా భవతోర్వంశస్య కర్తా?

**లవః:** భగవాన్ సహస్రదీధితిః ।

**రామః:** కథమస్మత్సమానాభిజనౌ సంవృత్తౌ ।

**విదూషకః:** *కిం దోణ్ణం వి ఏక్కం ఏవ పడివఅణం?*

కిం ద్వయోరప్యేకమేవ ప్రతివచనమ్?

**రామః:** కచ్చిదస్తి యువయోర్మిథో యౌనః సమ్బన్ధః?

**లవః:** భ్రాతరావావాం సోదర్యౌ ।

---

**రాముడు:** వీళ్ళు బ్రాహ్మణులు కారు. అందువల్ల ప్రణామం తప్పు కాదు. కింద కూర్చోవడం కూడా. ఐతే క్షత్రియకులమూలపురుషులైన సూర్యచంద్రులలో ఎవరు మీ వంశకర్త?

**లవుడు:** సహస్రకిరణుడైన సూర్యభగవానుడు.

**రాముడు:** నా వంశము వాళ్ళేనన్నమాట!

**విదూషకుడు:** ఇద్దరిదీ ఒకటే సమాధానమా?

**రాముడు:** మీది రక్తసంబంధమా?

**లవుడు:** మేము అన్నదమ్ములం, సహజన్ములం.

**రామః:** సంవాదీ సన్నివేశః, వయసస్తు న కిఞ్చిదన్తరమ్।

**లవః:** ఆవాం యమలౌ।

**రామః:** సమ్ప్రతి యుజ్యతే, కో భవతోర్జ్యాయాన్, కిం నామధేయమ్?

**లవః:** (*అఞ్జలినా నిర్దిశ్య*) ఆర్యస్య పాదపూజనాయాం లవ ఇత్యాత్మానం శ్రావయామి, ఆర్యోఽపి గురుచరణవన్దనాయాం... (*అప్రతిపత్తిం నాటయతి*)

**కుశః:** అహమపి కుశ ఇత్యాత్మానం శ్రావయామి।

**రామః:** అహో ఉదాత్తరమ్యః సముదాచారః।

---

**రాముడు:** ఇద్దరి రూపగుణాలు సమానంగా ఉన్నాయి. వయస్సులో భేదం ఉన్నదా?

**లవుడు:** మేం కవలలం.

**రాముడు:** ఇప్పుడు తెలిసింది. మీ ఇద్దరిలో ఎవరు పెద్ద? పేర్లేమిటి?

**లవుడు:** (*చేతులను అంజలించి, కుశుడిని చూపిస్తూ*) అన్న పాదాలకు నమస్కరించేటప్పుడు నన్ను నేను 'లవుడు' అని చెప్తాను. అన్న కూడా గురుచరణాలకు నమస్కరించేటప్పుడు... (*సంకోచిస్తాడు*)

**కుశుడు:** నేను కూడా నన్ను 'కుశుడు' అని చెప్తాను.

**రాముడు:** ఆహా! గొప్ప రమణీయసదాచారము.

**విదూషకః:** *జాణిదం ణామ హేఅం, కో జేట్ఠోత్తి ణ దిణ్ణం పడివఅణం।*

జ్ఞాతం నామధేయమ్, కో జ్యేష్ఠ ఇతి న దత్తం ప్రతివచనమ్।

**రామః:** నన్వఞ్జలినిర్దేశాదనామగ్రహణాచ్చ దత్తమేవ ప్రతివచనం కుశో జ్యాయానితి।

**విదూషకః:** *సాహు జాణిదం సంపదం।*

సాధు జ్ఞాతం సామ్ప్రతమ్।

**రామః:** కిన్నామధేయో భవతోర్గురుః?

**లవః:** నను భగవాన్ వాల్మీకిః ।

**రామః:** కేన సమ్బన్ధేన?

---

**విదూషకుడు:** పేర్లయితే తెలిసినాయి. ఇద్దరిలో ఎవరు పెద్దవాడో చెప్పనే లేదు.

**రాముడు:** అంజలినిర్దేశం ద్వారానూ, పేరు తన నోటితో చెప్పకపోవటం వల్లనూ కుశుడు పెద్దవాడని చెప్పినట్లే.

**విదూషకుడు:** ఇప్పుడు బాగా అర్థమైంది.

**రాముడు:** మీ గురువు (తండ్రి) గారి పేరేమిటి?

**లవః:** వాల్మీకిభగవానులు.

**రాముడు:** ఏ విధంగా?

**లవః:** ఉపనయనోపదేశేన।

**రామః:** అహమత్ర భవతోః శరీరస్య ధాతారం పితరం వేదితుమిచ్ఛామి।

**లవః:** నహి జానామ్యస్య నామధేయమ్ । న కశ్చిదస్మింస్తపోవనే తస్య నామ వ్యవహరతి ।

**రామః:** అహో మాహాత్మ్యమ్।

**కుశః:** జానామ్యస్య నామధేయమ్ ।

**రామః:** కథ్యతామ్ ।

**కుశః:** నిరనుక్రోశో నామ ।

---

**లవుడు:** ఉపనయనోపదేశం వల్ల.

**రాముడు:** నేను మీ తండ్రి గురించి తెలుసుకోవాలను కుంటున్నాను.

**లవుడు:** ఆయన పేరు మాకు తెలియదు. తపోవనంలో ఎవరూ ఆ పేరు పలుకరు.

**రాముడు:** ఆహా! మహిమ.

**కుశుడు:** ఆయన పేరు నాకు తెలుసు.

**రాముడు:** చెప్పండి.

**కుశుడు:** నిర్దయుడు.

**రామః:** (*విదూషకమవలోక్య*) అపూర్వం ఖలు నామధేయమ్।

**విదూషకః:** (*విచిన్త్య*) *ఏవ్వం దావ పుచ్ఛిస్సం। ణిరణుక్కో్సోత్తి కో ఏవ్వం భణాది?*

(*విచిన్త్య*) ఏవం తావత్ పృచ్ఛామి। నిరనుక్రోశ ఇతి క ఏవం భణతి।

**కుశః:** అమ్బా।

**విదూషకః:** *కిం కువిదా ఏవ్వం భణాది ఆదు పఇదిత్థా?*

కిం కుపితైవం భణత్యుత ప్రకృతిస్థా?

**కుశః:** యద్యావయోర్బాలభావజనితం కిఞ్చిదవినయం పశ్యతి తదైవమధిక్షిపతి – నిరనుక్రోశస్య పుత్రౌ మా చాపలమ్ – ఇతి।

---

**రాముడు:** (*విదూషకుడిని చూసి*) విచిత్రమైన పేరు.

**విదూషకుడు:** (*కొద్దిగా ఆలోచించి*) అయితే ఇలా అడుగుతాను. నిర్దయుడు అని ఎవరంటారు?

**కుశుడు:** అమ్మ.

**విదూషకుడు:** కోపం వచ్చినప్పుడలా అంటుందా, లేక శాంతంగా ఉన్నప్పుడు కూడానా?

**కుశుడు:** మేము ఎప్పుడైనా బాల్యచాపల్యంతో ఏదైనా అవినయంగా ప్రవర్తిస్తే అప్పుడు కోపంతో, 'ఆ నిర్దయుడి పుత్రులారా! చాపల్యం వద్దు.' అంటుంది.

**విదూషకః:** *ఏదాణం జది పిదుణో ణిరణుక్కోసోత్తి ణామ హేఅం, ఏదాణం జణణీ తేణ అవమాణిదా ణివ్వాసిదా, తస్స అప్పవహంతీ ఏదిణా వఅణేణ దారఏం ణిబ్బచ్ఛది।*

ఏతయోర్యది పితుర్నిరనుక్రోశ ఇతి నామధేయమ్, ఏతయోర్జననీ తేనావమానితా నిర్వాసితా, తస్యాప్రభవన్త్యేతేన వచనేన దారకం నిర్భర్త్సయతి ।

**రామః:** సమ్యగుపలక్షితం కౌశికేన।

(*నిశ్వస్య*) ధిఙ్మామేవంభూతమ్। సా తపస్వినీ మత్కృతేనాపరాధేన స్వాపత్యమేవం మన్యుగర్భైరక్షరైర్నిర్భర్త్సయతి!

(*సబాష్పమవలోకయతి*) అపి సన్నిహితస్తత్ర భవాన్ నిరనుక్రోశో యుష్మదాశ్రమే?

---

**విదూషకుడు:** ఆమె అలా అంటున్నదంటే ఆమె అతనిచేత పరిత్యజింపబడినదో లేక అవమానింపబడినదో! ఆ కోపంతో ఆమె కుమారులను అలా నిందిస్తున్నది.

**రాముడు:** కౌశికుడు సరిగానే ఊహించాడు.

(*నిట్టూర్చి*) ఛీ, నేను ఇలా ఉన్నాను. ఆ దీనురాలు కోపంతో తన సంతానాన్ని నిందిస్తున్నది.

(*కన్నీళ్ళు పెట్టుకుంటూ*) ఆ నిర్దయుడు మీ ఆశ్రమంలోనే ఉన్నాడా?

**లవః:** న సన్నిహితః।

**రామః:** (ససమ్భ్రమమ్) అపి శ్రూయతే?

**లవః:** (కుశమవలోకయతి)

**కుశః:** న తస్య పాదావస్మాకం నమస్కృతపూర్వౌ । అమ్బాయాః పునరేకవేణీసంసూచితాని తస్యోచ్ఛ్వసితాని।

**రామః:** కిం వా భవన్తౌ తేనాఘ్రాతపూర్వౌ?

**కుశః:** తదపి నాస్త్యేవ।

---

**లవుడు:** సమీపంలో లేడు.

**రాముడు:** (*గభాలున*) ఆయన గురించి ఏమైనా విన్నారా?

**లవుడు:** (*కుశుడివంక చూస్తాడు)*

**కుశుడు:** ఆయన పాదాలకు మేము ఎప్పుడూ నమస్కరించలేదు. అమ్మ శిరోజాలు (ఏకవేణి) , నిట్టూర్పులూ ఆయనను ఉద్దేశించినవే.

**రాముడు:** ఎప్పుడైనా అతడు మీ మూర్ధాఘ్రాణం చేశాడా?

**కుశుడు:** అది కూడా లేదు.

**రామః:** అతిదీర్ఘప్రవాసోఽయం దారుణశ్చ, యదియతా కాలేన నామ పరస్పరలోచనగోచరమపి నావతీర్ణా యూయమ్।

(*విదూషకమవలోక్య జనాన్తికమ్*) కుతూహలేనావిష్టో మాతరమనయోర్నామతో వేదితుమిచ్ఛామి। న యుక్తం చ మమ స్త్రీగతమనుయోక్తుం విశేషతస్తపోవనే। తత్కోఽత్రాభ్యుపాయః?

**విదూషకః:** (*జనాన్తికమ్*) *అప్పడిహదవఅణమహత్తణా హి బహ్మణజాదీ, అహం ఉణ పుచ్ఛిస్సం* – (*ప్రకాశమ్*) *భో కిణ్ణామ హేఆ తుహ్మాణం జణణీ?*

(*జనాన్తికమ్*) అప్రతిహతవచనమహత్త్వా హి బ్రాహ్మణజాతిః, అహం పునః పృచ్ఛామి, (*ప్రకాశమ్*) భో కిన్నామధేయా యువయోర్జననీ?

---

**రాముడు:** అయితే అతడు దీర్ఘ ప్రవాసంలో ఉండి ఉంటాడు. కఠినుడు కూడా. ఎందుకంటే ఇన్నేండ్లైనా మీరు పరస్పరం చూసుకోనుకూడా లేదు.

(*విదూషకుడితో గుసగుసగా*) కుతూహలం కొద్దీ వీళ్ళ అమ్మగారి పేరు తెలుసుకోవాలని అనుకుంటున్నాను. కానీ, స్త్రీ విషయంలో, అదీ తపోవన స్త్రీవిషయం. నాకు సమంజసం కాదు. ఇప్పుడేమిటీ ఉపాయం?

**విదూషకుడు:** (*రాముడికే వినబడేలా*) బ్రాహ్మణవాక్యానికి తిరుగులేదు. బ్రాహ్మణుడు సర్వస్వతంత్రుడు కనుక నేనే అడుగుతాను.

(*ప్రకాశంగా*) నాయనలారా! మీ తల్లిగారి పేరేమిటి?

**లవః:** తస్యా ద్వే నామనీ।

**విదూషకః:** *కహం విఅ?*

కథమివ?

**లవః:** తపోవనవాసినో దేవీతి నామాహ్వాయన్తి, భగవాన్ వాల్మీకి-ర్వధూరితి।

**రామః:** కతమం క్షత్రియకులం వాల్మీకిమునిముఖనిర్గతేన వధూశబ్దేన వర్ధతే?

**విదూషకః:** *విత్థిణ్ణం ఖత్తిఅకులం తి ణ జాణీఅది కదమం ఖత్తిఅకులం తి।*

విస్తీర్ణం క్షత్రియకులమితి న జ్ఞాయతే కతమం క్షత్రియకులమితి।

---

**లవుడు:** ఆమెకు రెండు పేర్లు.

**విదూషకుడు:** ఎలాగ?

**లవుడు:** తపోవనవాసులామెను 'దేవీ' అంటారు. వాల్మీకి భగవానులు 'వధూ' అని పిలుస్తారు.

**రాముడు:** ఏ క్షత్రియవంశాన్నుద్దేశించి భగవానుల ఆ వధూ-సంబోధన?

**విదూషకుడు:** క్షత్రియకులం విస్తృతమైనది కనుక ఏ వంశాన్ని ఉద్దేశించినదో చెప్పలేము.

**రామః:** అపి చేతస్తావద్వయస్య ముహూర్తమాత్రమ్।

**విదూషకః:** (*ఉపసృత్య*) *ఆణవేదు భవం।*

(*ఉపసృత్య*) ఆజ్ఞాపయతు భవాన్।

**రామః:** అపి కుమారయోరనయోరస్మాకం చ సర్వాకారసంవాదీ కుటుమ్బవృత్తాన్తః।

**విదూషకః:** *కహం విఅ?*

కథమివ?

**రామః:** పశ్య, ఏతయోః సీతాగర్భస్య చ తుల్యః కాలాతిపాతః, ఏతావపి క్షత్రియౌ సూర్యాన్వయౌ, అజాతప్రోషితౌ చ నిర్వికారౌ రాజాసనా-రోహణే, పితరి చానయోర్దారుణత్వసూచనో నిరనుక్రోశశబ్దః, మాతుశ్చ

---

**రాముడు:** మిత్రమా, ఒక్క క్షణం!

**విదూషకుడు:** (*దగ్గరికి జరిగి*) ఆజ్ఞాపించండి.

**రాముడు:** వీరి వృత్తాంతం మా వంశవృత్తాంతంతో సరిపోతున్నది.

**విదూషకుడు:** ఎలాగ?

**రాముడు:** చూడు. వీళ్ళ వయస్సులూ, సీత గర్భధారణసమయము. వీళ్ళు కూడా క్షత్రియులు, సూర్యవంశజులు. పుట్టక ముందే వనవాసమూ, రాజాసనంలో కూర్చున్నప్పటికీ నిర్వికారత్వమూ, తండ్రి నిర్దయుడనే

మాహాత్మ్యవిభావనో దేవీశబ్దః। సర్వథాహమనేన సాదృశ్యబాహుల్యేన పర్యాకులోఽస్మి మన్దభాగ్యః। (*వైక్లబ్యం నాటయతి*)

**విదూషకః:** *కిం తవ ఈరిసో అహిప్పాఓ సీదాగబ్భగదా ఏదే దారఆ త్తి?*

కిం తవేదృశోఽభిప్రాయః, సీతాగర్భగతావేతౌ దారకావితి?

**రామః:** మా మైవమ్। కథం హన్త! తపోవనవాసిని జనే సమ్బన్ధమీదృశ-మధ్యారోపయామి । కిన్తు–

ఏతత్కుమారయుగలం వయసాన్వయేన
శ్యామోన్నతేన వపుషా విపదానయా చ।
తాం మైథిలీం తనయసమ్భవినీమవస్థా–
మాదాయ మామతితరాం తరలీకరోతి ॥15॥

(*చిన్తాశోకం నాటయతి*)

---

సూచనా, తల్లి గొప్పదనాన్ని తెలిపే 'దేవీ' శబ్దం, అన్ని విధాలా సరిపోతున్న వివరాలతో తపించిపోతున్నాను మందభాగ్యుణ్ణి. (*విచారిస్తాడు*)

**విదూషకుడు:** నీ ఉద్దేశ్యం ఈ కుమారులు సీతాదేవి సంతానమనేనా?

**రాముడు:** కాదు, కాదు. తపోవనవాసుల విషయంలో నేనెలా ఇటువంటి ఆరోపణలను చెయ్యగలను? కానీ వీళ్ళ వయస్సు, కులమూ, శ్యామలవర్ణమూ, సమున్నతశరీరాలూ, వారికి సంభవించిన ఆపదా – ఇవన్నీ ఆ సమయంలో జానకి ప్రసవానికి సిద్ధంగా ఉన్న సందర్భాన్ని గుర్తుకు చేసి నా మనస్సును వికలం చేస్తున్నయి. (*దుఃఖిస్తాడు*)

*(నేపథ్యే)*

భో భోః కోఽత్ర సన్నిహితస్తత్రభవతోరిక్ష్వాకుకులకుమారయోః కుశలవయోః?

**ఉభౌ:** (*ఆకర్ణ్య*) ద్వావప్యావాం సన్నిహితౌ।

*(పునర్నేపథ్యే)*

కిమితీయతీం వేలాం నియోగః ప్రత్యుదాస్యత?

> వాల్మీకినా మునివరేణ మహారథస్య
> యాఽసౌ పురాణపురుషస్య కథా నిబద్ధా।
> సా రాఘవశ్రుతిపథాతిథితాం చ నేయా
> కాలశ్చ మధ్యసవనస్య న లఙ్ఘనీయః ॥16॥

---

*(తెర వెనుక నుంచి)*

*ఇక్ష్వాకువంశీయులైన లవకుశులలో ఎవరైనా ఇక్కడ ఉన్నారా?*

**కుశలవులు:** (*ఆ మాటను విని*) ఇద్దరమూ ఇక్కడే ఉన్నాము.

*(మళ్ళీ తెర వెనుక నుంచి)*

కులపతులచేత మీకు అప్పగించినబడిన కార్యం ఇంతవరకు ఎందుకు ఉపేక్షించబడింది? వారిచేత రచించబడిన మహారథుడైన పురాణ-పురుషుడి కథను రాఘవుడికి వినిపించాలి. మధ్యాహ్నికసమయం అతిక్రమించరాదు.

**ఉభౌ:** రాజన్, ఉపాధ్యాయదూతోఽస్మాన్ త్వరయతి ।

**రామః:** మయాపి సమ్భావనీయ ఏవ మహార్థసంవిధాయీ ముని-నియోగః।

తథా హి –

భవన్తౌ గాయన్తౌ కవిరపి పురాణో వ్రతనిధి–
ర్గిరాం సన్దర్భోఽయం ప్రథమమవతీర్ణో వసుమతీమ్।
కథా చేయం శ్లాఘ్యా సరసిరుహనాభస్య నియతం
పునాతి శ్రోతారం రమయతి చ సోఽయం పరికరః ॥17॥

వయస్య, అపూర్వోఽయం మానవానాం సరస్వత్యవతారః, తదహం సుహృజ్జనసాధారణం శ్రోతుమిచ్ఛామి। సన్నిధీయన్తాం సభాసదః,

---

**కుశలవులు:** ఆచార్యుల దూత మమ్మల్ని తొందర పెడుతున్నాడు.

**రాముడు:** మహార్థగర్భితమైన ముని ఆజ్ఞను నేను కూడా పాటించాలి. మీరిద్దరూ గాయకులు. కవి కూడా పురాణవ్రతనిధి. ఈ సారస్వతం ప్రథమపర్యాయం అవతరించిన సందర్భం. కథ నారాయణుడిది. శ్లాఘ్యమైన ఈ రచన శ్రోతలకు ఆనందదాయకం. పాపహరం.

మిత్రమా కౌశికా! ఈ విలక్షణమైన సరస్వతీ ప్రథమావతారాన్ని మిత్రులతో కలిసి వినాలనుకుంటున్నాను. సభాసదులను పిలవండి.

ప్రేష్యతామస్మదన్తికం సౌమిత్రిః, అహమప్యేతయోశ్చిరాసనపరిఖేదం పాదవిహరణేనాపహరామి ।

(*ఇతి నిష్క్రాన్తాః సర్వే*)

---

లక్ష్మణుణ్ణి నా దగ్గరకు రమ్మనండి. చాలా సేపటి నుండి కూర్చుని ఉండటంవల్ల కలిగిన క్లేశాన్ని అటూ ఇటూ నడుస్తూ పోగొట్టుకుందాము.

(*అందరూ నిష్క్రమిస్తారు*)

## షష్ఠోఽఙ్కః – ఆరవ అంకము

(*తతః ప్రవిశతి కఞ్చుకీ*)

**కఞ్చుకీ:** సమ్పాదితకౌశికముఖసఙ్క్రాన్తపార్థివాజ్ఞోఽహమత్ర స్థితం స్వామినమవలోకయామి।

(*విలోక్య*) ఏష ప్రాప్త ఏవ స్వామీ –

> మహాశీలైస్త్రిభిః సార్ధమిత ఏవాభివర్తతే।
> పరిష్కృతస్త్రిభిర్వేదైరశ్వమేధ ఇవాధ్వరమ్ ॥1॥

(*తతః ప్రవిశతి కుశలవాభ్యామనుగమ్యమానో రామభద్రో లక్ష్మణశ్చ*)

(*సర్వే పరిక్రామన్తి*)

---

(*కంచుకి ప్రవేశిస్తాడు*)

**కంచుకి:** కౌశికుడిచేత అందజేయబడ్డ రాజాజ్ఞను నెరవేర్చాను. ఇక్కడ కూర్చొని స్వామి రాకకోసం ఎదురుచూస్తాను.

(చూసి) మూడు వేదాలతో నిర్వహించబడిన అశ్వమేధయాగంలా, మహాశీలవంతులైన ముగ్గురితో మహారాజు ఇటే వస్తున్నారు.

(*కుశలవులు అనుసరిస్తూ ఉండగా, రామలక్ష్మణులు ప్రవేశిస్తారు*)

(*అందరు ముందుకు నడుస్తారు*)

**కఞ్చుకీ:** (*ఉపసృత్య*) జయత్వార్యః, ఏతత్సజ్జమాస్థానమణ్డపమ్ ఏతదాసనం చ । (*సర్వే ఉపవిశన్తి*)

ఇతస్తావదవలోకయతు దేవః, ఏతే రాఘవాః పౌరజానపదాశ్చ దేవం సమ్భావయాన్తి ।

**రామః:** (*దృష్ట్వా*) కిమిదమపరమస్మదన్తికాద్యవనికయా తిరోధీయతే?

**కఞ్చుకీ:** ఏతాస్తిస్రో మహాదేవ్యః కౌసల్యాద్యా మహీపతేః।
ఏతద్భరతశత్రుఘ్నలక్ష్మణానాం వధూత్రయమ్ ॥2॥

**లక్ష్మణః:** (*కఞ్చుకినముద్దిశ్య*) ఆర్య! వైదేహీ చ న దేవీషు సఙ్ఖ్యాయతే, న వధూషు చ।

---

**కంచుకి:** (*సమీపించి*) జయము జయము ఆర్యులకు. సభాభవనమూ, సింహాసనమూ అలంకరించబడి ఉన్నాయి. (*అందరూ కూర్చుంటారు*)

ప్రభూ! ఇటు చూడండి. రఘువంశపు పరివారసభ్యులు, పౌరులు, జానపదులు దేవర వారికి అభినందనలు తెలియజేసుకుంటున్నారు.

**రాముడు:** (చూసి) ఈ వైపు తెరమాటున ఎవరున్నారు?

**కంచుకి:** కౌసల్యాది ముగ్గురు రాజమాతలు, భరతలక్ష్మణశత్రుఘ్నుల దేవేరులున్నారు.

**లక్ష్మణుడు:** (*కంచుకితో*) ఆర్యా! రాణులలోనూ, కోడళ్ళలోనూ సీతను లెక్కించడం లేదు.

**రామః:** (*నిశ్వస్య*) కఞ్చుకిన్! గచ్ఛ త్వం స్వభూమిమధ్యాస్వ ।

**కఞ్చుకీ:** యదాహ (*ఇతి నిష్క్రాన్తః*)

**రామః:** ఆర్యౌ ప్రస్తూయతామ్।

**కుశలవౌ:** ఉపయేమే తతస్తిస్రో ధర్మపత్నీర్మహీపతిః।
కౌసల్యామథ కైకేయీం సుమిత్రాం చ సుమధ్యమామ్ ॥3॥

**రామలక్ష్మణౌ:** (*సహర్షమ్*) తాత ఏవ కథానాయకతాముపనీతః కవినా। (*ఉభౌ నమస్కృత్యాసనాదవతరతః*)

**కుశలవౌ:** కౌసల్యా సుషువే రామం...

**లక్ష్మణః:** (*ప్రణమతి*)

---

**రాముడు:** (*నిట్టూర్చి*) కంచుకీ, నీవు వెళ్ళి నీ స్థానంలో కూర్చో.

**కంచుకి:** మీ ఆజ్ఞ. (*నిష్క్రమిస్తాడు*)

**రాముడు:** (*కుశలవులతో*) మీరు మొదలుపెట్టవచ్చు.

**కుశలవులు:** దశరథమహారాజుకి దేవేరులు ముగ్గురు. కౌసల్య, కైకేయి సుమిత్ర.

**రామలక్ష్మణులు:** (*సంతోషంగా*) కవి ~~ఈ~~ కావ్యానికి తండ్రిగారినే కథా నాయకుణ్ణి చేశాడు. (*ఇద్దరూ లేచి తండ్రిని స్మరిస్తూ నమస్కరిస్తారు*)

**కుశలవులు:** కౌసల్య రాముడికి జన్మనిచ్చింది.

**లక్ష్మణుడు:** (*నమస్కరిస్తాడు*)

**కుశలవౌ:** ... కైకేయీ భరతం తతః।
సుమిత్రా జనయామాస యమౌ శత్రుఘ్నలక్ష్మణౌ ॥4॥

**రామః:** (*లక్ష్మణమాలిఙ్గతి*)

**కుశలవౌ:** ఉపయేమే తతః సీతాం రామః సౌమిత్రిరూర్మిలామ్ ।
తథా భరతశత్రుఘ్నౌ కుశధ్వజసుతే ఉభే ॥5॥

బాల్యయౌవనయోర్మధ్యే వర్తమానా నృపాత్మజాః।
నవయోత్కణ్ఠయా చైవ కలత్రే దుఃస్థితిం యయుః ॥6॥

**లక్ష్మణః:** రమణీయః।

---

**కుశలవులు:** కైకేయి భరతుణ్ణీ, సుమిత్ర లక్ష్మణశత్రుఘ్నులనే కవలలను కన్నారు.

**రాముడు:** (*లక్ష్మణుణ్ణి ఆలింగనం చేసుకున్నాడు*)

**కుశలవులు:** రాముడు సీతను, లక్ష్మణుడు ఊర్మిళను, జనకుడి తమ్ముడు కుశధ్వజుడి కుమార్తెలైన మాండవీశ్రుతకీర్తులను భరతశత్రుఘ్నులు పెళ్ళాడారు.

కౌమారయౌవన దశల మధ్యలో ఉన్న ఆ కుమారులు, వారి భార్యల కారణంగా మదనవికారాలకు లోనయ్యారు.

**లక్ష్మణుడు:** రమణీయం!

**రామః:** అలం కాలాతిపాతేన, గీయతామ్।

జరసా పలితస్తాతః కాకపక్షధరా వయమ్।
జానుదఘ్నాస్తదా తేఽపి సాకేతోద్యానపాదపాః ॥7॥

**కుశలవౌ:** అథాభిషేకసమ్భారే రామస్య సముపస్థితే।
భరతే మాతులం ద్రష్టుం మాతామహపురం గతే ॥8॥

**రామః:** (*ఆత్మగతమ్*) నియతం మధ్యమామ్బా నిన్ద్యతే।

(*ప్రకాశమ్*) తముద్దేశముల్లఙ్ఘ్య సీతాపరిహరణాత్ప్రభృతి గీయతామ్।

---

**రాముడు:** తరువాత పాడండి.

తండ్రిగారి శిరోజాలు పండి పోయినాయి. మేం మాత్రం ఇంకా కాకపక్షధారులం, బాలకులమే. అయోధ్యలో ఉద్యానవనంలో చెట్లు కూడా మా మోకాళ్ళ వరకే ఉండేవి.

**కుశలవులు:** రాముడికి అభిషేకసంభారాలు సమకూరుతున్నాయి. అంతకుముందే భరతుడు మేనమామలను చూడటానికి తాతగారింటికి వెళ్ళాడు.

**రాముడు:** ***(తనలో)* తప్పక, కైకేయీమాత నిందించబడనున్నది**.

**(*పైకి*)** అక్కడికి ఆపి, సీతాపహరణఘట్టం నుండి పాడండి.

**కుశలవౌ:** కాలేన రూపసౌన్దర్యం శ్రుత్వా శూర్పణఖాముఖాత్ ।
జహార దేహం సీతాయా న చారిత్రం దశాననః ॥9॥

**లక్ష్మణః:** (*రామమవలోకయతి*)

**కుశలవౌ:** తతో బద్ధ్వార్ణవే సేతుం నిహత్య యుధి రావణమ్ ।
సీతామాదాయ రామోఽపి సాకేతం పునరాగతః ॥10॥

**రామః:** అహో సంక్షేపః ।

**కుశలవౌ:** ప్రాప్తరాజ్యస్తతో రామో జనవాదేన నోదితః ।
ఆహూయ లక్ష్మణం ప్రాహ సీతా నిర్వాస్యతామితి ॥11॥

---

**కుశలవులు:** కాలం గడుస్తుండగా శూర్పణఖ చెప్పగా సీతయొక్క సౌందర్యమును గురించి వినిన రావణుడు సీతను అపహరించాడు. శరీరాన్ని మాత్రమే, శీలాన్ని కాదు.

**లక్ష్మణుడు:** (*రాముడిని చూస్తాడు*)

**కుశలవులు:** అప్పుడు రాముడు సముద్రం పైన వారధి కట్టి, యుద్ధంలో రావణుణ్ణి వధించి, సీతను తీసుకొని సాకేతపురానికి వచ్చాడు.

**రాముడు:** ఆహా! సంక్షిప్తంగా చెప్పారు.

**కుశలవులు:** రాజ్యం లభించిన తరువాత (కొంతకాలానికి) జనాపవాద-భయంతో రాముడు లక్ష్మణుణ్ణి పిలిచి, సీతమ్మను అడవిలో విడిచి రమ్మని ఆజ్ఞాపించాడు.

బాష్పపర్యాకులముఖీమనాథాం శోకవిక్లవామ్ ।
ఉద్వహన్తీం చ గర్భేణ పుణ్యాం రాఘవసన్తతిమ్ ॥12॥

సీతాం నిర్జనసమ్వ్రాతే చణ్డశ్వాపదసఙ్కులే ।
పరిత్యజ్య మహారణ్యే లక్ష్మణోఽపి న్యవర్తత ॥13॥

**లక్ష్మణః:** అహో! అయశోభాగీ లక్ష్మణః ।

**రామః:** కస్తవాత్రాపరాధః రామపరాక్రమాః ఖల్వేతే గృహ్యన్తే । తతః ।

**కుశలవౌ:** ఏతావతీ గీతిః ।

**రామః:** (సోద్వేగమ్) సౌమిత్రే, కష్టమాపతితమ్ –

---

కన్నీటితో నిండిన ముఖంతో, అనాథను, శోకమూర్తిని, రాఘవ-సంతతిని గర్భంలో ధరించినదానిని సీతను, నిర్జనమైన, క్రూరమృగాలు సంచరించే అరణ్యంలో విడిచిపెట్టి లక్ష్మణుడు వెళ్ళిపోయాడు.

**లక్ష్మణుడు:** అయ్యో! లక్ష్మణుడు ఎంత అపకీర్తిని మూటగట్టుకున్నాడు.

**రాముడు:** ఇందులో నీ అపరాధమేముంది? ఇది రాముడి పరాక్రమ-వర్ణన. తరువాత...

**కుశలవౌ:** అంతవరకే ఉన్నది.

**రాముడు:** లక్ష్మణా! చాలా కష్టం వచ్చింది.

**ఉభౌ:** తతః ప్రాణైః పరిత్యక్తా నిరాశా జనకాత్మజా ।
అప్రియాఖ్యానభీతేన కవినా సంహృతా కథా ॥14॥

**కుశః:** (*అపవార్య*) మహాభాగావేతౌ సీతాసఙ్కథాయామత్యన్తవిషాదినౌ తస్మాదనుయోక్ష్యే । (*లక్ష్మణముద్దిశ్య*) అపి భవన్తౌ రామాయణకథా-నాయకౌ రామలక్ష్మణౌ?

**లక్ష్మణః:** తౌ క్లేశభాగినౌ ।

**కుశః:** కిం నీతా త్వయా సీతా?

**లక్ష్మణః:** (*సలజ్జమ్*) మయా మన్దభాగ్యేన।

**కుశః:** కిం సీతా రామస్య ధర్మపత్నీ?

---

**కుశలవులు:** ఆ తరువాత సీత ప్రాణాలను వదులుకున్నది. అప్రియాన్ని చెప్పటం ఇష్టం లేక, కవి ఇంతటితో ఆపేశాడు.

**కుశుడు:** (*తనలో*) ఈ మహానుభావులు సీత విషాదగాథ విని చాలా ఖేదం పొందుతున్నారు. అందుచేత అడుగుతాను. (*లక్ష్మణుడిని ఉద్దేశించి*) మీరేనా రామాయణకథానాయికులైన రామలక్ష్మణులు?

**లక్ష్మణుడు:** ఆ దుఃఖభాగులం మేమే.

**కుశుడు:** అయితే మీరేనా సీతమ్మను అడవిలో విడిచిపెట్టి వెళ్ళింది?

**లక్ష్మణుడు:** (*సిగ్గుపడుతూ*) ఈ అభాగ్యుడే.

**కుశుడు:** సీత రాముడి ధర్మపత్నియేనా?

**లక్ష్మణః:** అథ కిమ్?

**కుశః:** అథ సీతాయాస్తద్గర్భస్య వా విదితః కశ్చిద్ వృత్తాన్తః?

**లక్ష్మణః:** విదితో యుష్మత్సఙ్గీతేన ।

**రామః:** కిమితః పునః కల్యాణమావేదయతి (*విచిన్త్య*) ఏవం తావదను-యోక్ష్యే । ఆర్యౌ, కిమేష యువయోరాగమావధిః, ఆహోస్విత్సన్దర్భా-వధిః?

**కుశః:** న వయం జానీమః।

**రామః:** కణ్వోఽనుయోక్తవ్యః। సౌమిత్రే, కణ్వమాహ్వయ।

---

**లక్ష్మణుడు:** కాకేమీ?

**కుశుడు:** ఆ తరువాత సీత గురించి కానీ, ఆమె గర్భస్థశిశువును గురించి కానీ ఏమైనా తెలిసిందా?

**లక్ష్మణుడు:** మీ గానం ద్వారానే తెలిసింది.

**రాముడు:** దీని తరువాత ఏమైనా శుభవార్త ఉన్నదా? (*చింతించి*) ఆర్యులారా! ఇప్పటి వరకు మీరు పాడినది... మీరు ఇంతవరకే నేర్చుకున్నారా? లేక ఇంతవరకే ఉన్నదా?

**కుశుడు:** మాకు తెలియదు.

**రాముడు:** కణ్వుడిని అడుగుదాము. సౌమిత్రీ, కణ్వుడిని పిలువు.

**లక్ష్మణః:** *(నిష్క్రమ్య కణ్వేన సహ పునః ప్రవిష్టః)*

**కణ్వః:** *(విలోక్య)*

స ఏష రామో నయనాభిరామః
సీతాసుతాభ్యాం సముపాస్యమానః।
యదృచ్ఛయా తిష్యపునర్వసుభ్యాం
పార్శ్వస్థితాభ్యామివ శీతరశ్మిః ॥15॥

**లక్ష్మణః:** కణ్వోఽయమార్య సమ్ప్రాప్తః ।

**రామః:** *(ప్రణమ్య)* ఇదమాసనమాస్యతామ్।

**కణ్వః:** *(ఉపవిశ్య)* యది రామాయణశ్రవణకౌతుకం కథ్యతాం కుత్రావధిరభిహితః కుశలవాభ్యామితి।

---

**లక్ష్మణుడు:** *(నిష్క్రమించి కణ్వుడితో మళ్ళీ ప్రవేశిస్తాడు)*

**కణ్వుడు:** (చూసి) సీతాసుతుల చేత సేవింపబడుతున్న శ్రీరాముడు పుష్యమీపునర్వసు నక్షత్రాలచేత సేవింపబడుతున్న చంద్రుడిలా నయనానందకరంగా ఉన్నాడు.

**లక్ష్మణుడు:** ఆర్యా, కణ్వుడు విచ్చేసాడు.

**రాముడు:** *(నమస్కరించి)* ఈ ఆసనాన్ని అలంకరించండి.

**కణ్వుడు:** రామాయణం వినాలని అనుకున్నట్లయితే, కుశలవులు ఎందాక చెప్పారో చెప్పండి.

**లక్ష్మణః:** "సీతాం నిర్జనసమ్ప్రాతే" (*ఇతి పఠిత్వా*) ఏష కుశలవయో-ర్గీతసీమా।

**కణ్వః:** శ్రూయతాం తతః పరమ్।

**రామః:** కా గతిః?

**కుశలవౌ:** రామదారాణాం భద్రం గాయతి।

**కణ్వః:** తతః శ్రుత్వా స శిష్యేభ్యో వాల్మీకిర్మునిరుత్తమః।
స్వయం సీతాం సమాశ్వాస్య నినాయ స్వం తపోవనమ్ ॥16॥

**రామః:** అనుగృహీతం భగవతా రఘుకులమ్, అభ్యుద్ధృతోఽస్మి భగవతా।

---

**లక్ష్మణుడు:** "సీతాం నిర్జనసమ్ప్రాతే" – సీతాదేవిని నిర్జనారణ్యంలో వదిలిపెట్టేవరకు – వచ్చి ఆగింది కుశలవుల పాట.

**కణ్వుడు:** ఆ తరువాత వినండి.

**రాముడు:** ఏం వినాలి?

**కుశలవులు:** రామపత్ని గురించి శుభం.

**కణ్వుడు:** శిష్యులద్వారా విని, వాల్మీకిమహర్షి సీతను ఓదార్చి తమ తపోవనానికి తీసుకుని వెళ్ళారు.

**రాముడు:** వాల్మీకిభగవానుల వల్ల రఘుకులం అనుగ్రహింపబడింది. నేను ఉద్ధరింపబడ్డాను.

**కుశలవౌ:** దిష్ట్యా కుశలినో రామదారాః।

(*సర్వే హర్షం నాటయన్తి*)

**కుశః:** అయి వత్స లవ, కాసౌ వాల్మీకితపోవనే సీతా నామ?

**లవః:** న కాచిత్, కేవలం గీతినిబన్ధనాన్యేతాని సీతా సీతేత్యక్షరాణి।

**రామః:** తతస్తతః।

**కణ్వః:** పరిపూర్ణే తతః కాలే ద్వౌరివేన్దుదివాకరౌ।
సీతాపి జనయామాస సా యమౌ తనయావుభౌ ॥17॥

**లక్ష్మణః:** జయత్వార్యః, దిష్ట్యా వర్ధతాం రాఘవకులమ్।

---

**కుశలవులు:** ఆహా! రామపత్ని కుశలమే.

(*అందరు సంతోషిస్తారు*)

**కుశుడు:** వత్సా లవా! వాల్మీకిమహర్షి తపోవనంలో సీత అనే వారెవరు?

**లవుడు:** ఎవరూ లేరు. కేవలం కావ్యంలోనే సీత, సీత అని ఉంది.

**రాముడు:** ఆ తరువాత?

**కణ్వుడు:** సమయం రాగానే, ఆకాశంలో సూర్యచంద్రులిద్దరూ ఏకకాలంలో ఉదయించినట్లు, సీతకు కవలపిల్లలు కలిగారు.

**లక్ష్మణుడు:** జయతు, జయతు ఆర్యా! రఘుకులం వర్ధిల్లుతున్నది.

**కుశలవౌ:** జయతు మహారాజః పుత్రజన్మనా।

**రామః:** (*స్వగతమ్*) అపి నామ కుశలవౌ స్యాతామ్ ।

**కణ్వః:** జాతావస్థోచితం కర్మ విదధానో యథాక్రమమ్।
స చకార తయోర్నామ మునిః కుశలవావితి ॥18॥

**రామః:** కథమేతావేవ సీతాతనయౌ? హా పుత్ర కుశ! హా పుత్ర లవ!

**లక్ష్మణః:** ఇయం సా దేవీసమ్భవాఽర్యస్యాత్మసమ్భూతిః।

**కుశలవౌ:** కథమయం సః। హా తాత, త్రాయస్వ। (*సర్వే పరస్పర-మాలిఙ్గ్య మోహం గచ్ఛన్తి*)

---

**కుశలవులు:** మహారాజుకు జయం, పుత్రజననసందర్భంలో.

**రాముడు:** (*తనలో*) ఆ పిల్లలు కుశలవులే అయి ఉంటారు.

**కణ్వుడు:** జాతకర్మలు చేయించి మహర్షి వారికి కుశలవులని నామకరణం చేశారు.

**రాముడు:** ఏమిటీ! వీళ్ళు సీతాపుత్రులేనా? హా పుత్ర కుశా! హా పుత్ర లవా!

**లక్ష్మణుడు:** వీళ్ళు దేవికి పుట్టిన అన్న కుమారులు.

**కుశలవులు:** అయితే మేము... ఆయన... హా తండ్రీ రక్షించు.
(*అందరూ ఒకరినొకరు ఆలింగనం చేసుకుని మూర్ఛపోతారు*)

**కణ్వః:** (*సవిషాదమ్*) కిమేతత్కష్టమాపతితమ్।

మయా తు మన్దభాగ్యేన భద్రం తు కిల గాయతా।
రఘుప్రవీరాశ్చత్వారో హితేనైకేన పాతితాః ॥19॥

(*నిర్వర్ణ్య*) దిష్ట్యా శ్వాసోద్గమ ఇవ। అహమేతం వృత్తాన్తం భగవతే దేవ్యై చ నివేదయామి। (*ఇతి నిష్క్రాన్తః*)

(*తతః ప్రవిశతి వాల్మీకిః, ససమ్భ్రమం సీతా చ*)

**వాల్మీకిః:** వత్సే! త్వరస్వ, మా పరిలమ్బిష్ఠాః అప్రతిక్రియమాణా మూర్ఛా నిష్క్రాన్తమాపద్యతే।

**సీతా:** *కహేహి కహేహి పరమత్థం, అవి ధరన్తి రాహవా?*

కథయ కథయ పరమార్థమ్, అపి ధ్రియన్తే రాఘవాః?

---

**కణ్వుడు:** (*విచారంగా*) ఎంత కష్టం వచ్చింది! శుభవార్త చెప్పి రఘువీరులు నలుగురినీ మూర్ఛ పోయేలా చేశానే!

(*పరీక్షించి*) అదృష్టవశాత్తు శ్వాస ఆడుతున్నది. వెళ్ళి ఈ విషయం భగవానులకు, దేవికి నివేదిస్తాను. (*నిష్క్రమిస్తాడు*)

(*వాల్మీకి ప్రవేశిస్తాడు. కంగారుగా సీత అతడి వెంట వస్తుంది.*)

**వాల్మీకి:** తల్లీ! త్వరగా! ఆలస్యం చెయ్యవద్దు. సకాలంలో ప్రతిక్రియ చెయ్యకపోతే మూర్ఛ ప్రాణాంతకం కావచ్చును.

**సీత:** నిజం చెప్పండి భగవన్! రాఘవులు సజీవులేనా?

**వాల్మీకిః:** సమాశ్వసిహి, ధ్రియన్తే రాఘవాః । కిమేతాన్న పశ్యతి భవత్యుచ్ఛ్వసితాన్?

**సీతా:** *దిఢం పచ్చాఇదహ్మి తాదేణ ।*

దృఢం ప్రత్యాయితాస్మి తాతేన ।

**వాల్మీకిః:** (*అన్వేషణమభినీయ*)

మైథిలి ప్రహిణు లోచనే తతః సాధు ధైర్యమవలమ్బ్య యత్నతః ।
త్వత్కథాప్రలయమాతరిశ్వనా పశ్య రాఘవకులం నిపాతితమ్ ॥20॥

**సీతా:** (*సలజ్జమ్*) *భఅవం, అణణుణ్ణాదదంసణా అహం అంఅఉత్తేణ ।*

(*సలజ్జమ్*) భగవన్, అననుజ్ఞాతదర్శనాహమార్యపుత్రేణ ।

**వాల్మీకిః:** (*సావష్టంభమ్*) మయి స్థితే కో వా అభ్యనుజ్ఞాయాః ప్రతిషేధస్య వా । గచ్ఛ, అభ్యనుజ్ఞాతాసి వాల్మీకినా మయైతద్దర్శనే,

---

**వాల్మీకి:** ఊరడిల్లు సీతా! రాఘవులు సజీవులే! శ్వాస ఆడుతున్నది, చూడు.

**సీత:** అమ్మయ్య భగవాన్! నాకు విశ్వాసం కలిగించారు.

**వాల్మీకి:** (*వెదుకుతూ*) జానకీ! ధైర్యం తెచ్చుకుని చూడు. నీ కథ అనే ప్రళయఝుంఝామారుతం రఘుకులాన్ని కింద పడవేసింది.

**సీత:** (*లజ్జతో*) భగవన్! స్వామి అనుజ్ఞ లేకుండా ఎదుట పడలేను.

**వాల్మీకి:** (*దృఢంగా*) నేనుండగా, అనుమతులు, నిషేధాలు చెల్లవు. వెళ్ళు.

ఉపసర్ప నిశ్శఙ్క్యముపయన్తారమ్।

**సీతా:** (*విలోక్య*) *కిం ఏవ్వం వట్టది, సవ్వహో హదహ్మి మన్దభాఆ।*

(*విలోక్య*) కిమేవం వర్తతే, సర్వథా హతాస్మి మన్దభాగ్యా । (*పతిత్వా రోదితి*)

**వాల్మీకిః:** ఉత్తిష్ఠ సమాశ్వాసయ, అహమపి రామలక్ష్మణావభ్యుపపత్స్యే । వత్స రామ, వత్స లక్ష్మణ, సమాశ్వసిహి।

**సీతా:** *జాద కుస, జాద లవ, సమస్సస సమస్సస।* (*ఏవం సలిల సేకం నాటయతి*)

జాత కుశ, జాత లవ, సమాశ్వసిహి, సమాశ్వసిహి। (*ఏవం సలిల సేకం నాటయతి*)

**రామః:** (*ప్రత్యాగమ్య*) ఆర్య కణ్వ! అపి ధ్రియతే వైదేహీ?

---

వాల్మీకి అనుజ్ఞ ఉంది నీకు. నిశ్శంకగా సమీపించు.

**సీత:** (చూసి) ఇలా జరిగిందేమిటి?! మందభాగ్యురాలిని. అన్ని విధాలా హతాశనైనాను (*నేల వాలి విలపిస్తుంది*)

**వాల్మీకి:** లే సీతా! ధైర్యం తెచ్చుకో. నేను రామలక్ష్మణులను సేదదీరుస్తాను. ప్రియ రామా! ప్రియ లక్ష్మణా! ఊరడిల్లండి.

**సీత:** కుమారులారా! కుశా, లవా! ఊరడిల్లండి. (*నీళ్ళను చిలకరిస్తుంది*)

**రాముడు:** (*మూర్ఛ తేరి*) ఆర్యకణ్వా! వైదేహి జీవించి ఉన్నదా?

**వాల్మీకిః:** పురత ఏవ వర్తతే।

**రామః:** (*విలోక్య*) కథం భగవాన్ సమ్ప్రాప్తః। (*లజ్జాం నాటయతి*)

**వాల్మీకిః:** అలం లజ్జయా, కలత్రవిషయా ఖల్వనుకమ్పా।

**లక్ష్మణః:** (*ఆశ్వస్య*) అపి ప్రత్యాగతసంజ్ఞ ఆర్యః స్యాత్?

**రామః:** ప్రత్యాగతోఽస్మి మన్దభాగ్యః।

**కుశలవౌ:** (*సమాశ్వస్య*) హా తాత! పరిత్రాయస్వ। (*ఇతి పాదయోః పతిత్వా రుదతః*)

**రామలక్ష్మణౌ:** (*పరిష్వజ్య సమాశ్వాసయతః*) వత్సౌ! అలమావేగేన।

---

**వాల్మీకి:** సమక్షంలోనే ఉన్నది.

**రాముడు:** (చూసి) భగవాన్ వాల్మీకి ఎలా వచ్చారు? (*సిగ్గు పడతాడు*)

**వాల్మీకి:** సిగ్గు పడనక్కరలేదు. సీత మీద దయ నన్నిక్కడికి రప్పించింది.

**లక్ష్మణుడు:** (*మేలుకొని*) అన్న మూర్ఛ తేరాడా?

**రాముడు:** తేరుకున్నాను మందభాగ్యుణ్ణి.

**కుశలవులు:** (*తేరుకొని*) హా తండ్రీ! రక్షించు. (*పాదాలపై పడి ఏడుస్తారు*)

**రామలక్ష్మణులు:** (*కౌగిలించుకొని ఊరడిస్తారు*) వత్సలారా! కలవరపడకండి.

**వాల్మీకిః:** హే తాతదర్శనదుర్లలితౌ! కస్య క్వ రుద్యతే, ప్రమృజ్యతామశ్రు ।

**కుశలవౌ:** (*బాష్పం ప్రమృజ్య రామమవలోకయన్తౌ స్థితౌ*)

**సీతా:** (*అపవార్య*) *కో ఏసో, జో తు హ్మేపగ ఏవ్వం పేక్ఖిదో?*

(*అపవార్య*) క ఏషః, యో యువాభ్యామేవం ప్రేక్షితః?

**రామః:** అహో! ఔదాసీన్యం వైదేహ్యా యదియం చిరకాలోపనతమస్మ-త్సన్నిధానం ముఖవికాసేనాపి న సమ్భావయతి ।

**వాల్మీకిః:** (*సకోపమ్*) హే రాజన్! ధృతసౌహార్ద! మహాకులీన! సమీక్ష్యకారిన్! కిం యుక్తం తవ ప్రతిపాదితాం జనకేన, గృహీతాం దశరథేన, కృతమఙ్గలామరున్ధత్యా, విశుద్ధచారిత్రాం వాల్మీకినా, భావితశుద్ధిం

---

**వాల్మీకి:** తండ్రి దర్శనం కోసం ఆత్రపడుతున్న కుమారులారా! ఇప్పుడు ఎందుకు ఎవరికోసం శోకిస్తున్నారు? కన్నీరు తుడుచుకోండి.

**కుశలవులు:** (*కన్నీరు తుడుచుకొని రాముడి వంక చూస్తూ ఉంటారు*)

**సీత:** (*తల తిప్పుకొని*) ఎవరాయన? మీరిద్దరూ అలా చూస్తున్నారు?

**రాముడు:** ఎంత ఔదాసీన్యం! ఇన్నేళ్ళ తరువాత కనుపించిన నన్ను చూసిన సంతోషమే లేదు.

**వాల్మీకి:** (*కోపంగా*) ఓ రాజా! సౌహార్ద్రమూర్తీ! మహాకులీనా! విచక్షణశీలా! జనకమహారాజుచేత కన్యాదానం చేయబడి,

మాతరం కుశలవయోః, దుహితరం భగవత్యా విశ్వమ్భరాయాః, దేవీం సీతాం జనాపవాదమాత్రశ్రవణేన నిరాకర్తుమ్?

**రామః:** (*వైక్లవ్యం నాటయతి*)

**వాల్మీకిః:** సౌమిత్రే! యుక్తమిదమ్? అథ వా కస్తవోపాలమ్భః, నియోజ్యస్త్వం కనీయాన్।

(*రామముద్దిశ్య*) అథ దశగ్రీవవీరవధావసానే సీతాప్రతిగ్రహం ప్రతి కః ప్రమాణీకృతో దేవః ప్రమాణేన?

**రామః:** భగవాన్ వైశ్వానరః ।

---

దశరథమహారాజు చేత కోడలిగా స్వీకరించబడి, అరుంధతిచేత మంగళకరంగా ఆశీర్వదించబడి, పవిత్రచరిత్ర అని వాల్మీకిచేత నిశ్చయింపబడి, అగ్నిభట్టారకుడిచేత పాతివ్రత్యం నిర్ధారింపబడి, కుశలవులకు తల్లియై, భూదేవికి కుమార్తెయైన సీతాదేవిని, జనాపవాదశంకతో విడిచిపెట్టడం యుక్తమేనా?

**రాముడు:** (*విచారంగా నిలిచి ఉంటాడు*)

**వాల్మీకి:** సౌమిత్రీ! ఇది చేయదగినదేనా? అయినా నిన్ననటమెందుకు? నువ్వు నీకు చెప్పిన పని చేశావు.

(*రాముడిని చూస్తూ*) రావణవధానంతరం ఏ దేవుడు సీత పాతివ్రత్యాన్ని నిరూపించాడు?

**రాముడు:** అగ్నిభట్టారకుడు.

**వాల్మీకిః:** భోః ప్రత్యయనివృత్తేః కిం కారణమ్?

**సీతా:** *హద్ధి, హద్ధి, మమ అధణ్ణాఏ కిదే ఏవ్వం అదిక్ఖిఅది అంఅఉత్తో।* (*కర్ణౌ పిదధాతి*)

హా ధిక్, హా ధిక్, మమాధన్యాయాః కృత ఏవమధిక్షిప్యత ఆర్యపుత్రః। (*కర్ణౌ పిదధాతి*)

**వాల్మీకిః:** కుశలవజననీవిశుద్ధిసాక్ష్యే
పవనసఖా యది దేవతా నియుక్తా ।
కథమివ భవతో నిరఙ్కుశోఽయం
హృది నిహితో ను పృథగ్జనాపవాదః ॥21॥

**రామః:** (*ఆయుజ్యమానమివ*)

---

**వాల్మీకి:** మరి విశ్వాసం లేకపోవడానికి కారణం?

**సీత:** అయ్యో, అయ్యో! నాలాంటి అభాగ్యురాలి కోసం ఆర్యపుత్రుణ్ణి నిలదీస్తున్నారు.

**వాల్మీకి:** అగ్నిదేవుడే సీత విశుద్ధచరిత్ర అని సాక్ష్యమిచ్చాక, అడ్డూ అదుపులేని సాధారణజనులాడిన నిందకు నీ హృదయంలో ఎందుకు చోటునిచ్చావు?

**రాముడు:** (*చేతితో తాకుతాడు*)

**వాల్మీకిః:** కథం వీరహస్తేన మామతివాహయతి।

> అనుకృతిసరలే పృథగ్జనానాం
> నివసతి చేతసి సంశ్రితోఽనురాగః।
> నరపతిహృదయే న జాతమాల్యం (?)
> న హి పులినేషు తిలస్య సమ్భవోఽస్తి ॥22॥

వత్స! కిమనేన కణ్డూయనేన, గృహాణ కుశలవౌ, గచ్ఛామః స్వమాశ్రమపదమ్। (*ఇతి పరిక్రామతి*)

**రామలక్ష్మణౌ:** ప్రసీదతు, గచ్ఛతు భగవాన్।

**వాల్మీకిః:** (*ప్రతినివృత్త్య*) వైదేహి, తపోవనగతానామపి దణ్డం సమాజ్ఞాపయతి, తత్పరిశోధ్యతామాత్మా।

---

**వాల్మీకి:** తన హస్తస్పర్శతో ఎలా వారిస్తున్నాడు!

సామాన్యజనహృదయాలలో ప్రేమాభిమానాలు నిండి ఉంటయి, కానీ కుటిలమనస్కులైన రాజుల హృదయాలలో వాటికి స్థానమెక్కడ? అనతి-కాలంలోనే వాడిపోయే పూలదండ వంటిది రాజుల హృదయాలలోని అనురాగం. ఇసుక నేలలలో నువ్వులు మొలవవు కదా.

అమ్మా సీతా! అనవసరంగా మాటలెందుకు? కుశలవులను పిలు. మన ఆశ్రమానికి వెళ్ళి పోదాం. (వెళ్ళిపోబోతాడు)

**రామలక్ష్మణులు:** మహర్షీ! మా పట్ల ప్రసన్నులై వెళ్ళండి.

**సీతా:** *అహం కిం పరిసోధేమి?*

అహం కిం పరిశోధయామి?

**వాల్మీకిః:** అపాపా భవసి ।

**సీతా:** (*సలజ్జమ్*) *జణమజ్ఝగదా ఏవ్వం భణామి – మన్దభాఇణీ విదేహరాఅతనఆ అహిణ్ణచారిత్తేత్తి ।*

(*సలజ్జమ్*) జనమధ్యగతైవం భణామి – మన్దభాగినీ విదేహరాజ-తనయాఽభిన్నచారిత్రేతి ।

**వాల్మీకిః:** సముద్ఘుష్యతాం వికారానురూపః ప్రతికార ఇతి ।

---

**వాల్మీకి:** (*తిరిగివచ్చి*) వైదేహీ! ఈ రాజు మునులను కూడా దండించగలడు. అందువల్ల నీ పవిత్రతను నిరూపించుకో.

**సీత:** నేనెలా నిరూపించుకోగలను?

**వాల్మీకి:** ఎలా నువ్వు నిర్దోషివని తెలుస్తుందో అలా.

**సీత:** (*సిగ్గుతో*) అందరి మధ్యలో నిలబడి, ఇలా ప్రకటిస్తున్నాను. ఈ మందభాగ్యురాలు, విదేహరాజకుమార్తె పవిత్రురాలు...

**వాల్మీకి:** నీపై మోపిన నింద తొలగిపోయే ఉపాయాన్ని బిగ్గరగా ప్రకటించు.

**సీతా:** *పహావది గురుణిఓఓ।*

(*అఞ్జలిం బద్ధ్వా దిశో విలోక్య*) *సుణ్ణంతు భవన్తో లోఅపాలా గఅణమజ్ఝచారిణో దేవదాఓ గంధవ్వసిద్ధవిజ్ఝాధరా జో అ ప్పవాహ-పచ్చక్ఖీకిదసవ్వలోఅరహస్సా వమ్మీ ఇవిస్సమిత్తవసిత్థపముహా మహేసిణో, ఏసో సఅలలోఅసుహాసుహకమ్మసక్ఖీ భఅవం రాహవఉలపిదామహో సహస్సరస్సిం అ సీదా చారిత్తసుద్ధిం అన్తరేణ ఏవ్వం సచ్చావణది।*

ప్రభవతి గురునియోగః। (*అఞ్జలిం బద్ధ్వా దిశో విలోక్య*) శృణ్వన్తు భవన్తో లోకపాలా గగనమధ్యచారిణో దేవతా గన్ధర్వసిద్ధవిద్యాధరా యే చ ప్రభావప్రత్యక్షీకృతసర్వలోకరహస్యా వాల్మీకివిశ్వామిత్రవసిష్ఠప్రముఖా మహర్షయః, ఏష సకలలోకశుభాశుభకర్మసాక్షీ భగవాన్రాఘవకుల-పితామహః సహస్రరశ్మిశ్చ సీతాచారిత్రశుద్ధిమన్తరేణైవం సత్యాపయతి।

---

**సీత:** గుర్వాజ్ఞ అనుల్లంఘనీయం.

(*చేతులు జోడించి*) ఓ లోకపాలకులారా! వినండి. గగనమధ్య-చారిణులైన దేవగంధర్వసిద్ధవిద్యాధరులారా! తపఃప్రభావంతో సకలలోక-రహస్యాలను ఎరుగగల వాల్మీకివిశ్వామిత్రవశిష్ఠాది మహర్షిగణములారా! సకలలోకశుభాశుభకర్మసాక్షీ, రఘుకులపితామహా, సహస్రకిరణుడవైన సూర్యదేవా! సీత పాతివ్రత్యనిరూపణార్థం ప్రమాణం చేస్తున్నది.

**వాల్మీకిః:** పశ్యన్తు భవన్తః మహాప్రభావాకృష్టమపిసీతామాహాత్మ్య-సంభృతమాశ్చర్యమ్।

**సర్వే:** (సవిస్మయమ్) ఆశ్చర్యమాశ్చర్యమ్ । ఏష హి దేవీవచనస్య సమనన్తరం దత్తావధాన ఇవ నిఃశబ్దప్రశాన్తో నివృత్తసర్వారమ్భః కృత్స్న ఏవ స్థావరజఙ్గమో లోకః సంప్రవృత్తః। తథా హి –

ఉదన్వన్తః శాన్తాః స్తిమితతరకల్లోలవలయా
నిరారమ్భో వ్యోమ్ని ప్రకృతిచపలోఽప్యేష పవనః।
ప్రవృత్తా చైతస్మిన్నిభృతతరకర్ణా గజఘటా
జగత్ కృత్స్నం జాతం జనకతనయోక్తావవహితమ్ ॥23॥

**సీతా:** *జది మఏ సఅలలోఅమహత్థప్పచ్ఛఆపూరిదగురుసాసణం ఉమ్మల్లిఅ మహామహీహరసహస్సవిరఇద సేదుబన్ధవిభత్తమహాసముద్దం సురాసురభువణేక్కధణుద్ధరం రాహవకులణందణం తుమం ఉజ్ఝిఅ పఇవ్వదావిరుద్ధేణ భావేణ అణ్ణో కోవి ణఅణేహిం ణివ్వణ్ణిదో, వఅణేణ*

---

**వాల్మీకి:** అందరూ చూడండి, మహాప్రభావశాలురైన దేవతలనే ఆకర్షించగల సీతాసతీత్వప్రభావం.. . ఆశ్చర్యం!

***అందరూ:*** (*ఆశ్చర్యంగా*) ఆశ్చర్యమాశ్చర్యం! సీతాదేవి ప్రార్థించిన తరువాత, సమస్తచరాచరప్రపంచం ధ్యానమగ్నమైనట్లు నిశ్చేష్టమైంది. నిశ్శబ్దంగా ఉంది. ఏనుగుల గుంపులు చెవులు కూడా కదపకుండా ప్రతిమలలా నిలుచున్నాయి. చరాచరప్రపంచమంతా సీతాదేవి మాటలను వినడానికి సావధానమైంది.

*ఆలవిదో, హిఅఏణ వా చింతిదో ఏదిణా సచ్చవఅణేణ సఅలలోఅపచ్చక్ఖ-దీసమాణదివ్వరూపధారిణీ భఅవదీ మహప్పహావా చిత్తశుద్ధిం మే లోఅస్స పఆసీకరోదు (పఅడీకరోదు)।*

యది మయా సకలలోకమహార్ఘప్రత్యయాపూరితగురుశాసన-మున్మూలితమహామహీధరసహస్రవిరచిత సేతుబన్ధవిభక్తమహాసముద్రం సురాసురభువనైకధనుర్ధరం రాఘవకులనన్దనం త్వాముజ్ఝిత్వా పతివ్రతా-విరుద్ధేన భావేనాన్యః కోపి నయనాభ్యాం నిర్వర్ణితః, వచనేనాలపితః, హృదయేన వా చిన్తితః, ఏతేన సత్యవచనేన సకలలోకప్రత్యక్ష దృశ్యమాన దివ్యరూపధారిణీ భగవతీ మహాప్రభావా చిత్తశుద్ధిం మే లోకస్య ప్రకాశీకరోతు (ప్రకటీకరోతు)।

(*సర్వే సమ్భ్రమం నాటయన్తి*)

---

***సీత:*** నేను, సమస్తజగత్కల్యాణం కొరకు, పితృవాక్యపరిపాలనార్థం అరణ్యవాసం చేసి, మహాపర్వతశిలలతో సముద్రానికి వారధి కట్టిన, దేవదానవమానవలోకాలలో ఏకైకధనుర్ధరుడైన రఘుకులనందనుడు రాముణ్ణి తప్ప పరపురుషుడి గురించి పతివ్రతాధర్మానికి విరుద్ధంగా మనస్సులో ఆలోచించి ఉంటే, మాటలలో ప్రస్తావించి ఉంటే, కన్నెత్తి చూసి ఉంటే – నా ఈ సత్యవాక్యాలను భగవతి పృథ్వీమాత ధ్రువీకరించు గాక!

(*అందరూ సంభ్రమంగా చూస్తూ ఉంటారు*)

**వాల్మీకిః:** కిమేతదవ్యక్తభీషణం లోకస్య రసాన్తరమావిర్భూతమ్।

నాదః పాతాలమూలాత్ప్రభవతి తుములం పూరయన్ వ్యోమరన్ధ్రం
పాతక్లిష్టా ఇవైతే దిశి దిశి గిరయో మన్దమన్దాశ్చరన్తి।
బద్ధానన్దాః సమన్తాల్లవణజలధయో మథ్యమానా ఇవాసన్
సీమాముల్లఙ్ఘ్య వేగాదుదనిధిసలిలైః స్వాని వేలావనాని ॥24॥

సీతే! త్వాముద్దిశ్య ప్రాదుర్భూతాని సర్వలక్షణాని, పునరప్యావర్తతాం సత్యమ్।

**సీతా:** (*"జఇ మఏ సఅలలోఅ" ఇత్యాది పఠతి*)

---

**వాల్మీకి:** ఇదేమి, ఇక్కడ ప్రకటితమైంది ప్రకృతి అస్పష్టభీషణరూపం.

ఆకాశరంధ్రాలను పూరిస్తూ పాతాళాన్ని చీల్చుకుని మహానాదం వెలువడింది. పడిపోతాయేమోనన్న భయంతో పర్వతాలు మెల్లగా కదులుతున్నాయి. సముద్రజలాలు చెలియలికట్టలు దాటి వచ్చి, ఇతర-జలనిధులతో కలిసి తీరప్రాంతవనాలను ముంచి వేస్తున్నాయి.

సీతా! నీకోసమే ఉద్భవించినవీ ఉత్పాతాలు. మళ్ళీ ఒకసారి సత్యప్రకటన చెయ్యి.

**సీత:** (*అవే మాటలను పునరుద్ఘాటించింది*)

(*నేపథ్యే*)

స్వస్తి గోభ్యః, స్వస్తి బ్రాహ్మణేభ్యః, స్వస్తి రాఘవకులాయ।

ఆకృష్టా మిథిలాధిరాజతనయాసత్యేన పాతాలత–
స్తోయాన్మజ్జనలీలయా తనుమిమాం హిత్వాత్మనః స్థావరామ్।
సాక్షాల్లక్షితదివ్యమూర్తిమహిమాయోగేన విశ్వమ్భరా
లోకం మధ్యమమమ్బురాశిరశనా దేవీ సమారోహతి ॥25॥

**సర్వే:** (*ఆకర్ణ్య విస్మయం నాటయన్తి*)

**వాల్మీకిః:** కథమదృష్టపూర్వాశ్రుతపూర్వేయమాశ్చర్యపరమ్పరావృత్తిః।

ఏతజ్జ్యోతిరుదేతి నాగభవనాత్సంవాసయన్తశ్చిరా–
న్మాల్యైః శీతలపద్మగన్ధిసుభగాః పాతాలవాతా దిశః।

---

(*తెర వెనుకనుంచి*)

గోబ్రాహ్మణులకు శుభం. రఘుకులానికి శుభం.

మైథిలి సత్యప్రమాణాన్ని విని, పాతాళలోకం నుండి ఆకర్షింపబడి సముద్రమేఖలయైన వసుంధర తన జడరూపాన్ని వదలి, దివ్యరూపాన్ని ధరించి భూలోకానికి వచ్చింది.

**అందరూ:** (*విని ఆశ్చర్యానికి లోనవుతారు*)

**వాల్మీకి:** ఈ తేజస్సు పాతాళంనుండి బయలుదేరింది.

చల్లని కమలగంధంతో కూడి, పాతాళంలో నుండి వచ్చిన గాలులు

ఏషావిర్భవతి క్రమేణ వసుధా రాజన్! దధానాఞ్జలిం
సౌమిత్రే! ప్రణమాదరాత్ కుశలవౌ! పుష్పాఞ్జలిః కీర్యతామ్ ॥26॥

**సర్వే:** (*యథోక్తం నాటయన్తి*)

(*తతః ప్రవిశతి పాతాలోద్భేదం నాటయన్తీ పుష్పవర్షాభిర్నారీభిః సహ సమానోదాత్తోజ్జ్వలవేషాభిశ్చ పృథ్వీ*)

**సర్వే:** (*కృతాఞ్జలయః*)

త్వం బిభర్షి జగత్ కృత్స్నం శేషమూర్ధ్నా త్వముహ్యసే।
కామ్యానభిమతాన్ దేవాస్త్వామేవ దుదుహుః పురా ॥27॥

---

దిక్కులను నింపుతున్నవి. పృథ్వి మెల్లగా ప్రకటితమౌతున్నది. రామా! నువ్వు అంజలి ఘటించు. లక్ష్మణా! ప్రణామం చెయ్యి. కుశలవులారా! మీరు పుష్పాలను చల్లండి.

**అందరూ:** (*ఆయన ఆదేశాన్ని పాటిస్తారు*)

(*అప్పుడు భూమిని చీల్చుకుని పాతాళంనుండి పృథ్వీదేవత, ఆమెపై పుష్పవర్షాన్ని కురిపిస్తూ దివ్యాంబరధారిణులైన స్త్రీలు ప్రత్యక్ష మైనారు*)

**అందరూ:** (*అంజలి ఘటించి*)

అమ్మా! నువ్వు సకలజగత్తును పోషించేదానవు. శేషుడి తలలపై నిలిచినదానవు. పురాణకాలం నుండి దేవతలు, తాము కోరిన వస్తువుల-నన్నింటినీ నీనుండే పొందుతున్నారు.

ఉన్నతౌ విన్ధ్యకైలాసౌ తవ దేవి! పయోధరౌ।
జాహ్నవీ హారయష్టిస్తే సముద్రా రత్నమేఖలాః ॥28॥

యజ్ఞాఙ్గానాం సముత్పత్త్యై వాసవస్త్వాం ప్రవర్షతి।
రత్నానామోషధీనాం చ త్వాం ప్రసూతిం ప్రచక్షతే ॥29॥

నమో భగవత్యై విశ్వమ్భరాయై । (ప్రణమన్తి)

**పృథ్వీ:** (*దిశో విలోక్య*) అహో! అనతిక్రమణీయం శాసనం ప్రతినివృత్తానాం పతివ్రతానామ్।

వ్యాప్య ద్యావాపృథివ్యౌ ప్రతిహతగతయో యత్ర భానోర్మయూఖాః
గామ్భీర్యాక్షీణవేగో నియమయతి గతిం యచ్చ వోఢుం గరుత్మాన్।
యత్ స్థానం విప్రకర్షాత్ పరిమితతపసాం యోగినామప్యగమ్యం
తస్మాదాకృష్య సాహం జనకతనయయా దూరమారోపితాస్మి ॥30॥

---

తల్లీ, వింధ్యకైలాసపర్వతాలు రెండూ నీ స్తనాలు. భాగీరథి, గంగ నీ కంఠహారం. సముద్రాలు నీకు రత్న మేఖలలు.

మాతా! ఇంద్రుడు యజ్ఞసాధనాలను ఉత్పత్తి చెయ్యడానికి నీపై వర్షాన్ని కురిపిస్తాడు. రత్నాలకు, ఔషధాలకు నువ్వే ఉత్పత్తిమూలానివని అంటారు.

భగవతి విశ్వంభరకు నమస్కారము.

**పృథ్వీ:** (*నాలుగు దిక్కులూ చూసి*) ఆహా! పతివ్రతల ఆదేశం దాటరానిది గదా!

తత్త్రామివాభిభాషిష్యే। వత్సే, మైథిలి, కర్తవ్యతాం కేనార్థయసి?

**సీతా:** (*సవిస్మయం విలోక్య*) *భఅవది, కా తుమం?*

(*సవిస్మయం విలోక్య*) భగవతి! కా త్వమ్?

**పృథ్వీ:** కిం న మాం వేత్తి భవతీ?

మామామనన్తి మునయః ప్రణవద్వితీయాం
మత్తః ప్రసూతిరఖిలస్య చరాచరస్య।
మయ్యేవ సిద్ధ్యతి తపోఽవనిదేవతాం త్వం
జానీహి జానకి! తవాన్తికమాగతాం మామ్ ॥31॥

---

భూమ్యాకాశాలలో వ్యాపించే సూర్యకిరణాలు కూడా చొరరాని ప్రదేశం నుండి, అదుపులేని వేగాన్ని కలిగిన గరుత్మంతుడు కూడా తన వేగాన్ని అదుపులోకి తెచ్చుకోకతప్పని ప్రదేశం నుండి, సాధారణయోగులు చేరరాని దూరప్రదేశం నుండి, ఆ స్థానం నుండి జానకి ద్వారా ఆకర్షించబడి, ఇక్కడికి చేరాను.

అందుచేత, ఆమెతోనే మాట్లాడుతాను. వత్సే! మైథిలి! నానుంచి ఏమి కోరుతున్నావు చెప్పు.

**సీత:** (*ఆశ్చర్యంతో చూస్తూ*) భగవతీ! ఎవరు నువ్వు?

**పృథ్వి:** ఏమిటీ? నన్నెరుగవా నువ్వు! ఓంకారసహితమైన దానిగా నన్ను మునులు భావిస్తారు. (ఓం భూః భువః స్వః) . అఖిల చరాచరాలు నానుండే

అపి చ వత్సే! జ్ఞాయతామిదమపి–

అభ్యుద్ధృతిశ్చ సహసా మమైవేయమనుష్ఠితా ।
పురా మహావరాహేణ త్వత్ప్రభావేన సామ్ప్రతమ్ ॥32॥

**సీతా:** (*అఞ్జలిం బద్ధ్వా*) *భఅవది అణుకమ్పం అజ్ఝాసిఅ జహా తుఏ ఏవ్వం చారిత్తావికలత్తణేణ అహిల్లక్ఖిదా తహ లోఅస్స పఆసీఅదు ।*

(*అఞ్జలిం బధ్వా*) భగవతి! అనుకమ్పామధ్యాస్య యథా త్వయైవం చారిత్రావికలత్వేనాభిలక్షితా తథా లోకస్య ప్రకాశ్యతామ్ ।

**పృథ్వీ:** తథాస్తు । (*సమన్తాదవలోక్య*)

ఋషయో దానవాః సిద్ధా యక్షగన్ధర్వకిన్నరాః ।
మానవా లోకపాలాశ్చ భవన్త్వవహితాః క్షణమ్ ॥32॥

---

ఉద్భవిస్తయి. నా ఆశ్రయం వల్లనే తపస్సులు సిద్ధిస్తయి. తెలుసుకో సీతా! నేను నీ పిలుపు విని వచ్చాను.

అమ్మా సీతా! ఇది కూడా తెలుసుకో. నన్ను ఇలా పాతాళం నుండి పైకి తెచ్చింది పూర్వం వరాహ రూపంలో విష్ణుమూర్తి. నేడు నువ్వు.

**సీత:** (*అంజలిబంధంతో*) భగవతి! నామీద కృపతో ఎలా వచ్చావో అలాగే నేను పవిత్రచరిత్రనని లోకానికి ప్రకటించి నా యెడల కృప చూపించు.

**పృథ్వి:** తథాస్తు! (*నాలుగు దిక్కులను చూసి*)

ఓ ఋషి, దేవ, దానవ, సిద్ధ, యక్ష,గంధర్వ, మానవ, లోకపాలకులారా!

రామం దాశరథిం ముక్త్వా న జాతు పురుషాన్తరమ్।
మనసాపి గతా సీతేత్యేవం విదితమస్తు వః ॥33॥

(*ఆకాశాత్పుష్పవృష్టిః దున్దుభిధ్వనయశ్చ*)

**సర్వే:** (*సహర్షమ్*) అహో విస్మయః। వసున్ధరాసమ్పాదితశుద్ధిమను-వర్తయన్తి బహువిధాన్యేతాని ప్రాదుర్భవన్తి –

ఆశాముఖే త్రిదశదున్దుభయో ధ్వనన్తి
వ్యోమ్నః పతన్తి కుసుమాని నిరన్తరాణి।
ఆకస్మికోఽప్యుపరి ధార్యత ఏవం దేవ్యాః
కేనాప్యవధ్యవితతే గగనే వితానః ॥34॥

---

అందరూ వినండి. ఈ సీత దాశరథి అయిన రాముణ్ణి కాక అన్య-పురుషులను మనస్సులో కూడా ఎన్నడూ తలవలేదు. ఈ సత్యం మీకందరికీ తెలియుగాక!

(*పూలవాన కురిసింది; దేవదుందుభులు మ్రోగాయి*)

(*సంతోషంగా*) ఆహా! ఆశ్చర్యమాశ్చర్యం! భూదేవి పలుకులను సమర్థిస్తూ అనేకనిమిత్తాలు గోచరిస్తున్నాయి.

దిక్కులన్నింటినుండీ దేవదుందుభులు మోగుతున్నాయి. ఆకాశం నుండి ఎడతెగని పుష్పవృష్టి కురుస్తున్నది. సీతాదేవి తలపైన ఆకాశంలో దివ్యవితానం పరువబడింది.

(నేపథ్యే)

జయతి దశరథః స సత్యసన్ధో
జయతి తథైకధనుర్ధరశ్చ రామః।
జయతి రఘుకులం కలఙ్కముక్తం
జయతి చరిత్రగుణాన్వితా చ దేవీ ॥36॥

**పృథ్వీ:** అపి శుద్ధిమతీ వైదేహీ?

**సర్వే:** (కృతాఞ్జలయః)

యా స్వయం ప్రకృతినిర్మలా సతీ
ఛాద్యతేఽన్యజనవాదవారిదైః।

---

(*తెర వెనుకనుంచి*)

సత్యసంధుడైన దాశరథికి జయము, జయము. ధనుర్ధరుడైన రాముడికి జయము. నిష్కళంకమైన రఘుకులమునకు జయము. శీలవతి సీతకు జయము.

**పృథ్వి:** వైదేహి శీలవతి అని నిరూపించబడిందా?

***అందరూ:*** (*అంజలి ఘటించి*) భగవతీ! సీత స్వతహాగానే నిర్మలమైనది. అయినా, శరత్కాలం చంద్రుణ్ణి ప్రకాశింపజేసినట్లు, నువ్వు లోకాపవాదమనే మేఘంచేత ఆవరింపబడిన సీతను ఈనాడు కళంకం

జానకీ భగవతి! త్వయాద్య సా
చన్ద్రికేవ శరదా విశోధితా ॥37॥

(*ప్రణమన్తి*) అపినామాశ్చర్యం మిథునం భూయః సంయుజ్యతే!

**వాల్మీకిః:** భో భోః కౌసల్యామాతః సమ్భావ్యతాం సీతా పరిశుద్ధి-పరిగ్రహేణ।

**రామః:** యదాజ్ఞాపయన్తి గురవః। వత్స లక్ష్మణ! క్రియతాం పాదప్రణామః।

**సీతా:** (*అఞ్జలిం బద్ధ్వా సహర్షమ్*) *జేదు అంఅఉత్తో*,

(*అఞ్జలిం బద్ధ్వా సహర్షమ్*) జయత్వార్యపుత్రః।

**వాల్మీకిః:** అహో! ఉదాత్తశాలీనః ప్రతిగ్రహప్రకారః।

---

నుండి ముక్తురాలిని చేసి, శుద్ధిని నిరూపించావు. (*నమస్కరించి*) ఈ దంపతులు మళ్ళీ ఒక్కటైతే ఆశ్చర్యపోవాల్సిన పనేముంది?

**వాల్మీకి:** కౌసల్యానందనా! తన నిర్మలత్వాన్ని అంగీకరించి సీతను సాదరంగా స్వీకరించు.

**రాముడు:** గురుజనుల ఆజ్ఞ. లక్ష్మణా! సీతకు పాదాభివందనం చెయ్యి.

**సీత:** (*చేతులు జోడించి, సంతోషంతో*) ఆర్యపుత్రులకు జయమగుగాక!

**వాల్మీకి:** ఎంత ఉదాత్తగంభీరంగా స్వీకరించాడు!

**లక్ష్మణః:** (*సహర్షం సలజ్జం చ*) ఆర్యే! వధ్యః పాతకీ లక్ష్మణః ప్రణమతి।

**సీతా:** *కీస తుఏ అప్పా ణిందిఅది, ఏవ్వం అప్పగురుణిఓఅవట్టీ చిరం జీవ।*

కుతస్త్వయాఽఽత్మా నిన్ద్యతే, ఏవమాత్మగురునియోగవర్తీ చిరం జీవ।

**వాల్మీకిః:** వత్స రామ, అనేన గృహీతా వైదేహీ। స్వయమాభాష్య పాణినా పాణౌ సఙ్గృహ్య నియుజ్యతాం యజ్ఞాధికారే।

**రామః:** (*లజ్జాం నాటయతి*)

**వాల్మీకిః:** అలం లజ్జయా, యజ్ఞాఙ్గం వినా కిం వాఽపూర్వం దాశరథేః సర్వసాక్షికం పాణిగ్రహణమితి?

---

**లక్ష్మణుడు:** (*సంతోషంతో, బిడియంగా*) అమ్మా! చంపదగిన పాపి లక్ష్మణుడు మీ చరణాలకు ప్రణామం చేస్తున్నాడు.

**సీత:** నాయనా! ఎందుకు ఆత్మనింద చేసుకుంటావు? పెద్దల ఆదేశాన్ని పాలించే నువ్వు చిరంజీవిగా ఉండు.

**వాల్మీకి:** వత్సా రామా! వైదేహిని స్వీకరించినట్లే గదా! స్వయంగా పిలిచి చేయిపట్టుకుని యజ్ఞాధికారమివ్వు.

**రాముడు:** (*సిగ్గుపడతాడు*)

**వాల్మీకి:** సిగ్గెందుకు? పాణిగ్రహణానికి యజ్ఞాధికారప్రదానం కన్నా అపూర్వం ఏముంటుంది? దాశరథీ! సర్వసాక్షిగా పాణిగ్రహణం ఇది.

**రామః:** సమాచారోఽయం గురునియోగశ్చ (*సీతాం పాణౌ గృహీత్వా*) భద్రే వైదేహి!

> అపత్యమిష్టం చ వదన్తి దేవాః
> ఫలద్వయం దారపరిగ్రహస్య।
> పూర్వం తయోస్త్వయ్యుదపాది హృద్యం
> వహస్వ వాసే భవనే ద్వితీయమ్ ॥38॥

**సీతా:** *జం అంఅఉత్తో ఆణవేది। ఉచ్ఛసిఓ మే అప్పా। పచ్ఛాగదా మే పాణా।*

యదార్యపుత్ర ఆజ్ఞాపయతి। ఉచ్ఛ్వసితో మే ఆత్మా। ప్రత్యాగతా మే ప్రాణాః।

---

**రాముడు:** ఇది సదాచారమూ, గురువుల ఆదేశమున్నూ.

కల్యాణీ! సీతా! పండితులు వివాహానికి రెండు ఫలాలని చెప్తారు. అవి, సంతానమూ, యజ్ఞసంపాదన. వాటిలో ఒకటి నువ్వు ఇప్పటికే ప్రసాదించావు. ఇంటికి వచ్చి రెండవది కూడా సఫలం చెయ్యి.

**సీత:** ఆర్యపుత్రుల ఆజ్ఞ. నాకు ఊపిరి ఆడుతున్నది. ప్రాణాలు తిరిగివచ్చినాయి.

**పృథ్వీ:** అవిఘ్నమస్తు యజ్ఞానాం కాలే వర్షతు వాసవః।
నిరాతఙ్కాః ప్రజాః సన్తు సీతారామసమాగమాత్ ॥39॥

(*అన్తర్ధానం నాటయన్తీ నిష్క్రాన్తా*)

**రామః:** కథమన్తర్భూతా వసుమతీ!

**వాల్మీకిః:** అనతిదీర్ఘసన్నిధానా హి దేవతాః।

**రామః:** భగవతాహమప్యనుజ్ఞాతో లక్ష్మణమభిషేక్తుమిచ్ఛామి।

**లక్ష్మణః:** (*అఞ్జలిం బద్ధ్వా*) యది ప్రసన్నమార్యేణ, తేన తనయ-సఙ్క్రామిణా యువరాజశబ్దేన విభజ్యతాం చిరకాలానుచరః సౌమిత్రిః ।

---

**పృథ్వి:** యజ్ఞాలు నిర్విఘ్నంగా జరుగుగాక! ఇంద్రుడు సకాలంలో వర్షాలను కురిపించుగాక! సీతారాముల కలయికతో ప్రజలు సుఖశాంతులతో ఉందురు గాక! (*మాయమవుతుంది*)

**రాముడు:** ఎలా అంతర్ధానమైంది వసుమతి!

**వాల్మీకి:** దేవతలు దీర్ఘకాలం కనిపించరు.

**రాముడు:** భగవానులు అనుమతిస్తే, లక్ష్మణుడికి రాజ్యాభిషేకం చేస్తాను.

**లక్ష్మణుడు:** (*అంజలి ఘటించి*) అన్నగారు నా పట్ల ప్రసన్నులైతే, చిరకాలానుచరుడైన లక్ష్మణుడి నుంచి ఈ యువరాజశబ్దం మీ తనయుడికి సంక్రమించనివ్వండి.

**వాల్మీకిః:** ఇక్ష్వాకుకులసదృశమభిహితమ్।

**రామః:** కా గతిః, అనతిక్రాన్తైవ రామేణ లక్ష్మణప్రార్థనా। అవశ్యం చేదిదం కర్మ వత్సస్య, తదహమేవ తత్ప్రతిపత్స్యే । సౌమిత్రే! ఆనీయతామభిషేకసమ్భారః।

**లక్ష్మణః:** ఆర్య, సమ్పాదితం సర్వమభిషేకసమయోచితం వ్యగ్రహస్తా-భిర్దేవతాభిః । పశ్య –

> ఏతచ్ఛత్రం వహతి భగవాన్ వాసవశ్చన్ద్రగౌరం
> దేవీ వాలవ్యజనయుగలం జహ్నుకన్యా శచీ చ।
> అమ్భోగర్భాన్ కనకకలశాన్ ధారయన్తి ప్రజౌఘా–
> శ్చిత్రం నైతత్ ప్రణయసులభాః సమ్పదస్తద్విధానామ్ ॥40॥

---

**వాల్మీకి:** ఇక్ష్వాకులకు తగినట్లే మాట్లాడాడు లక్ష్మణుడు.

**రాముడు:** ఇంకేం చెయ్యగలను! లక్ష్మణుడి ప్రార్థనను ఎలా నిరాకరించగలను? ఈ అభిషేకం పుత్రుడికే చెయ్యవలసి వస్తే నేనే స్వయంగా చేస్తాను. లక్ష్మణా! అభిషేకసంభారాలు సమకూర్చు.

**లక్ష్మణుడు:** అభిషేక సంభారాలన్నీ దేవతలే సమకూర్చారు. ఇంద్రుడు తెల్ల గొడుగును ధరించాడు. శచీదేవీ, గంగాదేవీ వింజామరలను ధరించారు. కనకకలశాలలో జలాలను నింపుకుని ప్రజలు నిలిచి ఉన్నారు. ప్రేమవల్ల అన్నీ సమకూడడంలో ఆశ్చర్యమేముంది!?

**రామః:** ఆవయోస్తర్హి వేత్రాధికారః।

**లక్ష్మణః:** అనుగృహీతాభియోగః సంవిభాగః।

**రామః:** లక్ష్మణ, వేత్రం ధారయ। (*వాల్మీకిముద్దిశ్య*) భగవన్నభిషిచ్యతాం నప్తా।

**వాల్మీకిః:** (*కలశమాదాయోపసర్పన్*) భో భోః సాకేతనివాసినః పౌరాః! నానాదిగన్తవాసినో రాజానః! విభీషణసుగ్రీవహనుమత్ప్రభృతయో మహారథాః! శృణ్వన్తు భవన్తః –

మైథిలీతనయః శ్రేష్ఠః కుశో నామ మహారథః।
అభిషిక్తోఽద్య సామ్రాజ్యే మాన్యతామస్య శాసనమ్ ॥41॥

---

**రాముడు:** అయితే మనిద్దరం వేత్రదండాలను ధరిద్దాం.

**లక్ష్మణుడు:** ఈ ఆదేశంతో మీరు నా విన్నపాన్ని మన్నించారు.

**రాముడు:** లక్ష్మణా, వేత్రాన్ని ధరించు. (*వాల్మీకితో*) భగవన్! మనుమణ్ణి అభిషేకించండి.

**వాల్మీకి:** ఓ అయోధ్యా నగర పౌరులారా! నానాదేశరాజులారా! విభీషణసుగ్రీవహనుమదాది మహారథులారా! అందరూ వినండి.

సీతారాముల పుత్రులలో జ్యేష్ఠుడు, గుణశ్రేష్ఠుడు, కుశుడు నేడు సార్వభౌముడిగా అభిషిక్తుడైనాడు. మీరందరూ ఇతని శాసనాన్ని పాలించండి.

పురన్దరస్య యత్ స్వర్గే పాతాలే యచ్చ వాసుకేః।
పృథివ్యాం యచ్చ మాన్ధాతుస్తదస్తు తవ మఙ్గలమ్ ॥42॥

(*నేపథ్యే కలకలః*)

జయ జయ మహారాజ।

**సీతా:** *పియం మే దిట్ఠిఆ సంఉత్తం।*

ప్రియం మే దిష్ట్యా సంవృత్తమ్।

**రామః:** పూర్ణాస్తే లక్ష్మణస్య మనోరథాః।

**సర్వే:** (*హర్షం నాటయన్తి*)

---

స్వర్గంలో ఇంద్రుడికి, పాతాళలోకంలో వాసుకికి, భూమిపైన మాంధాతకు ఏది వైభవమో అది నీ వైభవం.

(*నేపథ్యంలో కోలాహలం*)

జయము, జయము మహారాజా!

**సీత:** నాకు ప్రియమైనది జరిగింది.

**రాముడు:** లక్ష్మణుడి కోరికలు నెరవేరాయి.

**అందరూ:** (***సంతోషాన్ని ప్రకటిస్తారు***)

**రామః:** (*కుశముద్దిశ్య*) రాజన్, త్వయాఽహమభ్యనుజ్ఞాతో యౌవరాజ్యే లవమభిషేక్తుమిచ్ఛామి ।

**కుశః:** యదాజ్ఞాపయతి దేవస్తాతః ।

**రామః:** (ప్రకామం కలశమానీయ)

మహారాజకుశస్యాయం లవో నామ ప్రియానుజః ।
మయా తద్వచనాదేవ యౌవరాజ్యేఽభిషిచ్యతే ॥43॥

**సర్వే:** (*యథోచితం హర్షం నాటయన్తి*)

**వాల్మీకిః:** కిం తే భూయః ప్రియముపహరామి ।

---

**రాముడు:** (*కుశుడితో*) రాజా! మీరు అనుమతిస్తే లవుడికి యౌవరాజ్యాభిషేకం చేద్దామనుకుంటున్నాను.

**కుశుడు:** పితృదేవుల ఆజ్ఞ.

**రాముడు:** (*సంతోషంతో, కలశాన్ని చేతుల్లోకి తీసుకొని*) మహారాజైన కుశుడియొక్క తమ్ముడు లవుడు అనే వానిని, రాజాజ్ఞ ప్రకారం యువరాజుగా అభిషేకిస్తున్నాను.

**అందరూ:** (*హర్షాన్ని ప్రకటిస్తారు*)

**వాల్మీకి:** ఇంకా నీ కోరిక ఏమిటి?

